The one and only Magazine devoted to Humour & Music

పేజీలు : 68+8
వెల : రూ.10
1-15 మార్చి 2002

# హాసం

హాస్య-సంగీత పత్రిక



సెంటర్‌స్ప్రెడ్‌లో

నీలాంబరి

నీతో చెప్పాలని...

పాటల పుస్తకాలు

శివరాత్రి
భక్తిగీతాల స్పెషల్



# ఇవీ సంగతులు

హాసం
హాస్య-సంగీత పత్రిక

Also available on net www.haasam.com

# హాస్యం సంగీతం



**సీరియల్ :**





**కథలు :**



**క్లాసిక్స్ రీటోల్డ్:**



**సినిమా:**

**హ్యూమరథం:**





**బాపూరమణీయం:**



**శీర్షికలు:**



**స్ట్రిప్స్:**









**శాస్త్రీయం:**





**లలితం:**



**సినిమా:**







**అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం**



**ప్రత్యేక వ్యాసాలు**





**శీర్షికలు:**







సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'నీతో చెప్పాలని..', 'నీలాంబరి'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో

ఫొటో కర్టెసీ:
12, 13, 67 పేజీలలో
ఎన్.టి.ఆర్. ఫోటలు -
శ్రీ నందగోపాల్
67వ పేజీలో ఎ.యన్.ఆర్.
ఫొటో -
శ్రీ సంజయ్ కిశోర్



ఘంటసాల పజిల్
వివరాలు
వచ్చే సంచికలో...

ముఖచిత్రం: 'నీ ప్రేమకై..' సినిమా నుండి అబ్బాస్, లయ, వినీత్

కవర్ డిజైన్ : ఈరంకి



# ప్రియా జనవాక్యం

హాసం సంపాదకులకు

రమణ నమస్కరించి వ్రాసేది. 'హాసం' పత్రిక చాలా బాగుంటున్నది. ఇంకా బాగుంటుందన్న నమ్మకంతో, ఆశతో రెండేళ్లకి చందాకట్టి - నాకు గల గౌరవభావాన్ని తెలుపుకుంటున్నాను. రెండేళ్లకు - మీరు ప్రకటించిన 200/- ప్రకారం 400 మరియు 25 రూపాయలు బ్యాంకు చార్జెస్ నిమిత్తం పంపుతున్నాను. ఇటుపై ఉచితంగా పంపే లిస్టులో నాపేరు తొలగించగోర్తాను.

'హాసం'కు, మా పాఠకులకు ఉజ్జ్వల అక్షర భవిష్యత్తును ఆకాంక్షిస్తూ....

-ముళ్ళపూడి వెంకట రమణ, చెన్నై

త్యాగరాజస్వామి వారు పుట్టిన వూరు తిరువాయూరు కాదు. తిరువయ్యారు. గమనించ గలరు.

-పి.ఎస్.గోపాలకృష్ణ,
ఆలిండియా రేడియో, హైదరాబాద్

మొఘల్-ఏ-అజమ్ చిత్రంలోని శీష్‌మహల్ చిత్రీకరణ గురించి కె.అసిఫ్ స్వయంగా రాసిన వ్యాసం ఒకటి చదివాను. ప్రతిబింబాలు పడకుండా ఎలా తీయాలా అని ఆలోచించి చివరకు ప్రఖ్యాత ఛాయాగ్రాహకుడు వి.ఎన్.రెడ్డిని సంప్రదించారట. ఆయన కెమెరా చుట్టూ అద్దాలు పెట్టి తీసి అయిదు నిమిషాలలో సమస్యను పరిష్కరించారట.

-డా॥ కె.వి.రావు, హైదరాబాద్

లారెల్ పుట్టినది 1890లో. 1980 అని అచ్చు తప్పు పడినట్టుంది.

-ఎమ్.సమీర్‌కుమార్, గదగ్.

సంగీతంలో 'చక్రవర్తి'గా వెలుగొందిన కీ.శే. చక్రవర్తి గారి గూర్చిన వ్యాసాలు హాసం 16-28 ఫిబ్రవరి సంచికలో ఎంతో విశిష్టతతో కూడుకొని ఉన్నాయి. సంగీతంలో ఆయన చేసినన్ని ప్రయోగాలు ఇతరులు చేయలేదంటే అతిశయోక్తి కాదు. చక్రవర్తి గారి ఫోటో కూడా ప్రచురించి ఆయనకు నివాళులు అర్పించిన 'హాసం' ప్రయత్నం అభినందనీయం. హాసం పత్రిక కోసం మేమెంతో ఎదురు చూస్తున్నాం. అన్ని వ్యాసాలు, పాటలూ బాగుంటున్నాయి.

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్

తనికెళ్ళ భరణిగారు అందించిన విశ్వపతి శాస్త్రి తీరు, చక్కని రచన కవిత్వం సెలయేరులా, మొదటి నుండి - తుదివరకు సాగింది. అందమైన పద సంపదల జోరు, మా ఎద నింపింది సంతోషాల తేనీరు, చిత్రరంగంలో అనుక్షణం - బిజీబిజీగా తిరిగే భరణిగారు తీరికచేసుకొని ఎంతో వుదాత్తమైన విషయాలను 'హాసం' ద్వారా అందిస్తున్నందుకు మేమంతా అందించె శత సహస్ర అభినందనల జోరు' అందుకోక తప్పదు. ఫిబ్రవరి 1-15 సంచికలో సెంటర్ స్ప్రెడ్‌లో ప్రియనేస్తమా, చంద్రవంశం పాటల పుస్తకాలు అందజేసారు. ఇది సినిమా లోకానికే కాకుండా, సాహితీ ప్రియులను కూడా మిక్కిలి పరవశింప జేస్తున్నది. మేము పాఠకులమైనప్పటికి, సిన్మాలను చూచి, పాటల పుస్తకం చేత పట్టుకొని వచ్చినట్లుగా వున్నది. 'హాసం'లో తెలుగు టెలీ సీరియల్స్ పై కూడా ఒక కన్ను వేస్తారని ఆశిస్తున్నాను. 1-15 జనవరి సంచిక ఒక ప్రత్యేకతను కాదు చాలా ప్రత్యేకతలను సంతరించుకొన్నది. 'బ్రహ్మానందం బర్త్ డే స్పెషల్' చదివి ఆయన్ను గురించిన విషయాలను తెలుసుకొని విస్మయం చెందాం. విస్తుపోయాం. ఆయన అంటే అమితమైన గౌరవ భావం కలిగింది. అలాగే 'నిశాపతి' గారి "గోపాలబాలా నిన్నే" కోరీ మరీమరీ నవ్వించింది. కథనం నవ్వులనందన వనంలో, హాస్యం పారిజాతంలా విరిసినట్లైంది. రచయితల గురించి, పరిచయాలు ఇస్తున్నారు. సరిక్రొత్త సాంప్రదాయం. పత్రిక నిండా క్రొత్తదనం కనిపిస్తున్నది. ప్రతి అంశంలోను 'స్పార్కింగు' వున్నది. అది సంపాదకుల వారి ప్రత్యేకతను, పూర్వపు పల్లకిలో లాగా వైభవాల పల్లకిగా కనిపిస్తున్నది. ఎప్పటికీ ఈ పత్రికకు ఢోకా లేదని ఇప్పటికే పురిటిలోనే నిరూపించుకొన్నది. మంచిపేరు తెచ్చుకుంటున్నది. దానిని నడిపే వారు అంతా అనుభవజ్ఞులు అని అనిపించుకుంటున్నారు. ఈ లేఖ ఇంతకాలం వ్రాయకుండా వున్నందుకు నాకు సిగ్గుగా వుంది.

-వెలివల సాంబశివరావు, బి.ఏ.,
ఏ.టి. అగ్రహారం, గుంటూరు

భరణిగారూ!

మూగవోయిన కోకిల గురించి ఎంత చదివినా తక్కువే అనిపిస్తుంది. అది మీ బొంట్ల భాషలో మావంటి వాళ్ళు విహారం చేయడం ఎంత సుకృతమో!

ఎంత చక్కని చిక్కని తెలుగు
ఎంత సొయగ మెంతటి కమ్మదనం
ఎన్ని హొయలు ఎన్ని చిత్రికలు
నా తెలుగు భాష రసాలూరు తేనె!

నిజంస్మీ! మనమెంత అదృష్టవంతులం. తెలుగువాళ్ళమయ్యాం పైపెచ్చు కృష్ణశాస్త్రి గారి కవిత్వాన్ని మింగుతున్నాం - వొంట బట్టించుకుంటున్నాం. నరిగంగ స్నానాలాడుతున్నాం - దోసిళ్ళతో జుర్రేస్తున్నాం చిత్రం - రసగంగ తరగదు - యీ దాహం తీరదు. శ్రీశైలం మల్లన్న శిరసొంచి గంగను పారిస్తే - గాజుల చేతుల్లో రాజనాల పంట!

ఏదోరాయాలనే ఉబలాటమే తప్ప -
ఏదో చెప్పాలని
తపనోత్సాహమే తప్ప -
ఏవుంది కృష్ణశాస్త్రి కవిత్వం వినా
తనికెళ్ళ భరణిగారి తాళింపు ఘుమఘుమలు తప్ప!

షెల్లీ అంటూ (మీరు కాదు) ఆయనకి పోలిక బెడ్తారు గానీ నాకెందుకో నచ్చదీ ఆపాదింపు.

షెల్లీ ఆంగ్ల సాహితీరంగంలో
అందరితోపాటు ఆయనొక్కడు
అనితర సాధ్యమైన కృష్ణశాస్త్రి తెలుగింట
ఒక్కడే ఒక్కడు
అంతటి పట్టు ఎవడు వేయగలడు?
అంతోటి పట్టు ఎవడు సాధించగలడు!!

-రావులపాటి వెంకటరామారావు, ఖమ్మం.

"తనికెళ్ళ భరణిగారి రచనలలో మల్లాది రామకృష్ణశాస్త్రి గారి స్థాయిని మించి తెలుగు తేనె జాలువారుతోందని" - వ్రాసి శ్రీ కె.వి.యల్. నరసింహశాస్త్రి గారు లాంటి మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి అభిమానుల్ని చింతా క్రాంతుల్ని చేసినందుకు, తనికెళ్ళ భరణిగార్ని ఇరుకున పడేసినందుకు చింతిస్తున్నాను. తెలుగుమీద గౌరవంతోను, భరణిగారి రచనల్లో తేనెలా జుర్రుకునే తెలుగు పదాలు ఉండటంతోను "మల్లాది రామకృష్ణశాస్త్రి గారి రచనలు తలపిస్తున్నాయి" అనే భావాన్ని స్థాయినిమించి అని వ్రాసాను. ఈ విషయంలో క్షంతవ్యుణ్ణి. నాలాంటి పాఠకుడికి ఎలాంటి పదాలు ఎక్కడ ఉపయోగించాలో తెలియజేసినందుకు శ్రీ కె.వి.యల్. నరసింహశాస్త్రిగారికి కృతజ్ఞతలు.

తనికెళ్ళ భరణిగారి ఈ వ్యాసపరంపర నిరంతరం సాగాలని పాఠకులలో తెలుగు భాష పట్ల మరింత మక్కువ పెరిగేలా వ్రాయాలని మనః పూర్వకంగా కోరుకుంటున్నాను. సంగీత ప్రముఖులు ఉస్తాద్ అల్లారఖా, తొలితరం సంగీత దర్శకుడు పంకజ్ మల్లిక్ లాంటి ప్రముఖుల్ని గూర్చి వ్రాసిన హెచ్.రమేష్‌బాబు అభినందనీయులు. సీరియల్స్ వల్ల జోక్స్, క్లాసిక్ రీ టోల్డ్ లాంటి శీర్షికలు పాఠకులు మిస్సయ్యే ప్రమాదముంది.

-పేరిచర్ల రామకృష్ణంరాజు.
ధర్మవరం

సంపుటి :1 సంచిక: 11

1-15 మార్చి 2002

పేజీలు: 76

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 11

గత పక్షం "హాసం" సంపాదకవర్గం విజయవాడలో ఓ పెన్షనర్స్ సమావేశానికి ముఖ్య అతిథులుగా వెళ్లడం జరిగింది. సీనియర్ సిటిజన్స్ తమ అభిరుచుల గురించి, అనుభవాల గురించి ముచ్చటించుకోవడం, తమ గురించి కూడా పట్టించుకుంటున్న "హాసం" పత్రిక పట్ల ఆదరం చూపడం ఎంతో ఆసక్తి కలిగించింది.

నేటి సమాజంలో పిల్లలకున్న ప్రాముఖ్యత పెద్దలు తమకు తాము ఇచ్చుకోవటం లేదనిపిస్తోంది. ఏ అడ్వర్టయిజ్‌మెంట్ చూసినా పిల్లలను దృష్టిలో పెట్టుకుని తీయడమే కనబడుతోంది. పిల్లలను ఊదరగొడితే వాళ్లే పెద్దల మెడలు వంచి కొనిపిస్తారన్న నమ్మకం బాహాటంగా తెలిసిపోతోంది. పెద్దలు తమ అవసరాలను, అభిరుచులను కుదించుకుని పిల్లలను తృప్తి పరచడమే జీవితలక్ష్యంగా బతుకుతున్నారు. కుటుంబం పట్ల బాధ్యత ఉండడం మంచిదే, కానీ అతి సర్వత్ర వర్జయేత్ అని కూడా అన్నారుగా!? పిల్లలు మారాం చేసి కొనుక్కోగలుగుతారు. యువకులు పట్టుబట్టి సాధిస్తారు. తిరగబడతామని బెదిరిస్తారు. కానీ పెద్దలు..? అయినదానికీ, కానిదానికీ త్యాగాలు చేసుకుంటూ పోయి, తమ ఇష్టాయిష్టాలను తమలోనే చంపుకోవడం జరుగుతోంది. ఇష్టమైన టీవీ ఛానల్ చూడాలన్నా, నచ్చిన పత్రిక కొనుక్కోవాలన్నా ఒకటికి పదిసార్లు ఆలోచించి, ఇంట్లో అందరికీ నచ్చచెప్పి మరీ అడుగు ముందుకువేసే పరిస్థితి చాలా ఇళ్లల్లో ఉంది. సీనియర్ సిటిజన్స్ కోసం ప్రత్యేకంగా పత్రికలు, సినిమాలు, టీవీ ఛానెళ్లు వచ్చే సూచనలు కనుచూపుమేరలో లేవు. ఏది చూసినా యువతరం, నవతరం కోసమేనంటూ హోరెత్తించడమే. "హాసం" పత్రిక వీటన్నిటికీ అతీతంగా అన్ని వయస్సుల వారినీ అలరించాలని మా కోరిక.

"మాకు కావలసిన కొత్త సినిమా పాటలు, హిందీ పాటలు, ఇంటర్వ్యూలు, హ్యూమర్ బాక్స్, చౌ చౌ చౌరస్తా వున్నాయ" ని సంబరపడే యువతతో పాటు - "నీ కిష్టమైన సంగతులు కూడా ఈ పత్రికలో ఉన్నాయి. నీ కోసం కొనుక్కు తెచ్చానని ఇచ్చే కుర్రాళ్లు ఎవరున్నారండీ ఈ రోజుల్లో.." అంటూ నిట్టూర్చే పెద్దవారు కూడా కనబడుతున్నారు.

ఇది నిజమే అయితే ఇంతకంటే దురదృష్టకరం మరొకటి ఉండదు. ఇంట్లోని పెద్దవారి అభిరుచులకు అనుగుణంగా ఉన్న వస్తువు... అది పత్రిక కానివ్వండి మరొకటి కానివ్వండి... కంటబడినప్పుడు కొని ఇవ్వని చిన్నవారి కోసం కష్టపడిన పెద్దవారి శ్రమ వృథా అయినట్టే లెక్క! అంతేకాదు, తనకు నచ్చిన పత్రికను పదిరూపాయలు పెట్టి కొనుక్కోలేని పరిస్థితిలోకి తమను తాము నెట్టుకోవడం కూడా ముందుచూపు లేకపోవడానికి తార్కాణమే!

మేధావులే కానీయండి, సీనియర్ సిటిజన్స్ కానీయండి తమకు కావలసినదేమిటో స్పష్టంగా తెలిసినా పైకి చెప్పకపోవడం వల్లనే ఇటువంటి పరిస్థితి ఆవరించింది. సర్దుకుపోవడం మంచిదే కానీ, అవసరం లేని చోట త్యాగాలు చేయడం వ్యర్థం. ముఖ్యంగా అభిరుచుల వద్ద నిక్కచ్చిగా ఉండవలసిన అవసరం ప్రతి ఏజ్ గ్రూప్‌కీ ఉంది. యూత్ మాత్రమే ఆ హక్కు ఉపయోగించుకుంటున్నట్టు కనబడుతోంది. అన్ని వర్గాలవారూ ఆ హక్కును వినియోగించుకుని ఉన్నట్టయితే "హాసం" వంటి పత్రిక రావడానికి ఇన్నాళ్లు పట్టేది కాదు.



# ఊహాలు గుసగుసలాడితే కుఛ్ కుఛ్ హోతాహై!?

-సూరేపల్లి విజయ

నోట్లో రెండు కర్చీఫ్‌లు కుక్కుకొని, ఏడుపు ఆపుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు సుబ్బారావు. "ఒరే... ఫ్రెండ్‌వి కదానని కర్చీఫ్ అడిగితే, మొహం తుడుచుకోవడానికి కాబోలు... అని యిచ్చా. దాన్నలా నోట్లో కుక్కుకోవడానికి ఏం బావు లేదురా.... కుక్కుకున్నవాడివి కుక్కిన పేనులా వూర్కోకుండా, అటెండర్ కర్చీఫ్ కూడా అరువడుక్కొని మరీ నోట్లో కుక్కుకోవాలా? అయినా రెండు కర్చీఫ్‌లు కుక్కుకొని అంతగా ఏడుపు ఆపుకోవాల్సిన ఖర్మ నీకేమిట్రా... నా ఖర్మ కాకపోతే" అంటూ తన తలను క్యాంటిన్ గోడకేసి కొట్టుకోవాలా? ఎదురుగా వున్న చెట్టుకేసి కొట్టుకోవాలా? అనే ఆలోచనలో కొట్టుకుపోతూ అడిగాడు అప్పారావు.

సుబ్బారావు కోపంగా అప్పారావు వంక చూసి తన నోట్లో కుక్కుకొన్న రెండు కర్చీఫ్‌లు బయటకు పీకి, అందులో ఓ కర్చీఫ్‌ని అప్పారావు వైపు విసిరేసాడు.

'తీస్కోరా మిత్రద్రోహి.... ఫ్రెండ్‌వి కదానని కర్చీఫ్ అడిగితే, వెధవ కర్చీఫ్‌కి కక్కుర్తి పడతావా అంతేలేరా... చిన్నప్పుడు నేను గోటీ కాయలిచ్చిన సీన్ మర్చిపోయావ్రా. కాలేజీ రోజుల్లో నేను ప్రేమించిన పంకజాక్షిని నీ కోసం త్యాగం చేసిన విషయమూ మరచి పోయావ్‌రా" నిష్టూరమాడాడు ఫేస్‌లో రకరకాల ఎక్స్‌ప్రెషన్స్ పెడుతూ.

'అదేమిట్రా... పుసిక్కిన అంతచేటున అలా అనేసావ్... నువ్వు పంకజాక్షిని త్యాగం చేసావు. బాగానే వుంది. ఆ తర్వాత పంకజాక్షిని కట్టుకొని యిప్పటి వరకు నా సుఖాలన్నీ త్యాగం చేసుకోవాల్సి వచ్చిందిరా... ఆ పంకజాక్షి పెళ్ళామై నన్ను ఫ్రయ్ చేసుకుంటోంది తెలుసా'' ఉక్రోషంగా అన్నాడు అప్పారావు.

వెంటనే సుబ్బారావు నాలిక్కర్చుకొని "సారీరా... ఏదో ఎమోషన్‌లో టెంప్టేషనై అన్నాను'' అంటూ మళ్ళీ తన చేతిలో వున్న కర్చీఫ్‌ని నోట్లో కుక్కుకోబోతుండగా, అప్పారావు అడ్డుకొని 'చంపేస్తావ్రోయ్ ఆ అసలు విషయం చెప్పకుండా తెలుగు టీ.వి డైలీ సీరియల్స్‌లో నాన్చినట్టు నాన్చి... నాన్చి... డైలాగులు చెప్తావంటే'' అన్నాడు ఏడ్పు గొంతుతో.

అసలు విషయానికి వస్తే అప్పారావు, సుబ్బారావు మంచి ఫ్రెండ్స్... పొద్దున్నే అప్పారావు యింటికి వెళ్ళి నిద్రలోనే లేపుకొని బయటకు తీసుకువచ్చి విషయం చెప్పకుండా కర్చీఫ్ నోట్లో కుక్కుకొని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నాడు సుబ్బారావు. అది భరించలేని అప్పారావుకు వెంటలొచ్చి జుట్టు పీక్కున్నాడు.

సుబ్బారావు కాస్త స్థిమిత పడి... నోట్లో నుంచి కర్చీఫ్ తీసి ఆకాశం వంకచూస్తూ.....

"ఒరే... అప్పా'' అని పిలిచాడు ఎఫెక్షనేట్ టోన్‌తో.



'అబ్బా-ఎంత సమ్మగా పిలిచావ్రా సుబ్బిగా.... మా ఆవిడ కూడా యింత ముద్దుగా ఎప్పుడు పిలిచెరుగదు'' అన్నాడు తన్మయత్వంగా సుబ్బారావు కళ్ళలో కళ్ళు పెట్టి చూస్తూ అప్పారావు.

"ఛ... ఛ.... చూసే వాళ్ళు మనల్ని మిసండర్‌స్టాండ్ చేస్కుంటారు. అసలు విషయం చెప్పి గుండె బరువు దించుకోవాలని నా దగ్గరికి వచ్చావు''.

"నీ గుండెలో బరువా... అదేమిట్రా... నీ గుండెలో మా చెల్లాయే కాక, యింకవరైనా స్టే చేసారా? లేకపోతే నీ గుండె బరువేమిట్రా''.

"కుళ్ళు జోకు లేసావంటే కుళ్ళబొడిచి హుసేన్‌సాగర్‌లో ముంచి చంపుతా... నా బ్రతుకు మాడిపోయిన మటన్ ఫ్రయి అయి పోయింది అన్నాడు కాస్త విచారంగా.

'కొంపదీసి కాలేజీ రోజుల్లో నువ్వు లైలా వెంటపడ్డ సంగతి మీ ఆవిడకు తెలిసిందా?'' అడిగాడు అప్పారావు.

"అదేమి కాదురా... నీకు తెలుసుగా... నేను అదో టైప్ మనిషనని... అనవసర వేస్టేజ్ నాకిష్టముండదని. అందుకని...''.

"...అందుకని''

"పెళ్ళయినప్పట్నించీ మీ చెల్లాయితో కొన్ని విషయాల్లో చాలా లౌక్యంగానే వుంటున్నాను. అదేమిటో నేను చెప్తుంటే నువ్వు విజువలైజ్

చేస్కో'' అన్నాడు సుబ్బారావు.

అప్పారావు ఓ సారి ఆకాశం వంక చూసాడు.

****

"హేవండీ'' గోముగా పిలిచింది మిసెస్ సుబ్బారావు.

"హేమిటి డియర్... మూడొచ్చిందా? అడిగాడు చిలిపిగా భార్య వంక చూస్తూ.

"డొక్క చీరేస్తానంతే... చీరల షాపు ముందు తింగరి వేషాలేమిటి? నాకేం మూడ్ రాలేదు. ఆ ఇటాలియన్ క్రేప్ సిల్క్ చీరను చూస్తే ముద్దొచ్చింది'' అంది ఎదురుగా చీరల షాపు ముందు వున్న మెరూన్‌కలర్ శారీ చూపిస్తూ.

ఇలాంటి విషయాల్లో సుబ్బారావు బాగా ఎండి పండిపోయాడు. తనదైన స్టయిల్లో.

"ఒక్కసారి కళ్ళు మూసుకో డియర్'' అన్నాడు.

కళ్ళు మూసుకుంది మిసెస్ సుబ్బారావు.

"నువ్విప్పుడు మెరూన్ కలర్ శారీ కట్టుకున్నావు. నాతోపాటు రోడ్డు మీద నడుస్తుంటే, అందరి కళ్ళు నీ మీదే వున్నాయి. ఈ చీరలో నువ్వు సాక్షి శివానంద్ చెల్లెల్లా, అంజులా ఝవేరి కజిన్‌లా వున్నావు. వాహ్... ఎంత బావుంది'' సుబ్బారావు పొగడుతూనే వున్నాడు.

మిసెస్ సుబ్బారావు విజువలైజేషన్‌లో నుంచి బయటకు వచ్చి భర్త వంక విచిత్రంగా చూసింది.

"చూసావా... ఆ చీరలో నువ్వెలా వున్నావో విజువలైజ్ చేసుకున్నావా?'' అడిగాడు కళ్ళు మిటకరించి.

"బ్రహ్మాండంగా వుందండీ. కళ్ళకు కట్టినట్లు కనిపించింది'' అంది మిసెస్ సుబ్బారావు మురిసిపోతూ.

"వెరీగుడ్... అయితే పద..'' అన్నాడు.

"అదేమిటండీ చీర కొనరా?'' అడిగింది అయోమయంగా...

"యూ.... చిలిపి... చీరకొనడమేమిటి? విజువలైజ్ చేసుకొని ఎంచక్కా థ్రిల్ ఫీలయ్యావు కదా... మళ్ళీ ఆ చీర కట్టుకోవాలని అనిపిస్తే... మళ్ళీ విజువలైజ్ చేసుకో, దట్సాల్'' అన్నాడు.

మిసెస్ సుబ్బారావుకు మండింది.

****

మరో సీన్‌లో

పండక్కి మొగుడ్ని తెల్లరాళ్ళ నెక్లెస్ అడిగింది మిసెస్ సుబ్బారావు.

"ఒక్క క్షణం కళ్ళు మూసుకో'' చంకలు గుద్దుకుంటూ అన్నాడు సుబ్బారావు.

మరోసారి అమాయకంగా కళ్ళు మూసుకుంది మిసెస్ సుబ్బారావు.

"ఎంతందంగా వున్నావు తెల్లరాళ్ళ నెక్లెస్‌లో... ఆ నెక్లెస్ నీ మెడలో ధగ ధగ మెరుస్తూ వుంది కదు సరిగ్గా యిలాంటి నెక్లస్ నీక్కావాలి కదూ'' అన్నాడు కళ్ళు మూసుకునే.

"ఇప్పుడు కళ్ళు తెరువు... నీకు నెక్లెస్ పెట్టుకోవాలని అనిపించినప్పుడల్లా.... యిలా కళ్ళు మూసుకుని నెక్లెస్ పెట్టుకుంటే నువ్వెంత అందంగా వుంటావో వూహించుకో.... ఎంత థ్రిల్ వుంటుందో.... అంతేకాదు... నిజం నెక్లెస్ అయితే ఒక్కటే వెరైటీ కానీ, కళ్ళు మూసుకుని వూహించుకుంటే రకరకాల నెక్లెస్‌లు వూహించుకోవచ్చు'' కళ్ళలో మెరుపులు సృష్టిస్తూ చెప్పాడు సుబ్బారావు తన పెళ్లాంతో...

****



రచయిత్రిగా 95 నుండి అడపా దడపాగా రాస్తున్నా, సీరియస్‌గా రాయడం మొదలెట్టింది ఈ మూడేళ్ళగానే! ఈ మూడేళ్ళలో మూడు సీరియల్స్ ఆంధ్రభూమి మంత్లీ 'అగ్నివర్షం', ఆంధ్రభూమి డైలీలో 'లవ్ 2000', వార్త డైలీలో 'ఎచటకోయీ ఈ పయనం...' ప్లస్ వివిధ పత్రికలలో 50 కథలు, అప్పుడప్పుడు ఆర్టికల్స్ అచ్చు అయ్యాయి. రాయడం యిష్టమైన విషయం, చదవడం అలవాటైన విషయం.


-సూరేపల్లి
విజయ1-9-12/3/హెచ్,
ఆజంపురా, మెదక్

అలా అతని భార్య ఏమడిగినా వూహించేస్కోని థ్రిల్ ఫీలవ్వాలని దాని వల్ల డబ్బు ఆదా అవుతుందని, బోల్డు థ్రిల్లు ఫ్రీగా దొరుకుతుందని అతి తెలివిగా భార్యను కన్విన్స్ చేయడం మొదలెట్టాడు సుబ్బారావు.

బట్టలు ఉతికి చేతులు నొప్పెడుతున్నాయి. వాషింగ్ మెషిన్ కొనమంటే, వాషింగ్ మిషన్ కొన్నట్టు, ఆ వాషింగ్ మిషన్‌లో బట్టలు వుతికినట్టు వూహించుకొని తృప్తిపడమని అనేశాడు.

చివరికి మూరెడు మల్లెపూలు కొనమన్నా.... మల్లెపూలు మూరల కొద్దీ తలలో పెట్టుకున్నట్టు వూహించుకొని థ్రిల్ ఫీలవమని చెప్పేవాడు.

****

"అదిలా జరిగింది... అలా నేను ఏదో మేనేజ్ చేస్తున్నానని సంతోష పడ్డాను. కానీ ఈ మధ్య వారం రోజుల నుంచీ నా బ్రతుకు బస్టాండ్ అయిపోయింది" చెప్పాడు సుబ్బారావు.

"ఏమైందేమిటి?" గొప్ప సంతోషంగా అడిగాడు. అప్పారావు విజువలైజేషన్ సీన్‌లోకి వెళ్తూ....

****

"పెళ్ళామ్స్... మైడియర్ పెళ్ళామ్స్" హుషారుగా పిలిచాడు సుబ్బారావు.

"హేమిటండీ యింత హుషారుగా వున్నారు. మీ బాస్‌ను గజ్జికుక్క కానీ కరిచిందా?" అడిగింది మిసెస్ సుబ్బారావు.

"అదేం కాదు గానీ... యివ్వాళ పేకాటలో వందొచ్చింది"

హు... యిప్పటివరకు ఓ పదివేలు తగలేసి వుంటారు. అందులో వందొచ్చిందా? మా ఆయనే" అంది మెటికలు విరుస్తూ మిసెస్ సుబ్బారావు.

"అబ్బ... పోయినదాని గురించెందుగ్గానీ... వేడి వేడిగా ఓ టీ కొట్టించు" అన్నాడు.

వన్ మినిట్‌లో గ్లాసు తెచ్చి అక్కడ పెట్టింది మిసెస్ సుబ్బారావు.

"అదేంటి... యిన్‌స్టెంట్ టీయా?" అంటూ టీ గ్లాసు అందుకొని బిత్తరపోయాడు.

పాలు, టీ పొడి, పంచదార వుంది.

"టీ చేయలేదా?" అడిగాడు ఆశ్చర్యంగా సుబ్బారావు.

"ఒక్కసారి కళ్లు మూసుకోండి" అంది కళ్ళు టపటపలాడిస్తూ మిసెస్ సుబ్బారావు.

"ఎందుకు?" అని అడుగుతూనే కళ్ళు మూసుకున్నాడు.

"ఇప్పుడు నేను టీ గిన్నెను పొయ్యి మీద పెట్టానని అనుకోండి. టీ పొడి వేసాననుకోండి. టీ మరిగించి పాలు, పోసి, పంచదార వేసి టీ తయారుచేసి మీకు యిచ్చానని అనుకోండి" అది కిలకిలా నవ్వుతూ.

"అనుకుంటే"... అసహనంగా అడిగాడు కళ్ళు మూసుకొని వున్న సుబ్బారావు.

"అనుకుంటే ఏమిటి? టీ యిచ్చా.. యిక తాగండి".

"పాలు, టీ పొడి పంచదార వేసినా మరగని 'టీ'ని ఎలా తాగి చచ్చేది" అన్నాడు నెత్తీనోరూ కొట్టుకుంటు సుబ్బారావు.

'అబ్బ... హబ్బబ్బ... మీరు మరీ చిలిపి. అలా వూహించేస్కోని చూడండి... ఎంత థ్రిల్లో... పైగా గ్యాస్ ఆదా" అంది.

సుబ్బారావుకు మండింది.

****

మధ్యాహ్నం డైనింగ్ టేబుల్ ముందు కూచున్నాడు. ఉదయం నుంచీ కనీసం టీ కూడా లేదాయె. ఆకలి దంచేస్తోంది. పెళ్ళాన్ని కేకేసి పిలిచాడు. చేతులూపుకుంటూ వచ్చింది మిసెస్ సుబ్బారావు.

"ఆకలి దంచేస్తోంది... అన్నం వడ్డించు" అన్నాడు.

"అన్నమా... హ్హాహ్హాహ్హా... హబ్బ.... హబ్బబ్బ... నాకు సిగ్గేస్తోంది బాబు" అంది రెండు చేతుల్లో మొహం దాచుకుని.

"నీ సిగ్గు టీవీ ఛానెల్స్ వాళ్ళు ఎత్తుకెళ్ళ!... ఇప్పుడు నేనేమన్నానని అంత సిగ్గు" వళ్ళుమండి అడిగాడు సుబ్బారావు.

'చిలిపి' అంటూ మొగుడి బుగ్గగిల్లి 'ఓసారి కళ్ళు మూసుకొండి' అంది.

"నేను మూసుకోనంతే" సీన్ అర్థమై బుంగమూతి పెట్టి అన్నాడు సుబ్బారావు.

"ప్లీజ్ మూసుకోండి" అంటూ తనే బలవంతంగా మొగుడి కళ్ళు మూస్తూ.

"ఇప్పుడు మీ ఎదురుగా చికెన్ సూప్, పలావ్, వేడివేడి బిర్యానీ, సాంబార్... మీగడ పెరుగు.... ఇవన్నీ మీరు ఆబగా అసహ్యంగా తింటున్నారు" అంది.

"నేను తినడమేమిటే నా బొంద" అన్నాడు కళ్ళు తెరిచి.

"అబ్బ. వూహించుకోండి. ఈ పూటకు బియ్యం ఆదా, గ్యాస్ ఆదా, ఖర్చు ఆదా...'

అంతే వెనక్కి విరుచుకు పడ్డాడు సుబ్బారావు.

****

"అదిరా జరిగింది... యిలా నేను చేసిన వెధవ ఐడియా నాకే బెడిసి కొట్టింది. ఇది చాలాదూరం సాగింది అంటూ సిగ్గుతో మెలికలు తిరిగి పోయి... కావలసినంత వూహించేస్కోని అటు తిరిగి పడుకోమంటోంది. బెడ్డుకు, ఫుడ్డుకు ... నా బ్రతుకు దూరమై, కనాకష్టమైంది" బావురుమన్నాడు, బావురు కప్పలా నోరు తెరిచి సుబ్బారావు.

అప్పారావు జాలిగా ఓ సారి సుబ్బారావు వైపుచూసి....

"ఇప్పటికైనా నీ కుక్కుర్తి ఐడియాలు... ఆ ప్లాన్స్ తగలెట్టు... కాళ్ళ బేరమొక్కటే మార్గం.... పెళ్ళాన్ని అండర్ ఎస్టిమేట్ వేసిన వాడెవడూ హేపీగా వుండడు" అంటూ అప్పారావోపదేశం చేసాడు.

కట్ చేస్తే..

ఆ రాత్రి సుబ్బారావు దాసుడి తప్పులు దండంతో సరి, అని కాళ్ళ బేరానికి వచ్చాడు.

ఛస్తే... ఇలాంటి చచ్చుట్రిక్స్ ఇక ప్రయోగించనని చెప్పాడు.

****

తెల్లారేక సుబ్బారావు ఆఫీసుకు వెళ్ళాక మిసెస్ సుబ్బారావు అప్పారావుకు ఫోన్ చేసి "థాంక్యూ అప్పారావు అన్నయ్యా.. నువ్వు యిచ్చిన ఐడియా పన్జేసింది. ఆయన మారిపోయాడని చెప్పింది.



మార్చి 6 పెండ్యాల జయంతి సందర్భంగా...

# సప్తస్వరాల ఉయ్యాల

# పెండ్యాల





-పి.బి.శ్రీనివాస్

ఆంధ్రా ఫిలిం పొలంలో, సంగీత క్షేత్రాన్ని "హార్మొనీ" అనే హలంతో దున్ని, సప్తస్వరాలనే విత్తనాలను చల్లి, ఏటేటా ఏపుగా చక్కని పాటల పంటలు పండిస్తున్న శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారి గురించి రాయబోవడం, సూర్యుడిని దీపంతో చూపించడమే అవుతుంది.

"పెండ్యాల సప్తస్వరాల ఉయ్యాల" అని ఊరికే అన్నారా మరి, పిక్చర్ల క్రెడిట్ టైటిల్స్‌లో పెండ్యాల పేరురాగానే, ప్రజలకి పిక్చరు చూడక మునుపే నమ్మకం కలిగిపోతుంది - పసందైన సంగీతం వినబోతున్నామని, "స్వరాల మధ్య నెయ్యం, కయ్యం, వియ్యం, నేర్పుతో నెరపుతూ, మంచి సంగీతం అందించాలంటే దెయ్యంలా పని చెయ్యాలి" (work like a devil) అనే వారిలో శ్రీ నాగేశ్వరరావుగారొకరు. ఏదో యదాలాపంగా, బుర్రకీ తట్టినదీ, నోటికి వచ్చినది నచ్చిపోయి, ప్రతీది మంచి ట్యూనే అనేసుకుని, తేలికగా, టూకీగా ఓకే చేసుకునే స్వభావం కలవారు కారు. తాపీగా ఆలోచించి, సంగీత కూపస్థ నిక్షిప సుప్తసప్తరస స్వరాల కూపీలాగి, మేల్కొలిపే దాకా హేపీగా ఫీలవరు. సాధారణంగా ఫేలవరు.

పాటలోని పదాల బరువునితూచి, ఆ బరువుకి సర్వవిధాలా సరితూగే వరాల స్వరాలు తోచేవరకూ వేచి, నిదానంగా కూర్చుని ఏరుకుని మరీ వరుస కూర్చుకుంటూ పోతారు. నచ్చకపోతే నచ్చేదాకా మార్చుకుంటూ పోతారు. వరుస కట్టడం నిర్మాణం సంపూర్ణమైన అనంతరం కూడా అప్పుడప్పు డక్కడక్కడ మేధావీధిని మెరిసే మెరుపుల వెలుగుల మెరుగులు కూడా తీర్చుకుంటూ, దిద్దుకుంటూ, చేర్చుకుంటూ పోతారు. పక్కనున్న పదిమందీ విని బాగుందని మెచ్చుకున్నా, గబుక్కున అర్జంటుగా తృప్తిపడపోరు. ఒకప్పుడు తనకి నచ్చినా ఎదటి వారికి నచ్చకపోతే వారిని సంతృప్తి పరచేదాకా నిద్రపోరు.

పాటలోని, ఒక మాటకి "దపమా" అని మనసులో స్థిరపరచుకున్న వెనక, ఆ "దపమా" అనుమాన రహితంగా తాననుకున్న విధాన వచ్చే వరకూ వదలరు. తానెదురు చూచిన ఫలితం పాటలో వచ్చినప్పుడు వీరు పొందే ఆనందం అనిర్వచనీయం. ఆత్రేయగారి 'తిరపతి' నాటకంలో నేనూ, జానకిగారూ కలిసి తొలిసారిగా వీరి దర్శకత్వంలో పాడిన "ఇదేకదా తొలిరేయీ" గీతికలో, "కాలము నినుగని నవ్వినదీ" అనే వాక్యంలో 'నవ్వినదీ' అన్న పదం పైన చిన్న నవ్వు నవ్వమని వారు కోరిన రీతిని నవ్వి నేను పాడినప్పుడు, వికసించిన వారి ముఖపద్మాన్ని చూసి తీరాలి. "పాటకులు" తనకు నచ్చేరీతిగా పాడగలిగినప్పుడు మనసులోంచి మెచ్చుకోవడం, పాడలేక పోయినప్పుడు ముభావంగా వూరుకుని, "మ్చెమ్చె" అని తనలో తానే నొచ్చుకోవడం వీరి స్వభావం.

స్వప్నంలో కూడా స్వరాలతోనే సరసపల్లాపలాడుకుంటూ వుంటారేమో అనిపిస్తుంది. ఏ స్వరాన్ని ఎటుమార్చి, ఆ స్వరంపైన మరో స్వరం పేర్చి, ఎలాగ వరసకి, రసపుష్టి చేకూర్చడమా అనేదే అనవరతం వీరి తాపత్రయం. అలాగని వట్టి "పెర్ముటేషన్స్, కాంబినేషన్స్" మీదే ఆధార పడితే మ్యూజిక్ కూడా మేథమేటిక్స్‌లాగే శుద్ధ గణనాత్మకమై వూరుకుంటుంది. భావౌచిత్యం, సందర్భ శుద్ధీ, మూడ్, మెలడీ వగైరా ఇతర అంశాలు కూడా గమనించుకోవాలి" అని వీరి అభిప్రాయం.

శ్రీ నాగేశ్వరరావుగారికి పాత సంప్రదాయాలూ, పద్ధతులూ అంటే భక్తి ప్రపత్తులు మెండు. సంగతులన్నా బిరకాలన్నా మక్కువ ఎక్కువే కాని, ఎక్కడెక్కడ వాడితే సంగీతం అందగిస్తుందో అక్కడక్కడ మాత్రమే వాడతారు. ఒక్కముక్కలో వక్కాణించాలంటే, తను పట్టుబట్టి కట్టినమట్టు డెఫినిట్టుగా హిట్టు అవుతుందని తను మనస్ఫూర్తిగా అనుకోగలిగే దాకా, విసుగు విరామం లేకుండా తంటాలు పడుతూనే ఉంటారు.

ఇట్టి "దీక్ష"యే తనకు సదా శ్రీరామరక్ష కాగా, వీరు "దీక్ష" "ద్రోహి" చిత్రాలతో పేరు గడించి, ఘన విజయం సాధించారు.

"ద్రోహి" చిత్రం మొట్టమొదటది. "మొదటి రాత్రి, దీక్ష" తరువాతవి.



పెండ్యాల మొదటి చిత్రం
'ద్రోహి'లో ఎల్.వి.ప్రసాద్

ఇలా తొలిచిత్రంలోనే విజయం సాధించడం అనేది అందరికీ అందుబాటులో వుండదు. దానికి ''భాగ్యరేఖ'' అవసరం. ముమ్మందు, తన పేరుగల ఫిల్ములకి, వీరు సంగీతం ఇవ్వవలసిన యోగం ఉందని తెలునుకొనే కాబోలు, 'భాగ్యరేఖ' వీరిని ప్రథమ చిత్రంలోనే వరించింది.

**ఓర్పుకు మారు పేరు** - ఓర్పుకు వీరు పెట్టింది పేరు. ఆ ఓర్పుని నేర్పుతో ఎలా సమయానుకూలంగా ఉపయోగించుకోవాలో వీరికిబాగా తెలును. మొత్తానికి, ఇంత నిదాన ప్రధానమైన స్వభావం కలిగి ఉండడం చాలా కష్టం. కొంతమంది ఓర్పుని తెచ్చి పెట్టుకుంటారు. ఏదోనాడు ఏదో విషయంలో తేలిపోయి బయటపడిపోతారు. కాని నాగేశ్వరరావు గారు గోతుల్యమయిన సాధు స్వభావం కలవారు. ఎంతటి చండప్రచండమైన ఆగ్రహావేశంలోనైనా, విషధరధరుడు, గరళాన్ని గళంలోనే మిళితం చేసుకున్న రీతిని, గప్‌చిప్‌గా కోపాన్ని మింగేస్తారు. పైకి రానివ్వరు. ఇదందరికీ సాధ్యమా? వీరి భూషణం శాంతం.

టేకుల సెలెక్షన్‌లో వీరు చూపే శ్రద్ధాసక్తులు తిలక్ గారి కంపెనీలు - అనగా "అనుపమా''లు. రాత్రిళ్ళు రికార్డింగులు జరిగేటప్పుడు గూడా పాడిన మేమూ, వాయిద్యాలు బజాయించిన ఆర్కెస్ట్రా బృందం, అలిసిపోయి ఇంటికి దౌడుతీసినా, తెల్లవారి పోతున్నా సరే, ఇసుమంతయు విసుగొందక, చేయించిన ఇరవై టేకులూ, విని, ప్రతీ టేకులోనూ, తనకి నచ్చిన తునకలు (Bits) అన్నీ గుర్తించి పెట్టుకుని, వాటినన్నిటినీ కలిపి, మొత్తం మీద నీటైన టేకొకటి తయారించు కుంటారు. పందొమ్మిదో టేకులో ఫ్లూటు బిట్టూ, ఎనిమిదో టేకులో ఎకార్డియన్ పీసూ, పదో టేకులో పల్లవీ, అయిదో టేకులో అనుపల్లవీ, మూడో టేకులో మేండొలిన్ పోర్షన్, చివరి టేకులో చరణం, ఇలాతుంచిన తుండులన్నీ ఏరుకుని, మంచి పండులాంటి టేకు తయారుచేసుకోవడం అంటే మాటలా? ఈ ఓపిక వీరికే చెల్లింది.

"అత్తా ఒకింటి కోడలు'' చిత్రానికి, జిక్కీగారు నేనూ బృంద సహాయంతో ఆలపించిన "పైలా పైలా పచ్చీసు" పాటే దీనికి తిరుగులేని తార్కాణం. ఆ రోజున ఖర్మం కొద్దీ ఒక్క టేకు కూడా పూర్తిగా తృప్తిగా రాలేదు. "రిదం"లో కాంప్లికేషన్ వల్ల నైతేనేం, నిద్రా ముద్రితాలైన ముఖాలతో జోగుతూ వుండడం వల్ల నైతేనేం, తాళంలో ఒకరు చేరితే మరొకరు చేరేవారు కారు. ఎలాగో యిసకలోంచి నూనె పిండినట్టుగా, కొన్ని టేకులు టేకాము. ఏమైనా, మంచి పాట చెడిపోయిందనే బాధతోనే బయలుదేరాము యిళ్ళకి. కాని, చివరికి ఏంచేశారో, ఎలా సాధించారో కాని, మేము పిక్చర్లో ఆ పాట విన్నప్పుడదరి పోయాం. ఇంత చక్కని టేకెక్కడ దొరికింది ఈయనకీ అని! డిఫెక్ట్స్ అన్నీ ఎఫెక్ట్స్‌గా మారిపోయాయి వీరిచేతిలో.

ఒకనాడు, "నిత్యకళ్యాణం పచ్చతోరణం" చిత్రానికని చలానికి, పాడిన, "ఎవరికి వారే యమునా తీరే - ఇకలేనేలోరోయీ, నా అనువారే" అనే ఆరుద్రగేయం భరణిలో రికార్డింగు జరుపుతున్నాం. ఆనాడు, నిమ్మకాయ రసం సేవించినందువల్లనో, కొబ్బరికాయ పచ్చడి కొట్టేసినందు వల్లనో, పెరుగుమీది మీగడ మింగినందు వల్లనో, మరేకారణం చేతనో జ్ఞాపకంలేదు గాని, నాగొంతు పలకవలసిన విధంగా పలకలేదు. చాలా సేపటిదాకా, ఎంత ప్రయత్నించినా, రెండుకీ, నాలుక్కీ మధ్య, అంటే మూడు (Mood) లోకి రాలేకపోయాను. పెండ్యాల ప్రాణం విసిగిపోయింది. బలేబాధ పడి పోయారు. అంతటి చింతలో కూడా "ఈ పాట ఖర్మ ఇంతే, మనం ఏం చెయ్యగలం చెప్పండి, ఒక్కొక్క పాట జాతకమే అంత'' అని ఆవేదనతో వేడివేడి నిట్టూర్పు విడిచారేతప్ప, సూటిగాగాని, చాటుగాగాని ఎవరినీ ఏమీ అనలేదు. అప్పటికీ, నాకు ప్రోత్సాహమిస్తూనే, నాచేత చేతనయినంత వరకూ, ఆ పాట, అదేరోజున, బాగా పాడించుకున్నారు.

**బాల పెండ్యాల** - 6-3-1917 తేదీన, కృష్ణాజిల్లాలోని కాటూరు గ్రామంలో వీరు జన్మించారు. వీరిని ప్రపంచానికి ప్రసాదించినవారు శ్రీ సీతారామయ్యగారు. వారు గూడా గొప్ప హార్మోనియం విద్వాంసులే. కనుక 'హార్మోనీ' విద్య, నాగేశ్వరరావు గారికి పిత్రార్జితంగా లభించిందనుకోవచ్చు. హార్మోనియం వాయించడమే గాక, బాల్యం లోనే వారు చాలా మనోహరంగా పాడేవారట. గొంతు సన్నంగా, అచ్చంగా అమ్మాయి గొంతులాగా ఉండేదిట. ఆడవేషాల కనువైన, ముచ్చటైన ముద్దుగొలిపే ముఖాకృతి వుండేదిట. ఇవన్నీ చూసే శ్రీదైతా గోపాలంగారు వీరిని సక్కుబాయి వేషానికి సెలెక్టు చేసుకున్నారట. అనుభవ నిధులైన దైతా దర్శకత్వంలో అభినయాది లలిత కళలలో బాగా తర్ఫీదు పొంది వుండడము, ఉత్తరోత్తరా వీరి కెంతైనా లాభించింది.

**సినిమాల పెండ్యాల** - నాగేశ్వరరావు గార్ని డ్రామా సీనులోంచి చిత్రసీమలోకి లాక్కొచ్చిన ఘనత శ్రీ కడారు నాగభూషణరావుగారిది. వారి 'తల్లిప్రేమ', 'సుమతి' చిత్రాల్లో వీరు హార్మోనిష్టుగా కుదిరారు. కొన్నాళ్ళు గడచిన పిదప, యింటికిపోయి, కొన్నాళ్ళు ముదినేపల్లి ఎక్సెల్షియర్ డ్రామెటిక్ ఎసోసియేషన్‌లో చేరారు. నేటి అన్నపూర్ణా సంస్థ అధినేత శ్రీ దుక్కిపాటి, నాటి ఈ డ్రామా సంస్థకు సెక్రటరీగారట. హీరో అక్కినేని కూడా అక్కడే పని చేసే వారట. ఆ రోజుల్లో, ఈ నాగేశ్వరద్వయం నాలుగేళ్ళు కలిసి వున్నారట అక్కడ.

వీరు తిరిగి చిత్రరంగంలో అడుగు పెట్టి ప్రకాశరావుగారు దర్శకత్వం వహించిన స్వతంత్రా వారి "ద్రోహి"కి సంగీత దర్శకుడుగా ప్రప్రథమంగా పని చేశారు. "ద్రోహి" చిత్రంతోనే పెండ్యాల పేరు మంచి సంగీత దర్శకుల జాబితాలోకి

చేరుకుంది. క్రమంగా పేరుకుంది. ఘనీభవించి స్థిరపడింది. ఒక్కొక్క చిత్రానికొక్కొక్క తరహా సంగీతం అందిస్తూ, చక్కనిచిక్కని చల్లని వెన్నెలలో, స్వసంగీత సరోవరంలో, రసికుల మానస హంసలను హాయిగా విహరింపచేస్తూ, తన కీర్తికిరీటంలో చిత్రానికొక వజ్రం చొప్పున చేర్చుకుంటూ పోతున్నారు.



ద్రోహి, దీక్ష, దొంగరాముడు, ముద్దుబిడ్డ, అక్కచెల్లెళ్ళు, ఎం.ఎల్.ఎ., భట్టివిక్రమార్క, భాగ్యరేఖ, వాగ్దానం, వెంకటేశ్వర మహాత్మ్యం, వెలుగునీడలు, మహాకవి కాళిదాసు, మహామంత్రి తిమ్మరసు, శ్రీకృష్ణార్జునయుద్ధం, జగదేకవీరునికథ, పరువు ప్రతిష్ఠ అత్తాఒకింటి కోడలే, నిత్యకళ్యాణం పచ్చతోరణం, బావమరదళ్ళు, భక్తశబరి, జయభేరి, శ్రీకృష్ణగారడి, కృష్ణప్రేమ, ఈడుజోడూ, అనురాగం, ఆదిగాగల అనేక చిత్రాలకు వీరు సర్వజనరంజకమైన సంగీతం సమకూర్చారు. ప్రజాహృదయాలను చూరగొన్నారు. వీరి వద్ద నేను పాడిన పాటల్లో శ్రీ జగ్గయ్య గారికి పాడిన "రమ్మంటే వచ్చారు అమ్మాయిగారు" "పైలా, పైలా పచ్చీసు", చలానికి "ఈడుజోడు"లో పాడిన "సూర్యునిచుట్టు తిరుగుతుంది భూగోళం" "పంచరు పంచరు" చలానికే 'నిత్యకళ్యాణం పచ్చతోరణం'లోను 'అనూరాగం'లోనూ పాడిన 'ఎవరికి వారే యమునాతీరే'. 'అసలు నీవు రానేల', 'ఖుషీఖుషీగ నాతో రావే' రామకృష్ణకు పాడిన 'నీమది పాడెను ఏమని' శబరిలో నాగయ్యగారికి పాడిన "రానైయున్నాడు' "ఏమీ రామకథ", "బావమరదళ్ళ"లో నేను , జమునారాణి పాడిన "గంగమ్మతల్లి కరుణించెరా" 'శ్రీకృష్ణగారడి'లో నారదుడికిపాడిన "ఎంత ఘనుడవయ్యా యదునందనా ఆనందమోహనా" - బహుశా రాయడం మరిచిపోయినవి మరికొన్ని, మంచి పాప్యులర్ హిట్స్ ఐనాయి.



'జయభేరి'లో 'రసికరాజ తగువారము కామా'

"జయభేరి"లో "రసికరాజ, తగువారము కామా' లో మంచి ఎక్స్పెరిమెంటొకటిచేసి సక్సెడయ్యారు. జయభేరి మ్రోయించారు. విజయానంద మహారాజుని మెప్పింపచ గలిగేలాగ హీరో శ్రీ ఎ.ఎన్.ఆర్ పాడవలసిన సందర్భంలో పాట బాగా రక్తి కట్టేటట్టు చేయాలనే సంకల్పంతో, ఏవోవే వూహలల్లుకుని, కొసకి ఆరోహణంలో ఒక రాగచ్ఛాయ, అవరోహణంలో మరో రాగచ్ఛాయ కలిపి, నూతనరాగ నిర్మాణం కోసం, కృషి చేసి, కృతకృత్యులయ్యారు. ఈ రాగానికి, అనురాగంతో, శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి "విజయానంద చంద్రిక" అని నామకరణం చేశారట. ఉత్తరాది రాగాలైన భైరవ్, బహార్‌లకి ప్రతిబింబాలనదగిన, చక్రవాక, కానడరాగాల సముచిత సమాగమ సంజనిత మీ "విజయానంద చంద్రిక".

"జగదేకవీరుని కథ"లో జగదేక వీరులైన హీరో శ్రీ ఎన్.టి.ఆర్. ఏకకాలంలో, వివిధ వాద్యాలను



"జగదేకవీరుని కథ"లో 'శివశంకరీ'

వాయిస్తూ జగన్మోహనంగా, గీత మాలపించవలసిన ఘట్టానికి ఘనమైన మట్టు కట్టవలసి వచ్చిందిట. దర్శకులు శ్రీ కె.వి.రెడ్డిగారు పెండ్యాలతో "ఈ ఘట్టంలో నాయకుని గానానికి శిలకరిగి పోవలసి వచ్చింది. మీరెలా కరిగిస్తారో మరి. మీ చేతిలోనే వుంది ఈ సన్నివేశం రక్తికట్టే బాధ్యత!" అన్నారట. ఈ బాధ్యత ఎలా నిర్వహించడమా అని, అహర్నిశలు ఆలోచించి, నాగేశ్వరరావు గారి మస్తిష్కం శుష్కించి పోయేటంత పనైందిట. పాటని ఏవేవో రాగాలలో అని చూచుకుని, చివరికి, దర్బారీ కానడ, ఘూర్జరీతోడి, శంకరాభరణ రాగాలు నేరుకున్నారట. ఈ మూడింటిలో కే.వీ. గారికి మొదటిదే నచ్చిందట. అదే రాగంలో, రాగాలాపన, స్వర ప్రస్తారం, పల్లవి, అనుపల్లవి, చరణం, నెరవు, తానం, ఇత్యాది లక్షణ లక్షితమైన "శివశంకరీ" పాట రూపొంది, శిలలు ద్రవించేలా తయారైంది.

వీరు కర్నాటక, హిందుస్తానీ సంప్రదాయాలను రెండింటీని అభిమానిస్తారు. వాటిని సమపాళంలో మేళవించి సమయ సందర్భాలననుసరించి, కర్ణపేయమైన స్వర్ణమయ స్వరార్ణవం

ప్రవహించేస్తున్నారు. అందం కోసం అన్యస్వరాలను అప్పుడప్పుడు వాడే అలవాటు, సన్నివేశం శుద్ధశాస్త్రీయ సంగీతాన్నే కోరినప్పుడల్లా, రాగాలను యథాతథంగా సంకర రహితంగా ప్రయోగించడాన్నే సమర్థిస్తారు. వీరి గేయాలలో వినిపించే రకరకాల రాగాలలో ముఖ్యమైనవి కొన్ని: భీంపలాస్, పీలూ, కళ్యాణి, సింధుభైరవి, రీతి గౌళ, జయ జయవంతి, దర్బారీ కానడ, మాల్కోస్, పట్‌దీప్ వగైరాలు. జానపద సంగీతాని క్కూడా తగిన ప్రాధాన్యమిస్తారు. "నీ ఆన అడియాన" "కొమ్ములుతిరిగిన మగవారు", "కన్నెపిల్ల సొగసుచూడ" "గంగమ్మతల్లి కరుణించెరా" వంటివీ కోవకు చెందినవే.

'ద్రోహి'లో "మనోవాంఛలు" "పూవుచేరి పలుమారు తిరుగుచూ" అనే జి.వి.లక్ష్మిగారు, జి.వి.రావు గారు (ఘంటసాల)ల పాటలూ, లక్ష్మీరాజ్యం గారికి జమునారాణిగారు పాడిన పాటలు, "యిదియేనా నీ న్యాయమూ" అని యమ్.ఎస్.రామారావుగారు పాడినదీ, అన్నిటికన్నీ ఆంధ్రదేశంలో మారుమ్రోగాయి. 'దీక్ష'లో మాష్టరు వేణు పాడిన "ఏమౌతుందో" ఎనలేనిది. 'కన్నతల్లి'లో ఘంటసాల గీతం "ఎంత మంచిదానవో యమ్మా"



చారుకేశిరాగంలో చిరకాలం జీవిస్తుంది. "దొంగ రాముడు" లో 'చిగురాకులలో చిలకమ్మా' 'అనురాగమువిరిసేనా' రెండూ రెండు నిండు జ్యోతుల్లా సదా వెలుగుతూ వుంటాయి. 'బావా మరదళ్ళు'లో ' పయనించే మన వలపుల బంగరునావ' మన్ని కూడా తనలో శయనించి పయనింపచేస్తుంది. అదే చిత్రంలో "నీలి మేఘాలలో" తేలించే ఘంటసాల, గానకి (సారీ.. జానకి) గారి గానం సుధారసపానం.

"భాగ్యరేఖ"లో "నీ సిగ్గే సింగారమే" రాజాగారు పాడినదీ, 'నీవుండే దాకొండపై' సుశీలగారు పాడినదీ, రెండూ ఒకే కొమ్మ (ట్యూను)ను పూచిన రెండు బంగారు పూవులు. శ్రీనివాస్సుశీలం



"వెంకటేశ్వరమహాత్మ్యం"లో 'కలగా కమ్మని కలగా'

"సుధామధురమూ, కళాలలితమూ' (కృష్ణప్రేమ), "నీ మదిపాడెను ఏమని" (నిత్యకల్యాణం పచ్చతోరణం), 'ఏమి రామకథ ', ' రామన్యాయమా' (శబరి), వగైరా గీతాలు అమృతోపేతాలు. "జయభేరి"లో "మదిశారదాదేవి మందిరమే" (ఘంటసాలా నేను పాణిగ్రాహి పాడినది) మరువరానిది. "వెంకటేశ్వరమహాత్మ్యం"లో వెంకటేశ్వర్రావుగారిచేతా, దాని తమిళ వెర్షన్ అయిన "శ్రీనివాస కళ్యాణం"లో శ్రీనివాస్‌చేత సమంజసంగా పాడించడం వీరి ప్రత్యేకత. ఈ చిత్రంలో "కలగా కమ్మనికలగా" భీంప్లాస్‌లో ఏ క్లాస్‌గా చేశారు. "శేషశైలవాసా శ్రీ వెంకటేశ' అని రీతి గౌళలో చక్కని రీతిని, తిరుమలేశుని ప్రీతితో కొనియాడారు. శ్రీ ఘంటసాల, తన పాటకు తానే ఓష్ఠచాలనము (lip movement) గావిస్తూ, బాలాజీ భక్తకోటిలో ఒకరుగా అద్భుతంగా అభినయిస్తూ మైమరచి ఆలపించి, ఆలకించిన మనల్నీ మైమరిపించారు. "మహామంత్రి తిమ్మరుసు"లో "శివరంజని"రాగంలో "చరిత్ర ఎరుగని మహాపాతకం" గీతం, శ్రీమతి పి.లీలగారు అవలీలగా, అద్భుతంగా, ఒడలు గగుర్పొడిచే విధాన ఆలపించారు. కామెడీ సాంగ్సులో కూడా వీరు సిద్ధహస్తులే. "అనురాగం"లో "షోకైన ఎద్దు" పాట విన్నవారు పొట్టచెక్కలయ్యేట్టు నవ్వవలసిందే. హాస్య (గీత) చక్రవర్తులనదగిన పిఠాపురం, మాధవపెద్ది జంట ఈ పాటకి ప్రాణం పోసింది.

"నీదయరాదా ఈదాసిపైన", "ఏమిరామకథ", ద్విజయవంతిలోను, "నీకైవేచితినయ్యా" "ప్రభుగిరిధారీ", పీలులోనూ "చూడాలని వుంది" మిశ్రశిరాగంలోను, "కలకానిదీ, విలువైనది" కంభావతిలోనూ, "ఎందుకు వేసిన వేషమయా" అమీరుకళ్యాణిలోనూ, "అలిగితివా సఖీప్రియా" భాగేశ్వరిలోనూ, "జయవాణీ చరణ కమల" మాల్కోస్‌లోనూ, "నా మనసెంతో నాజూకు" హిందుస్థానీ 'భైరవిలోనూ, "నిన్ను జూచు నందాక" "ఎంత ఘనుడవయ్యా" కానడలోను, "అనరాద శ్రీరామయనీ"



"మహామంత్రి తిమ్మరుసు'లో 'తిరుమల తిరుపతి వెంకటేశ్వరా'

కేదారాది రాగ మాలికలోనూ, ఇలా ఎన్నో పాటలు ఎన్నో రాగాలలో రచిస్తూ, రసికుల్ని రంజింప జేస్తున్నారు. ఆనంద భైరవిలో హాస్యగీతం అందించడం అరుదైన విషయం. బి.గోపాలం, స్వర్ణలతల యుగళ గీతం "అంచె లంచెలు" ఈ రాగంలోనే తయారైంది.

"భక్తశబరి"లో "రానైయున్నాడు" రాగమాలికలో (ఆనందభైరవి, కేదార, నాటకురంజి) నాగయ్యగారి గాత్రాని కనువుగా కుదిర్చారు. నేను పాడేటప్పుడు నాగయ్య గార్ని మనసులో పెట్టుకుని మరీ పాడానీపాట.

"వెంకటేశ్వర మహాత్మ్యం'' హిందీ అనువాదమైన "భగవాన్ బాలాజీ" ద్వారా ఇదివరకే హిందీరంగంలో పదార్పణం చేశారు. ఆ తర్వాత "చక్రవర్తి విక్రమాదిత్య'' (హిందీ)లో దీవక్ సాహిత్యానికి సంగీతం జతచేర్చారు. ఈ చిత్రంలో శ్రీకాంతారావుగారికి నేను కూడా పాడాను ఈ మధ్య. హిందీ చిత్ర సంగీత దర్శకులలో వీరి ప్రీతిపాత్రులు బర్మన్, నౌషద్‌లు.

వెండితెర వెనకనే వుండిపోకుండా వీరు వెండి తెరపై కూడా కొన్ని చిత్రాల్లో చిన్న పాత్రల్లో, ప్రేక్షకుల దృష్టి నాకర్షించారు. "దీక్ష"లో పనిపాటలేక గప్పాలు కొట్టే, గాస్ మాష్టర్లైన వల్లెటూరి రైతులుగా, మిక్కిలినేనితో కలిసి నటించారు. "కన్నతల్లి"లో కూడా రైతు పాత్రే కాని తంపులమారి స్వభావం గల వేషం. ''మొదటి రాత్రి''లో ఆయుర్వేదం, అల్లోపతిలు రెండూ కలిసి వైద్యం చేసే నాటు డాక్టరు. "పెంకి పెళ్ళాం"లో భావకవి. ఫ్రెంచి కటింగు మీసంతో విలసిల్లుతూ, గ్లాస్గోదో సిల్కుదో జబ్బా తొడిగి, నీటైన తెల్లని పంచ ధరించి, నిత్యజీవితంలో కూడా భావ కవిరూపంలోనే దర్శన మిస్తూ వుంటారు. వీరు తరచుగా నటనాశక్తి భావయుక్తంగా సంగీతం సమకూర్చడానికి, కొంత సహకరిస్తుందనిపిస్తుంది.

**(1963 అక్టోబరు "జ్యోతి" సౌజన్యంతో)**



# మీ పద సంపద

## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

**1. లెంక (సీతారామకళ్యాణం - హే పార్వతీనాథ)**
ఎ) పరిచారకుడు బి) భక్తుడు
సి) రాజు డి) దీవి

**2. యశము (సీతారామకళ్యాణం -పరమశైవాచార)**
ఎ) ధనము బి) ఐశ్వర్యము
సి) కీర్తి డి) ఉద్యోగము

**3. రేడు (భక్త కన్నప్ప - శివశివ శంకరా)**
ఎ) పండు బి) దేవుడు
సి) మిత్రుడు డి) రాజు

**4. అఘలవిత్రము (భక్త కన్నప్ప - కిరాతార్జునీయం)**
ఎ) దొరకనిది బి) పవిత్రము
సి) పాపమును కోయునది
డి) ఎల్లెడలా వ్యాపించినది

**5. నటకావతంసుడు (శుభోదయం - నటనం ఆడెనే)**
ఎ) గొప్ప నటుడు
బి) నటకులకు శిరోభూషణము
సి) తొలినటకుడు
డి) నటనలో అనుభవము కలవాడు

**6. తుషారము (శుభోదయం - నటనం ఆడెనే)**
ఎ) మంచు బి) వనస్పతి
సి) కొబ్బరిచెట్టు డి) సెలయేరు

**7. పర్జన్యము (వినాయక విజయం - ఓంకార నాద)**
ఎ) ఉఱుము బి) మెరుపు
సి) పర్వతము డి) జలపాతము

**8. కబరీ (వినాయక విజయం - ఒక వంక)**
ఎ) పాము బి) అరటిచెట్టు
సి) ఎద్దుమూపు డి) కొప్పు

**9. అపసదుడు (రహస్యం - గిరిజాకళ్యాణం)**
ఎ) నీచుడు
బి) అపసవ్యముగా చేయువాడు
సి) విరోధి డి) మూర్ఖుడు

**10. అలసుడు (రహస్యం - గిరిజాకళ్యాణం)**
ఎ) బలహీనుడు బి) వృద్ధుడు
సి) మందబుద్ధి డి) ప్రేమికుడు

**జవాబులు**

1) a 2) c 3) d
4) c 5) b 6) a
7) a 8) d 9) a
10) c



# రాంపండు లీలలు

## రాంపండూ - కవిత్వప్పందాలూ

**వాలెంతింటా వ్యవహారం తర్వాత రాంపండు కనబడడం మానేయడంతో అనంత్ ఆలోచనల్లో అతను కొద్దికాలం పాటు మరుగున పడ్డాడు. పాపం ఏమయిపోయాడో, వాళ్ల బాబాయి రాంపండుకి నెలనెలా ఇచ్చే డబ్బు ఇస్తున్నాడో లేదో అన్న ఆలోచన వచ్చింది కానీ గట్టిగా పట్టించుకుంటే మళ్లీ ఏ లేడీ వస్తాదునో తీసుకొచ్చి రోజూ భోజనం పెట్టించమంటాడేమోనని అనంత్ ఊరుకున్నాడు. పరిస్థితి అలాగే కొనసాగేది కానీ యతి దగ్గర్నుంచి ఉత్తరం రావడంతో అనంత్ జీవితంలో రాంపండు పాత్ర పునః ప్రవేశం చేసింది.**

"సర్, మీకే..." అని ఉత్తరం అందిస్తూ అచలపతి దాచుకున్న నవ్వు చూడగానే అనంత్‌కి అనుమానం వచ్చింది. ఫ్రం ఎడ్రెసు చూడగానే నవ్వుకి అర్థం తెలిసి పోయింది. ఉత్తరం యతి దగ్గర్నుంచి.

యతి, సుతి ఇద్దరూ కవలలు. అనంత్‌కి కజిన్స్. పెద్దవాళ్లు చాలా ఉన్నత ఆదర్శాలతో పెట్టిన పేర్లని వీళ్లు చెడగొట్టేశారు. మతిలేకుండా పిచ్చి, పిచ్చిపనులు చేయడం, ఏదో ఒకటి చేసి నెత్తి మీదకు తెచ్చుకోవడం వాళ్లకు పరిపాటి. అనంత్ కంటె వయస్సులో కాస్త చిన్నవాళ్లే అయినా అనంత్‌తో ఫ్రెండ్లీగా మెలుగుతారు - అంతా ఒక జాతికి చెందినవాళ్లే కాబట్టి. చివరికి అనంత్‌కి ఏదో ఒక తలకాయనొప్పి తెచ్చి పెడతారు. వాళ్ల దగ్గర్నుంచి ఎప్పుడు ఉత్తరం వచ్చినా దానిలో ఏదో ఒక కొత్త స్కీము ఉంటూనే ఉంటుంది. అచలపతికి వాళ్ల చేష్టలు చూస్తే మహా వేడుకగా ఉంటుంది.

ఇవాళ్టి ఉత్తరంలో కూడా ఓ స్కీము ఉంది.

"ఒరేయ్, అనంత్,

ఉత్తరం మీద అడ్రసు చూసి కంగారుపడ్డావా? ఈ యతిగాడు వేంపూడిలో ఎలా తేలాడో అని తెల్లబోతున్నావా? పోకు. మన సుబ్బరామయ్య అంకుల్ లేడూ - వేంపూడి పిల్ల జమిందార్... వాళ్ల ఇంట్లో నెల్లాళ్లగా మకాం పెట్టాం - నేనూ, సుతీనూ. వాళ్ల అమ్మాయి సులోచన మంచి కంపెనీ ఇస్తోందిలే. మనకి వేరే పనిలేదుగా! నాలుగురాళ్లు సంపాదించుకు రానిదే ఇంటికి రావద్దని మా నాన్న ఆంక్ష పెట్టేశాడు. సరేలే. బంధువులింట్లో ఉన్నట్టుంటుందనుకుని ఇక్కడే బిచాణా వేశాం. అన్నట్టు మీ ఫ్రెండు రాంపండు కూడా ఇక్కడే ఉన్నాడోరే! మాటల్లో నీ ప్రస్తావన వస్తే నువ్వు మంచి ఫ్రెండువని చెప్పాడు.

రాంపండు నైస్ ఫెలోరా. అతనూ కాస్త డబ్బు ఇబ్బందుల్లో ఉన్నాట్ట. వాళ్ల చిన్నాన్న డబ్బు సరిగా పంపటం లేదుట. నేనూ, గతీ, రాంపండూ కలిసి ఓ మంచి స్కీము వర్కవుట్ చేశాం. బోల్డు డబ్బులొచ్చే స్కీము. అంచేత నువ్వు ఒక గోనుసంచి నిండా డబ్బు తేవడంతో బాటు ఇంకో ఖాళీ గోనెసంచి కూడా ఎక్స్ట్రాగా పట్టుకురా. లాభాలన్నీ దాంట్లో వేసుకు పట్టుకుపోదువుగాని. రెండు డబ్బులూ కలపడం మంచిది కాదు. ఇక స్కీము గురించి లెటర్లో చెప్పాలంటే నీకు అర్థం కాదు. నీదసలే మట్టిబుర్ర, వెంట అచలపతిని తీసుకురా. నీ కర్థంకాకపోతే అతనికి చెప్తాం. నువ్వు అతనిచేత అర్థం చేయించుకో. అర్థం అయినా, కాకపోయినా మాకు పెట్టుబడి మాత్రం పెట్టు. వెంటనే రా" - ఇట్లు యతి".

****

ఆ రోజు రాత్రి అనంత్ డిన్నర్ వేళకు వేంపూడి చేరగలిగేడు. వస్తూనే మేడమీద డిన్నర్ పార్టీ జరుగుతోంది రమ్మనమని పిలుపు వచ్చింది. పావుగంటలో రెడీ అయి వెళ్లేసరికి సులోచన పక్కనున్న సీటు మాత్రం ఖాళీగా ఉంది. సులోచన పక్కన కూచుందామని అనంత్‌కి ఎంతమాత్రం ఉబలాటం లేదు. ఆ మాటకొస్తే ఏ ఆడపిల్ల పక్కనా కూచుందామని అనంత్ ఉబలాటపడడు. కానీ సులోచన విషయంలో ఓ చిన్న ఫ్లాష్‌బ్యాక్ కూడా ఉంది. ఒకానొక దుర్బల క్షణంలో సులోచనను ప్రేమించినట్టు అనంత్ భ్రమపడడం కూడా జరిగింది. కానీ త్వరలోనే తెలిసి వచ్చింది - సులోచన ఒక ఆదర్శాల పుట్ట అని.

పెళ్లాడమని తండ్రి చూపించే బంధువుల కుర్రాళ్లందరూ ఒట్టి పనికిమాలిన, పనిచేయని సజ్జనీ, తాత ముత్తాల ఆస్తి అరగదీయడం, కరగదీయడం తప్ప కండలు కరిగించడం రాని వాజమ్మలనీ ఆమె అభిప్రాయం. అలాటి వాళ్ల కంటె డబ్బు లేకపోయినా కష్టార్జితాన్ని నమ్ముకున్న వాడినే కట్టుకోవాలని ఆమె అనుకుంది. ఆ కేటగిరీలో అనంత్ ఈ జన్మలో వచ్చే అవకాశం లేదు కాబట్టి ఆమె అనంత్‌ను పెద్దగా పట్టించుకోలేదు. ఆ విషయం గ్రహించిన అనంత్ కూడా సులోచన గురించి పట్టించుకోవడం మానేశాడు. రేపు పెళ్లయిన దాకా ఉండి "రా, కష్టించి పని చేసి లోకాన్ని ఉద్ధరిద్దాం. పొలాలన్నీ హలాల దున్నుదాం. పల్లెటూళ్లో పిల్లలకు పాఠాలు చెప్పి నిరక్ష రాస్యత పారద్రోలుదాం" అంటే చచ్చే చావు వస్తుందని తెలిసి ఎంత అందంగా ఉన్నా సులోచన మానాన సులోచన, తన మానాన తను విడివిడిగా బతకడం మంచిదనే నిర్ణయం తీసుకున్నాడు. అది ఇద్దరి మేలూ కోరి తీసుకున్న నిర్ణయం కాబట్టి, ఇద్దరి మధ్య ఏ పొరపొచ్చాలూ రాలేదు. మంచి కజిన్స్‌లా, మంచి స్నేహితుల్లా మిగిలిపోయేరు.

ఇప్పుడు సులోచన పక్కనే కూచుంటే పాత జ్ఞాపకాలు తన్నుకు

వస్తాయేమోనని భయపడుతూనే గతిలేక ఆ కుర్చీలో కూలబడ్డాడు అనంత్.

"హలో, అనంత్, వచ్చేశావన్న మాట!' అంటూ పలకరించింది సులోచన.

"వచ్చేశా." అన్నాడు అనంత్ అంతకంటే ఏమనాలో తోచక.

"పోన్లే, మంచిపని చేశావ్. డిన్నర్ పార్టీ వేళకు వస్తావో రావో అనుకున్నా" అంది సులోచన మెచ్చుకోలుగా.

"వచ్చాను కానీ. మీ నాన్న ఇవాళ ఇంత పెద్ద పార్టీ ఎందుకు ఏర్పాటు చేసినట్టు?" అడిగేడు అనంత్ చుట్టూ జనాభాను చూస్తూ.

"నీకు తెలుసుగా. మా నాన్నకు కవిత్వం పిచ్చి. వీళ్లంతా.., అంటే వీళ్ళల్లో చాలామంది "సంచార కవులు" అనే గ్రూపుకు చెందిన వాళ్లు. వాళ్లందరినీ భోజనానికి పిల్చాడు. వాళ్లతో బాటు ఊళ్లో కొంతమంది పెద్దల్ని కూడా...."

"సంచార కవులేమిటి? దిగంబర కవుల్లా?" అన్నాడు అనంత్ సూప్ చప్పరించి.

"వీళ్లదీ ఓ ఉద్యమంలే. కవిత్వం గురించి సామాన్య ప్రజల్లో అవగాహన పెంచడానికి ఊరురా తిరిగి ఆదివారం పొద్దున అందర్నీ ఓ చోటకు రమ్మనమని కవిత్వం పాడి వినిపిస్తారు. అలా వినగా, వినగా కవిత్వం అంటే మామూలు వాళ్లకు కూడా ఇష్టం పెరిగి, ప్రజాకవులు పుట్టుకొస్తారని వీళ్ల థియరీ" వివరించింది సులోచన బట్లర్‌కి అనంత్ పళ్లెంలో వడ్డించమని సూచనలిస్తూనే.

"అయ్యబాబోయ్, పదేసిమంది కవిత్వాలు ఒక్కపూట వినడమే! ఉగాది కవిసమ్మేళనాలు ఏడాదికోసారి వస్తాయి కాబట్టి ఫర్వాలేదు. కానీ, ఇలా ఇంటి దగ్గరకొచ్చి కవిత్వం పాడేస్తే, పదిమందీ కలిసి చిత్రవధ చేసినట్టే!" అని హడిలిపోయేడు అనంత్.




సులోచన విసుక్కుంది. "నువ్వొకడివి. అందరూ ఒకే చోటకి వెళ్లరు. పదిమందికి ఒక టీముగా ఏర్పడి తాలూకా హెడ్ క్వార్టర్స్‌కి వెళతారు. అక్కణ్నుంచి ఒక్కోళ్లు ఒక్కో ఊరికి ఆదివారం వెళ్లి కవిత్వం వినిపిస్తారు. మళ్లీ అందరూ కలిసి ఇంకో తాలూకాకి వెళతారు. అలాగన్న మాట..." విపులంగా చెప్పింది విసుక్కుంటూనే. "అయినా నీకివన్నీ పట్టవులే. హాయిగా కడుపులో చల్ల కదలకుండా పడుకొంటే చాలనుకునే వాళ్ళల్లో నువ్వొకడివి. అలాగే ఉన్నావా, లేక ఈ మధ్య పనికొచ్చే పని ఏదైనా చేస్తున్నావా?" అంది కాస్త వెక్కిరింపుగా.

సంభాషణ అక్కర్లేని పక్కదారులు పడుతోందని గ్రహించిన అనంత్ మాట మార్చబోయాడు. "మీ నాన్నకి అ పక్కన కూచున్న పెద్దాయన శ్యామసుందరం గారేగా?"

"అవును. ఆయనే ఈ ప్రాంతంలో ఈ ఉద్యమానికి చేయూత నిస్తున్నాడు. నాన్నా, ఆయనా చాలా కాలంగా ఫ్రెండ్స్".

"తెలుసులే. పట్టుకుంటే వదలడు. ఓ సారి కవిసమ్మేళనంలో దొరికి పోయాను.'సుబ్బరామయ్య గారి చుట్టాలబ్బాయివి కదూ' అంటూ పట్టుకుని వాయించేసాడు. నీలాటి యువకుల్లో చైతన్యం రావాలంటూ పెద్ద కవిత ఒకటి వినిపించాడు" అన్నాడు అనంత్ గతం తలుచుకుని నిట్టూర్చి.

"పాపం ఆయనకు తెలియదులే - నువ్వు ఏ కవిత్వానికి లొంగే ఘటానివి కాదని" అంది సులోచన పెదవి విరిచి.

ఎలా మాట్లాడినా తన బద్ధకం మీదకే సంభాషణ మళ్లడం అనంత్‌కి నచ్చలేదు. "ఆయన పక్కన కూచున్న కుర్రాడెవరు? అతనూ కవేనా...?" అని అడిగేడు ఓ యువకుణ్ని చూపించి...

"శ్యామసుందరం గారి అన్నయ్యగారబ్బాయి. పేరు భాస్కర్. కవిత్వం అంటే ఇష్టమేలే కానీ లోకల్ స్కూల్లో టీచరుగా పని చేస్తున్నాడు. బీద పిల్లల కోసం ఊళ్లో పెద్దలు ఓ స్కూలు పెట్టారు. ఉత్సాహవంతులయిన నాబోటి వాళ్లు కావాలంటే వెళ్లి ఉచితంగా పాఠాలు.." అని సులోచన ఏదో చెబుతూండగానే అనంత్ దృష్టి కాస్త మూలగా కూచున్న రాంపండు మీద పడింది. "అడుగో సన్నాసి...." అన్నాడు హుషారుగా.

ఏదో చెప్పబోతున్న సులోచన ఉలిక్కిపడింది. "ఎవరా సన్నాసి?"

"రాంపండు. ఆ మూల ఎర్రచొక్కా వేసుకోలేదూ, వాడే, నా క్లాసుమేటులే. మంచి ఫ్రెండు".

"అతనా, బుజ్జికి ప్రైవేటు చెబుతాడు. మీ ఫ్రెండా, బాబూ....?"

సులోచన గొంతులో పలికిన స్వరాలు రాంపండు మీద గౌరవాన్ని సూచించక పోవడంతో "ఏం అలా అడిగేవ్?" అన్నాడు అనంత్.

"ఏం లేదులే, అవునుగానీ మీ ఫ్రెండుకి కాస్త బుర్రతక్కువా?" అడిగేసింది సులోచన.

"బుర్ర తక్కువా!? అలా ఎందుకనుకుంటున్నావ్?"

"అబ్బే, నీ ఫ్రెండు కదాని అలా అంటున్నానని అనుకోవద్దు. అతని విధానం చూస్తే అదోలా అనిపించి అడిగా".

"జోకులాపు. అతని తరహాలో వచ్చిన లోపం ఏమిటో చెప్పు" అన్నాడు అనంత్ కాస్త కటువుగా.

"చెప్పనా....! అతను అదోలా పిచ్చిచూపులు చూస్తాడు నా కేసి." సంజాయిషీ ఇచ్చుకుంది సులోచన.

"పిచ్చి చూపులా...? ఎలా చూస్తాడో కాస్త ఇమిటేట్ చేసి చూపించు" ఆజ్ఞాపించాడు అనంత్.

"చాల్లే, వీళ్లందరిముందూ చేసి చూపిస్తే నాకే పిచ్చి అనుకుంటారు." అభ్యంతరం లేవనెత్తింది సులోచన.

"ఫరవాలేదు. నేను నాప్‌కిన్ ఎత్తి పట్టుకుంటాను. నా ఒక్కడికే చేసి చూపించు. వాళ్ల బాబయ్యా డబ్బివ్వడం మానేసేక వీడికి మతి భ్రమించిందేమో నని భయం వేస్తోంది. వాడి శ్రేయోభిలాషిగా వాడి ఆరోగ్యం గురించి తెలుసుకోవడం నా బాధ్యత. నా విధి!" అనంత్ ఆవేశం చూసి సులోచన కరిగింది.

తను నాప్‌కిన్ పైకెత్తి పట్టుకుని సహకరించగా సులోచన ఇచ్చిన ప్రదర్శన చూసి అనంత్ ముగ్ధుడయిపోయాడు. ఒకటిన్నర సెకండ్ల పాటు మాత్రమే సాగినా అది అనంత్ భయాల్ని దూరం చేసింది. సులోచన నోరు వెళ్లబెట్టిన విధానం, దవడ జార్చిన విధానం, కళ్లు పెద్దవి చేసి తెగులు తగిలిన కోడిలా చూసిన చూపు - రాంపండు వ్యాధి లక్షణాలను పట్టిచ్చాయి.

ప్రదర్శన పూర్తవగానే అనంత్ తృప్తిగా నిట్టూర్చాడు. "ఇదే కదా, మరేమిటో అనుకుని అడిలి చచ్చాను. ఇది మామూలు రోగమేలే. వాడు నిన్ను ప్రేమిస్తున్నాడు" అని తేల్చేశాడు.

ఈసారి పిచ్చి చూపులు చూడడం సులోచన వంతయింది. ఇది మాత్రం ఇమిటేషన్ కాదు. ఆమె స్వంత చూపులే. "నన్నా? నాతో పెద్దగా పరిచయం కూడా లేదే!" అంటూ తెల్లబోయింది.



"పరిచయాలేవీ అక్కర్లేదులే. ఎవరితో బడితే వాళ్లతో ప్రేమలో పడిపోతాడు వాడు" అంటూ తేల్చేశాడు అనంత్. అన్నాడే కానీ "థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్" అంటూ సులోచన మొహం మాడ్చుకుని అప్పడం నమల నారంభించడంతో నాలిక కరుచుకున్నాడు.

"సులోచనా, నా ఉద్దేశ్యం అదికాదు. నువ్వంటే వాడు ఇష్టపడడంలో ఆశ్చర్యమేముందంటున్నాను. నా అంతట నేనే ఓ సారి నిన్ను పెళ్లి చేసుకుందామనుకున్నాను" అంటూ సర్దిచెప్పబోయాడు అనంత్.

"ఓ సారి పెళ్లి చేసుకుందామనుకోవడం ఏమిటి? భోజనానికి ముందు ఏమైనా వేసుకొచ్చావా అనంత్?" అంది సులోచన పళ్లుగిట్టకరిచి.

"అబ్బ, ఇదే ఆడవాళ్లతో వచ్చిన చిక్కు. నేను చెప్పేదేమిటంటే.... నేను పెళ్లిచేసుకుంటానని నిన్ను అడిగేనా... లేదా? అప్పుడు నువ్వు నవ్వి నవ్వి... ఎక్కిళ్లు వచ్చేటంతగా నవ్వావా లేదా? ఎందుకడిగేన్రా దేవుడా అనుకుని బాధపడింది నేను. ఇప్పుడు నేనేదో తప్పు చేసినట్టు ....'' అనంత్ చెప్పబోతూండగానే సులోచన కోపం కరిగిపోయింది. 'సర్లే, సర్లే, నాదీ పొరబాటుందిలే. అలా నవ్వి ఉండకూడదు. అది వదిలేయ్ గానీ, మీ ఫ్రెండు అందంగానే ఉన్నాడులే" అంది.

"మంచిదే, నీ కంటికి అందంగా ఉన్నాడంటే గొప్ప విషయమే! మేమంతా అలా అనుకోకపోయినా... నువ్వంటున్నావంటే...'' అంటూ నాన్చాడు అనంత్ ఇది మళ్లీ ఇంకో గొడవలోకి దారితీయదు కదాని బెదురుతూనే.

సులోచన కోరగా చూస్తూ "అందంగా అంటే... కొంతమందితో పోలిస్తే అనుకో''... అంది.

కొద్దిసేపటి తర్వాత రాంపండు కలిసినప్పుడు అనంత్ సంభాషణ యావత్తు చెప్పకుండా చివరి మాటలు మాటలు చెప్పడం ముప్పు తెచ్చింది.

*****

డిన్నర్ తర్వాత రాంపండు ఒంటరిగా దొరికినప్పుడు అనంత్ ఝాడించేశాడు. "మీ బాబయ్యతో గొడవ తర్వాత అలా ఫేడవుటయిపోతే ఎలాగరా? బతికున్నావో, కీర్తి శేషుడవయిపోయావో కనీసం ఫ్రెండ్సుకయినా తెలియన్వికపోతే ఎలా?"

రాంపండు నిట్టూర్చాడు. "ఏం చెప్పమంటావ్‌రా... నా ముఖాన పొద్దుపొడవడం మానేసింది".

"అలాగా...! మరి మా అందరికీ తెల్లవారుతోందే..."

"పక్షులు నా కోసం పాడడం మానేసాయి".

"అలాగా! ఏయే పక్షులు?"

రాంపండుకి కోపం వచ్చేసింది. "ఏయే పక్షులంటే పేరు పేరునా చెప్పాలేమిట్రా? పక్షులన్నీ కూడగట్టుకుని నాకోసం పాడకూడదని తీర్మానించుకున్నాయంతే!"

అనంత్‌కి ఎలా రియాక్టవాలో తెలియక, "ఈ తీర్మానాల వెనుక మీ బాబాయి హస్తం ఏమైనా ఉందని అనుమానిస్తున్నావా?'' అని అడిగిచూశాడు.

రాంపండు చికాకు పడ్డాడు. "బాబాయి గొడవ మానరా. దీనికంతా కారణం - వాలెంటింటా ప్రవర్తన. ఆ గుంపంతా కలిసి చావబాదుతూంటే కనీసం ఆపే ప్రయత్నం కూడా చేయలేదు తెలుసా?"

వీడి ప్రేమ మండిపోనూ, పొట్ట నింపుకోవడం కంటె ప్రేమ గురించే ఎక్కువ వర్రీ అవుతున్నాడన్నమాట అనుకుని అనంత్ "పోన్లే, నీ ప్రేమ చరిత్ర గ్రంథంలో మరో పేజీ చిరిగిపోయిందని అనుకుని ఊరుకో. అయినా ఇక్కడ తేలేదేమిటి? ట్యూషన్ టీచర్‌గానే సెటిలయిపోతున్నావేమిట్రా?'' అని పరామర్శించాడు.

"అదే నేనూ అడుగుదామనుకుంటున్నాను. నీకు వీళ్లూ తెలుసేమిట్రా?'' అన్నాడు రాంపండు కాస్త కోపంగా.

"తెలుసా... మా బంధువుల్రా బాబూ... ఇంతప్పటి నుంచి తెలుసు".

"అంటే... సులోచన కూడా నీకు చిన్నప్పటినుంచి తెలుసంటావ్? నువ్వెక్కడ తగిలేవురా బాబూ.... ఎక్కడికెళ్లినా నువ్వే అడ్డు. దేశంలో అందమైన, డబ్బున్న అమ్మాయిలందరూ నీకు చుట్టాలేనా?" అంటూ విసుక్కున్నాడు రాంపండు. కాస్త ఆగి, ''ఒరే అనంత్, సులోచనను నేను ప్రేమిస్తున్నానురా''




అన్నాడు.

''సులోచన మంచి అమ్మాయేలే".

"అదేమిట్రా, అంత చులాగ్గా అంత కాజువల్‌గా అనేస్తావ్. సులోచన దేవతరా, దేవత. కల్తీలేని దేవత. అవునొరే. డిన్నర్ టేబుల్ దగ్గర నా గురించి ఏమైనా చెప్పిందా?"

"చెప్పిందిలే. నువ్వు అందంగా ఉంటావని అంది" అని అనంత్ సంభాషణలో ఓ ముక్క మాత్రం చెప్పడంతో రాంపండు వెంటనే ఊహాలోకంలోకి వెళ్ళిపోయి, కాస్సేపు విహరించి తిరిగి వచ్చినా ఎదురుగా అనంత్ కనబడడంతో చికాకు పడ్డాడు. "ఒరేయ్, నువ్వు నీ రూమ్‌కి పో. నేను వెళ్లి కవిత్వం రాసుకోవాలి" అని ఆర్డరేసాడు.

*****

పొద్దున్న అనంత్ లేచేసరికల్లా రాంపండు హాజరుగా ఉన్నాడు. కళ్లు తెరవగానే "ఒరేయ్, సులోచనకు ఆ పేరెందుకు పెట్టార్రా" అని అడిగేడు.

అనంత్ చికాకుపడ్డాడు. "పాచిమొహంతో నేనెవడితోనూ కబుర్లు చెప్పను. అయినా అదేం ప్రశ్నరా? పిల్లలకు పేర్లు వాళ్ల అమ్మా, నాన్నా పెడతారు".

"చవటా, టెక్నికల్ డిటైల్స్ ఎవడికి కావాలోయ్. సులోచన అని పేరు పెట్టి నా కొంప ముంచారు. ప్రాస కుదిరి చావటం లేదు. సులోచనకు ప్రాసగా ఆలోచన తప్ప ఏదీ తట్టడం లేదు. అదే రాధ అనుకో. బాధ, వ్యథ... ఇలా ఎన్నో మాటలున్నాయి. అయినా ఏదో కాస్త కుస్తీ పట్టాను. చదువుతాను విను" అని రాంపండు ఉపక్రమించాడు.

"ఒరేయ్, పాచి మొహంతో కబుర్లాడను అంటే, కవిత్వం వింటాను

అని కాదు" అని ప్రకటించి అనంత్ బాత్‌రూమ్ వైపు నడిచేడు. కానీ రాంపండు వదలలేదు. బాత్‌రూమ్ బయటే నిలబడి కవిత్వం వినిపించాడు. సులోచన నవ్వు ఎలా ఉందో, నడక ఎలా వుందో బోల్డంత కవిత్వ సరంజామా సహాయంతో వర్ణిస్తుండగా యతి, సుతి వచ్చి పడ్డారు.

వస్తూనే యతి అందుకున్నాడు. "అనంత్, మైడియర్. వచ్చేశావ్. ఒరే సుతీ నే చెప్పలే.... హియర్ ఈజ్ అనంత్. ఆపదలో ఆదుకునే అనంత్. ఆప్తులంటే పడిచచ్చే అనంత్. అన్నివేళలా అనంత్‌నే వాడండి. టింగ్...టింగ్..."

"బాకా ఆపు. అసలు రప్పించిన పని ఏమిటో చెప్పు" అన్నాడు వాళ్లకు కాఫీ ఇమ్మనమని అచలపతికి సైగ చేస్తూ.

"అదేమిటి, ఈ పాటికి రాంపండు చెప్పేవుంటాడేమోననుకున్నా" అన్నాడు సుతి.

"వాడా, వాడి గోల వేరే..." అంటూండగానే రాంపండు అడ్డు పడ్డాడు. "అదే... కవిత్వం అంటే వాడికి చెబుతున్నాను. స్కీము గురించి ఇంకా రాలేదు" అన్నాడు గబగబా.

సుతి అందుకున్నాడు. "రైట్.. కవిత్వమేరా మనకు డబ్బు తెచ్చిపెట్టేది. స్కీము చెప్తాను విను. ఇక్కడ మనలాటివాళ్లు చాలామంది ఉన్నారులే. పందాలు కట్టడానికి రేసుల సీజను కాదాయె.... ఏం చేద్దామా అని ఆలోచిస్తుండగానే యతి గాడికి ఓ బ్రిలియంట్ ఐడియా వచ్చింది. ప్రస్తుతం ఈ ఏరియాలో ఈ సంచారకవుల బృందం తిరుగుతోంది. రాబోయే ఆదివారం నాడు పది ఊళ్లల్లో వేర్వేరు కవులు కవిత్వం వినిపించబోతున్నారు. జనాలు లేచిపోయేంతవరకు వీళ్లు పద్యాలు పాడుతూంటూనే ఉంటారనుకో. అయితే ఎవరు ఎంత ఎక్కువ సేపు పద్యాలు వినిపిస్తారు అన్నదానిమీద పందెం అన్నమాట".

"అంటే జనాభా చేత పందాలు కట్టించి వాళ్ల అంచనాలు కరక్టయితే కట్టిన దానికి ఇన్ని రెట్లు ఇస్తారన్న మాట"

"అంతే కదా, గుర్రాల చరిత్రలాగానే ప్రస్తుతం ఈ తాలూకాలో తిరుగుతున్న కవుల చరిత్ర కూడా సేకరించి అందజేస్తున్నాం. ఇంతకుముందు వాళ్ళు వెళ్లిన ఊళ్లల్లో ఎంతసేపు కవిత్వం చదివేరు, ఎంత సేపు ప్రజల్ని ఆకట్టుకోగలిగేరు అని తెలుసుకోడానికి సూర్యం అని మన ఫ్రెండుకే ఆ పని అప్పచెప్పాను. వాడు ఊళ్లు తిరిగి అక్కడ వాళ్ల ఓపిక గురించి, వివరాలు సేకరించాడు. అంతేకాకుండా ఈ తాలుకాలోని ఊళ్ళు తిరిగి క్రితం సారి కవిసమ్మేళనాలకి ఇంతమంది వచ్చారు. ఇంత సేపటికి హాల్లో సగం ఖాళీ అయిపోయింది వంటి సమాచారం కూడా పోగేసాడు. వీటిని బట్టి ఓ చార్ట్ తయారు చేసి ఫలానా కవికయితే ఇన్ని రెట్లు ఇస్తాం అని ఎనౌన్స్ చేశాం. దాని ప్రకారం ఇప్పటిదాకా ఏభై మంది కట్టారు. వచ్చే ఆదివారం మన ఏజంట్లు ప్రతీ ఊళ్లోనూ ఉండి కవిత్వం సెషన్ ఎంతసేపు సాగిందో సెకన్లతో సహా కరక్టుగా రికార్డు చేస్తారు. దాని ప్రకారం పందెం గెలిచినవారికి మనం డబ్బివ్వాలన్నమాట. ఓడిపోయిన వారి డబ్బు మన దగ్గరే ఉంటుంది. నష్టపోయే ఛాన్సే లేదులే. కాకపోతే ఈ స్కీముకి నీ దన్ను ఉందని తెలిస్తే డబ్బు బాగా వస్తుంది. ఈ బిజినెస్‌లో నాలుగు డబ్బులు వస్తే మేం కాస్త తలెత్తుకు తిరగవచ్చని ఆశ. అందుకే నిన్ను పిలిచాం".

ఆలోచించిన కొద్దీ అనంత్‌కి ఈ కవిత్వబృందాల స్కీము బాగానే ఉందనిపించింది. ఈలోగా యతి అచలపతిని అడిగాడు. "ఏమోయ్, నువ్వు కూడా పందెం కట్టకూడదూ" అని.

అచలపతి సమాధానం చిరునవ్వే. రెట్టించి అడిగితే "చూద్దాం సర్... ఏ గుర్రం... అదే ఏ కవి గొంతు ఎలా తిరుగుతుందో తెలియకుండా రిస్కు తీసుకోలేం కదా" అనేశాడు.

అనంత్ ఎక్కువ ఆలోచించకుండానే సరే అనేశాడు.

****

మూడో రోజు బెట్‌లు ముమ్మరంగా కడుతున్న సమయంలో రాంపండు, యతి, సుతి అనంత్ దగ్గరికి వచ్చారు. "అనంత్, నీకో విషయం చెప్పాలా. ఎలాగు విషయం ఇంతదాకా వచ్చేసింది కాబట్టి జరిగిన పొరబాటు నీకు చెప్పేస్తున్నాం. మనం వేసిన టేబుల్‌లో ఒక కవి గురించిన లెక్క తప్పింది. ఆయన కెపాసిటీని మన సూర్యం గాడు తక్కువగా అంచనా వేసి ఆ ప్రకారం రేటు ఫిక్స్ చేశాడు.."

అనంత్ ఖంగారు పడ్డాడు. "అలా ఎలా జరిగింది? సూర్యం చాలా సైంటిఫిక్‌గా లెక్కవేసాడన్నారు మీరు".

"నిజమే అనుకో కానీ సత్యశ్రీ కవిత్వం వినడానికి వెళ్లినప్పుడు దెబ్బతిన్నాడు. సత్యశ్రీ రాసుకొచ్చిన కాగితాలలో అరడజను కాగితాలు జారిపడిపోయాయట. అది చూసుకోకుండా ఆయన కవిత్వం మొదలు పెట్టేశాడు. మధ్యలో గుర్తించినా వెతుక్కోలేక అంతటితో సరిపెట్టేశాడు. మన సూర్యానికి అది తెలియక ఈయన కెపాసిటీ ముప్ఫై ఐదు నిమిషాలే అని రికార్డు చేసాడు"

అనంత్ ఉలిక్కిపడ్డాడు. "సత్యశ్రీ కెపాసిటీ ముప్ఫై ఐదు నిమిషాలా? చాల్లే, ఎవడయినా వింటే నవ్విపోతాడు. ముప్పావుగంటకు ఒక్క నిమిషం తక్కువ ఉండదు. మైకు పట్టుకుంటే వదలడు. మీ సూర్యం మన కొంప ముంచినట్టున్నాడే! అవును. ఈ విషయం మీకు ఎప్పుడు తెలిసింది? నన్ను పిలవడానికి ముందా?"

యతి, సుతి జంటగా నవ్వేరు. "ముందు తెలిసింది కాబట్టే నిన్ను పిలిచాం. ఎలాగోలా నిన్ను ఇరికిస్తే అచలపతి నిన్నూ, తద్వారా మమ్మల్నీ బయటపడేస్తాడని మా ప్లాను".

"ఓరి దుర్మార్గులారా! లాభాలొస్తే మీరే పంచుకొనేవారన్న మాట. ఇబ్బంది వచ్చింది కాబట్టి నన్ను దింపారు. ఈ సమస్యనుండి బయట పడేయడానికి అచలపతి అక్కరలేదురా. ఇక్కడి కవుల గురించి అతనికంటె నాకే బాగా తెలుసు" అన్నాడు అనంత్ ధీమాగా.

"అంటే సత్యశ్రీ కంటె ఎక్కువసేపు కవిత్వం చదివేవాళ్లున్నారంటావా? అలా ఎవరైనా ఉంటే మనం బతికిపోయినట్టే. కానీ ఆయన్ని మించిన బోరుగాడు లేడని మనవాళ్లంటున్నారే!" అంటూ యతి ఆశ్చర్యపడ్డాడు.

"వెర్రివాడా, శ్యామసుందరం గారి గురించి మీరెరగరు. ముసలివాడయి



పోయాక ఆయన ఇప్పుడు చదువుతున్న కవిత్వం చూసి మీరు అపోహ పడుతున్నారు. ఆయన "నా కథ" అనే కవిత్వం అందుకున్నాడంటే సాలిడ్ గంటసేపు నడుస్తుంది. ఈ సత్యశ్రీ తలకిందులా తపస్సు చేసినా ఆ లెవెల్‌కి రాలేరు".

అనంత్ ధీమా చూసి రాంపండు కళ్లల్లో వెలుగు వచ్చింది. "శ్యామసుందరం మీద ఎవరూ బెట్ కట్టలేదు తెలుసా. ఆయనే నెగ్గేడంటే మన కంపెనీకి భలే లాభాలు. నేను ధైర్యంగా పెళ్లి ప్రపోజలు చేసేయచ్చు" అంటూ సంబరపడ్డాడు.

అంతలోనే యతికి అనుమానం వచ్చింది - "శ్యాంసుందరం గారు ఓపిక లేదంటే...?"

"ఆ సంగతి నేను చూసుకుంటాను" అన్నాడు అనంత్ ధైర్యంగా. అంత ధైర్యంగానూ సాయంత్రం ఆయన ఇంటికి వెళ్లాడు. కాస్సేపు అవీ, ఇవీ మాట్లాడేక" అవునూ ఈ ఆదివారం మీ పద్యం ఏది చదవబోతున్నారు?" అని అడిగేశాడు సూటిగా.

ఆయన నోరు చప్పరించాడు. "ఈ పల్లెటూరి మూకకు ఏం చదివి వినిపిస్తే మాత్రం ఏం అర్థమవుతుంది? అసలు నాలాటివాడు తెలుగు జాతిలో పుట్టడం తెలుగు జాతి అదృష్టం, నా దురదృష్టం. నా విలువ తెలియని మూకకు ఏం చెప్పినా ఒకటే. ఏదో కాసేపు ఓ చిన్న గేయం ఒకటి..".

అనంత్ అడ్డు వచ్చాడు. "ఎంతమాటన్నారు సార్. ఏదో గేయమా? ప్రజలకు అన్యాయం చేయకండి. మీ ఖండకావ్యం "నా కథ" చదివి వినిపించినప్పుడే ప్రజలకు కనువిప్పవుతుంది. మీరెలాగైనా దాన్ని చదివాలి."

ముసలాయన మూర్ఛపోయినంత పని చేశాడు. "మీలాటి కుర్రాళ్ళు దాన్ని మెచ్చుకుంటారని నేను కలలో కూడా అనుకోలేదు. రెండేళ్ల క్రితం కవుల సభలో చదివినప్పుడే అంత రెస్పాన్స్ రాలేదు. ఉగ్గుపాల దగ్గర్నుంచి నా జీవిత చరిత్రంతా ఒప్పచెప్పేసేనన్న కామెంట్సు కూడా వచ్చాయి. పోనీ దాన్ని సగానికి సగం కుదించి, ఇంకోసారి ప్రయత్నించి చూద్దామని ఐడియా వచ్చింది కానీ..."

"..ఏమిటీ దాన్ని కుదించడమా? ఒక ఖండకావ్యాన్ని ఖండఖండాలు చేయడమా? మహాపాపం. దాంట్లోంచి ఒక్క అక్షరం ముక్క తగ్గిస్తే నా మీద ఒట్టే. వాడపల్లి సభలో మీరు ఆదివారం దాన్ని చదవబోతున్నారు. నేను పదిమంది మా ఫ్రెండ్సుతో సహా మీ సభకు వచ్చి ఆస్వాదించబోతున్నాను. దట్సాల్!" అనేశాడు అనంత్ చనువు తీసుకుని.

ముసలాయన బ్రహ్మానందభరితుడయిపోయాడు. "మీలాంటి యువతరం అలా వెన్నంటి వుంటే, ఖండకావ్యాలేమిటి, ఏకంగా కావ్యాలే రాసేస్తా" అన్నాడు.

వాడపల్లి సభలో "నా కథ" చదవబోతున్నానని ఆయన దగ్గర మాట పుచ్చుకున్నాక అనంత్‌కి ధైర్యం వచ్చేసింది. అనంత్ తెలివితేటల విషయంలో తాము ఇన్నాళ్లు పొరబడ్డామని రాంపండు, యతి, మతి ఏకగ్రీవంగా ఒప్పేసుకున్నారు.

****

కథ బాగానే నడుస్తోందని అప్పటిదాకా ధీమాగా ఉన్న అనంత్‌కి శనివారం రాత్రి కాస్త అనుమానం తగిలింది. అచలపతి వచ్చి భాస్కర్ పేర బెట్ కట్టాడని రాంపండు చెప్పగానే! భాస్కర్ కుర్రకాకి. వేంపూడి స్కూలులో టీచరే గానీ కొమ్ములు తిరిగిన కవి కాదు. మరి అచలపతి వంటి ఘటికుడు ఎందుకు కట్టినట్టు? తిరకాసు ఏమిటో కనుక్కోవడానికి అచలపతిని పిలిస్తే మంచిదనుకుని పిలిచాడు.

అచలపతి ఓ ఉత్తరం పట్టుకు వచ్చాడు. "సర్, సాయంత్రం శ్యామసుందరం గారి నౌకరు వచ్చి మీకిమ్మన్నాడు" అని చేతికందించాడు.

"ప్రియమైన అనంతం, నాకు సడన్‌గా పడిశం పట్టింది. మొన్న నిన్ను చూడడానికి వచ్చినప్పుడు మీ అచలపతి వద్దు వద్దంటున్నా ఐసు వేసిన కూల్‌డ్రింకు ఇచ్చాడు. పాపం మర్యాద చేస్తున్నాననుకున్నాడు కానీ నా బాధలు అతనికేం తెలుసు? ఇప్పుడు నాకు గొంతు పోయింది. "నా కథ" లాటి పెద్దకవిత చదివే ఓపిక లేదు. ఏదో చిన్నదాంతో సరిపెట్టేస్తాను. ఈ తెలుగుజాతి నా ఘనత ఎలాగూ గుర్తించ లేదు.

మరి మీలాంటి అభిమానులను తృప్తిపరచడం ఎలాగా అని ఆలోచిస్తుండగా ఇవాళ పడిశం సంగతి విని నన్ను పరామర్శించడానికి మా ఇంటికి వచ్చిన అచలపతి ఓ సూచన చేశాడు. నీలాటి అభిమానులు ఊరు కదలక్కర్లేకుండా వేంపూడిలోనే జరిగే సభలో ఆ ఖండకావ్యం వినిపిస్తే మంచిదన్నాడు. మా అన్నయ్య గారబ్బాయి భాస్కర్ కూడా మా సంచారకవుల బృందంలో సభ్యుడే. ఇక్కడే స్కూలులో టీచరుగా పని చేస్తున్నాడు. వాడికి ఈ కవిత నిచ్చి చదవమంటున్నాను. వాడు చదువుదామనుకున్న గేయం నేను చదివేస్తాను. మీరు వాడి సభకు వెళ్లి మీ ముచ్చట తీర్చుకోవచ్చును. ఆశీర్వచనములతో, - శ్యామసుందరం".

ఉత్తరం ముగించి అనంత్ భవిష్యత్ తలెత్తి అచలపతికేసి చూశాడు. "అచలపతీ, ఎందుకు చేసావీ పని?"

"సర్, ఆ భాస్కర్ భవిష్యత్తు ఈ సభ మీద ఆధారపడి ఉంది. అతనికి హెడ్ మాస్టరు పోస్టు ఇవ్వాలా వద్దా అన్న దానిమీద తర్జన భర్జనలు సాగుతున్నాయి. ఇంత పొడుగు కవిత్వం చదవగలిగిన వాగ్ధాటి అతనికి ఉందని బుజువయితే అతని ప్రమోషన్ ఖాయం".

"సరే, అలాగే కానీ కథ అటు, ఇటు తిరిగి ఓ మనిషి సుఖసంతోషాలకు కారణభూతమయితే మంచిదేలే!" అని నిట్టూర్చాడు అనంత్.

"ఒక మనిషి కాదు సర్. ఇద్దరు - అతనూ అతని ప్రేయసి సులోచనా. ఇక వాళ్ల పెళ్లికి ఏ అడ్డంకులూ ఉండవ్" అన్నాడు అచలపతి.

అప్పుడే గదిలోకి అడుగుపెట్టిన రాంపండు ఈ మాట వింటూనే మూర్ఛపోయాడు.

అనంత్ మరో సారి నిట్టూర్చాడు. "ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డట్టు, కథ ఎన్ని మలుపులు తిరిగినా చివరికి రాంపండు ప్రేమ మీదే దెబ్బ కొడుతోందోయ్ పాపం. సరేలే, వీడి మొహం మీద నీళ్లు చల్లు" అని అర్డరేశాడు.

-ఎమ్బీయస్ ప్రసాద్

(పి.జి.ఉడ్‌హవుస్ రాసిన 'ది గ్రేట్ సెర్మన్ హేండికాప్' కథ ఆధారంగా)



# ఆ ఏడిటిలో మిగిలిన ఆ ఒక్కటీ పెద్ద హిట్ అవుతుంది

-ఆర్.పి.పట్నాయక్



**పట్నాయక్ పాట తెలుగునాట స్వరసంరంభం చేస్తోంది. వేళ్ళమీద లెక్కపెట్టగల సినిమాలతోనే వేనోళ్ళ వినిపిస్తున్న పట్నాయక్ శ్రోతల గుండెల్లో స్థిరనివాసం ఏర్పరచుకోవాలని తపిస్తున్నాడు. మార్చి 10న గాయకుడిగా, సంగీత దర్శకుడిగా ఒకే సంస్థ (వంశీ బర్కిలీ) నుండి అవార్డులను అందుకోనున్నారు. అదే రోజు ఆయన బర్త్‌డే కూడా! ఈ సందర్భంగా ఈ స్పెషల్ ఆర్టికల్‌ని ఆయన మాటల్లోనే...**

ఆర్పీ పట్నాయక్ అని అందరూ నన్ను పిలుస్తుంటారు కదా. ఇంతకీ ఆర్పీ అంటే ఏంటో తెలుసా? రవీంద్ర ప్రసాద్.

ఉద్యోగ రీత్యా మా నాన్నగారు జనకేశ్వరరావు ఒరిస్సాలోని జైపూర్‌లో వుండేవారు. అప్పటికి నాకు పదేళ్ళ వయసు. అప్పుడే 'శంకరాభరణం' సెకండ్ రిలీజ్ అయ్యింది. ఫ్యామిలీతో కలిసి ఆ సినిమా చూసి తెగ ఇన్‌స్పైర్ అయిపోయాను.

'శంకరాభరణం' ప్రేరణతో గాయకుడిగా నా పయనం మొదలైంది. ఆ సినిమాలో పాటలన్నీ ఫంక్షన్స్‌లో పాడి అలరించేవాడిని.

చిన్నతనంలో నాది ఆడపిల్ల గొంతులా వుండేది. ఆడ, మగ గొంతులు మార్చి పాడేవాడిని.

మా ఫ్యామిలీలో సంగీతజ్ఞులు ఎవ్వరూ లేరు. అయితే మా నాన్నగారు మాత్రం ఇంట్లో తెలియకుండా బుర్రకథలు చెప్పేవారట.

సంగీతంలో నాకు గురువులు ఎవరూలేరు. అయితే వర్ణాల వరకూ మాత్రం నేర్చుకున్నాను.

పోస్ట్ గ్రాడ్యుయేషన్ చదువుతుండగా సంగీత దర్శకుడు కావాలనే ఆలోచన మొదలైంది. నా స్నేహితుడు పాటలు రాస్తే నేను ట్యూన్స్ కట్టేవాళ్ళి.

సివిల్స్ ప్రిపరేషన్ కోసం 1994లో హైదరాబాద్ వచ్చాను. రెండేళ్ళు సిన్సియర్‌గా ప్రయత్నాలు చేసానుగానీ, వర్కవుట్ కాలేదు.





**జననం : మార్చి 10, 1970**

**జన్మస్థలం : పార్వతీపురం దగ్గర బెల్లాం**

**విద్యార్హత : ఎమ్మెస్సీ స్పేస్ ఫిజిక్స్**

**ముద్దుపేర్లు : పట్నా, రవి, ఆర్పీ**

**రాశి : మీనం**

**హాబీలు : ఖాళీ దొరికితే సినిమాలు చూడటం**

1997 నుంచి సినిమా పరిశ్రమలో ప్రయత్నాలు మొదలుపెట్టాను. సివిల్స్‌లో నా క్లాస్‌మేట్ అయిన దిలీప్ ద్వారా దర్శకుడు చంద్ర సిద్ధార్థ పరిచయం అయ్యారు. ఆయన ద్వారా సర్కిల్ ఏర్పడింది.

చంద్ర సిద్దార్థ ద్వారా 'ఔనంటూ కాదంటూ' సినిమా సంగీత దర్శకుడిగా తొలి అవకాశం లభించింది. మొత్తం ఏడుపాటలు తయారు చేసాను. కానీ ఆ ప్రాజెక్ట్‌నుంచి చంద్ర సిద్దార్థ బైటికి వచ్చేయడంతో నేనూ వచ్చేశాను.

ఆ ఏడు పాటల్లో 2 పాటలని 'నీ కోసం'లో ఉపయోగించడం జరిగింది. మరో మూడు పాటలను 'వినాలని వుంది' అనే ప్రయివేట్ ఆల్బమ్‌లో నా పేరు లేకుండా ఉపయోగించడం జరిగింది. 'మనసంతా నువ్వే'లో 'ఎవ్వరి నెవ్వుడు తన వలలో' పాట ఆ ఏడింటిలో ఒకటి. ఇంకా ఒక్క పాట మిగిలివుంది. సినిమాకు ఇస్తానో లేదో తెలీదుగాని, అది మాత్రం పెద్ద హిట్ అవుతుంది.

అంజిబాబు, శ్రీనివాస్ అనే ఇద్దరు ఫోటోగ్రాఫర్స్ కలిసి నా సంగీత దర్శకత్వంలో 'ఆనందం' అనే మ్యూజిక్ ఆల్బమ్ చేసారు.. 'వాతాపి గణపతిం' పాటని విజువల్‌గా చెత్తగా తీయడంతో, ఆ ఆల్బమ్ వివాదాస్పదమైంది.

నేను సినిమా ఫీల్డ్‌లోకి వెళ్ళడానికి ఇంట్లోవాళ్ళు అభ్యంతర పెట్టలేదు. ఎందుకంటే నేను తప్పు చేయనని తెలుసు. నాకు చెడుఅలవాట్లు ఏమీలేవు. కనీసం 'టీ' కూడా తాగను.

నా ఆరో ఏట మా తాతయ్య నెలకు పదిరూపాయలిస్తాను టీ మానేస్తావా అని అడగడంతో వెంటనే టీ తాగడం మానేసాను. నాకు మొదట్నుంచీ కూడా ఆత్మవిశ్వాసం అధికం.

సంగీతం దర్శకుడు గానూ, గాయకుడుగానూ నా తొలి చిత్రం 'నీ కోసం'.

నేను ట్యూన్ కట్టే పద్ధతి అందరికన్నా విభిన్నం. నా సినిమాలకి అస్సలు మ్యూజిక్ సిట్టింగ్సే వుండవు. నేను తయారు చేసుకున్న ట్యూన్స్‌ని దర్శక నిర్మాతలకి వినిపిస్తాను. నాకు మూడ్ వస్తే రోడ్డుమీద వెళ్తున్నప్పుడు కూడా ట్యూన్ కట్టేస్తాను. ప్రయాణం చేస్తున్నప్పుడు ట్యూన్స్ ఎక్కువ పుడుతుంటాయి.

నా సినిమాలన్నింటిలో ఫోక్ సాంగ్స్ కంపల్సరీగా వుంటాయని చెప్పలేను. తేజగారి ప్రోత్సాహంతోనే ఫోక్ సాంగ్స్ చేసాను.

ఇండియాలో కాకుండా వేరే దేశంలోని ఓ కుగ్రామంలో కూడా నా పాట వినిపించాలని ఆశిస్తున్నాను.

గత ఏడాది హిందీ ఆల్బమ్ ఒకటి చేసాను. పేరు ఇంకా పెట్టలేదు. త్వరలో విడుదల చేయాలి. అందులో 'సోజారే' అనే జోలపాట నన్ను బాగా కదిలించింది, అందర్నీ కదిలిస్తుంది కూడా హిందీ ఆల్బమ్స్‌కి పొటెన్షియాల్టీ ఎక్కువ కాబట్టి స్నేహితులతో కలిసి ఆ ఆల్బమ్ చేసాను. నేను సంగీతం, రామానంద్ సాహిత్యం, రాజేష్ పాటలు పాడాను.

విధి, శ్రీకారం, బంగారు బొమ్మ.. ఇలా చాలా సీరియల్స్‌కి టైటిల్ సాంగ్స్ చేశాను.

నా ఫేవరెట్ మ్యూజిక్ డైరెక్టర్స్ ఆర్.డి. బర్మన్, ఇళయరాజా, ఎ.ఆర్. రెహమాన్.

నాకు సూర్యకాంతం, కోట శ్రీనివాసరావుల నటన అంటే ఇష్టం.

# గురువు ద్వారా నేర్చుకున్న విద్యకే ఆత్మ ఉంటుంది

## -'పద్మవిభూషణ్' అవార్డుకు ఎంపికైన కిషోరీ అమోంకర్

**"సంగీత సాధన అనేది నాకోవరం వంటిది. సంగీతంతో దేవుడితో సంభాషించవచ్చు. సంగీతానికున్న విలువలు మరేదానికీ లేవు. సంగీత సాధన వల్ల ధర్మ, అర్థ, కామ, మోక్షాలు లభిస్తాయని విశ్వసిస్తాను. వీటివల్ల మనం కోల్పోయిన శాంతి చేకూరుతుంది" అంటారు హిందుస్తానీ గాత్ర సంగీత విద్వాంసురాలు "కిషోరీ అమోంకర్". గత జనవరిలో కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన రాష్ట్రపతి అవార్డులలో ఈమె "పద్మ విభూషణ్‌కు" ఎంపికైన అయిదు మందిలో ఒకరు.**

1931లో కిషోరీ అమోంకర్ గోవాలో సంగీత కుటుంబంలో జన్మించారు. సుప్రసిద్ధ హిందుస్తానీ సంగీతకారిణి మేఘాబాయ్ కుర్డికర్ ఈమె తల్లి. కిశోరీ ఆరవ ఏటనే తండ్రి మరణించడంతో తల్లి శిక్షణలో సంగీతాభ్యాసం మొదలైంది. "నేను పుట్టుకతోనే సంగీత కళాకారిణిని. మా అమ్మ సంగీతం ప్రాక్టీసు నేను కడుపులో ఉండగా కూడా కొనసాగిందట. సరిగమలు వింటూనే పెరిగిన నాకు సంగీతమే ప్రపంచమైంది. నాన్న మరణం తరువాత నాకు మా అమ్మే తల్లీ, తండ్రి, గురువూ, దైవం. నన్ను మంచి సంగీత కళాకారిణిని చేసేందుకు ఆమె ఎంతో తపన పడింది. నేను కూడా క్రమశిక్షణతో ప్రతీది శ్రద్ధతో నేర్చుకున్నాను. క్రమశిక్షణ లేనిదే సంగీతంలో ఎవరూ రాణించలేరన్నది నా నమ్మకం. ఇలాంటి కళలు పుట్టుకతోనే వస్తాయి' అంటారు అమోంకర్.

చిన్నతనంలో తమ ఇంటి డాబాపై తల్లితో కలిసి ఎందరో విద్వాంసులు సంగీత చర్చలను శ్రద్ధగా గమనించే అమోంకర్‌కు తల్లి కఠినమైన సంగీత శిక్షణ నిచ్చారు. అమోంకర్ సంగీతమే ఆమెకు గొప్ప ఆకర్షణ.

'నేను సంగీత శిక్షణలో గురుశిష్య పరంపరను గౌరవిస్తాను. పుస్తకాలు, క్యాసెట్లు, సి.డిలు విని సంగీతం నేర్చుకుని పాడటం సరికాదు. అలాంటిది సజీవ సంగీతం కాదు. గురువుతో నేర్చుకున్న విద్యకే ఆత్మ ఉంటుంది. మన భారతీయ సంగీతమనేది వేదం వంటిది. ఇలాంటి విద్యను యంత్రాల ద్వారా నేర్చుకోవడంలో దక్కేది కృతక సంగీతమే అవుతుంది" అనే అమోంకర్ రాఘవేంద్ర స్వామి భక్తిలో ప్రధానంగా పాడుతారు. తన సంగీతానికి అంతిమ గమ్యం భక్తిభావనగానే సాగుతున్నా రామె. ఎందుకంటే భారతీయ శాస్త్రీయ సంగీతం ఆధ్యాత్మిక చింతనతో కూడుకుంది. దాని ఔన్నత్యాన్ని కాపాడటం తన విధిగా భావిస్తారు. సంగీతానికి సంబంధించిన విలువల్లో ఎక్కడా రాజీపడని తత్వం వల్ల ఆమెకు అహం ఎక్కువ అనే ముద్ర పడింది. కానీ వీటిని ఆమె ఖాతరు చేయరు.



"ఉన్నత ప్రమాణాలను కాపాడటానికి కొన్ని సూత్రాలను పాటించక తప్పదు" అంటారు.

మరోవైపు "కంప్యూటరైజ్డ్ టెక్నిక్ మీద ఎక్కువగా ఆధారపడటం వల్ల సంగీతం తన ఆత్మను కోల్పోతున్నది. దీంతో శాస్త్రీయ సంగీతం ఆదరణను కోల్పోతుంది. ఇది నా జీవిత కాలంలోనే పతనం చెందుతుందని భయంగా ఉందంటారు" కిషోరీ అమోంకర్. ప్రయోగాల పేరుతో సంప్రదాయాలను విస్మరించి శాస్త్రీయ సంగీతానికి చెరుపు చేయడం సరికాదని దాన్ని కాపాడుకోవడం తన బాధ్యతగా భావిస్తారామె.

తరాలుగా వస్తున్న శాస్త్రీయ సంగీత సంప్రదాయాన్ని శిరసావహించి నడుచుకోవడం అనేది తన తల్లి నుండి నేర్చుకున్న కిషోరీ అమోంకర్ వి.శాంతారాం "గీత్‌గా యాపత్థ రోంనే"లో పాడాలని నిర్ణయించుకున్నప్పుడు తల్లి వద్దన్నది. అయితే కిషోరీ పాట రికార్డింగ్ చేసింది. ఆ పాట విన్న తల్లి "నీవు సినిమాలో పాడాలనుకుంటే ఇక నుండి తంబూరాను మాత్రం ముట్టుకోవద్ద"ని తేల్చి చెప్పడంతో అంతటితో ఆగిపోయింది. అయితే మళ్ళీ 1991లో నిహలాని "దృష్టి" చిత్రానికి సంగీతం సమకూర్చగా ఆ సంగీతం దురుపయోగమే అయింది. ఈ చిత్రాన్ని చూడటానికి అమోంకర్ తల్లి ససేమిరా అంది. ఆ తరువాత మళ్లీ కిషోరీ సినిమాల జోలికి వెళ్లలేదు. అయితే ఈ రోజుల్లో శాస్త్రీయ సంగీతాన్ని తొలుత సీరియస్‌గా నేర్చుకున్న చాలామంది కచేరీవైపుగాక సినిమాలు, టి.వి. పాప్ వంటి ఇతర రంగాల వైపు వెళ్లడాన్ని నిరసించే అమోంకర్ 'సినిమా, పాప్ సంగీతాలకు ఉన్నతమైన శాస్త్రీయ సంగీతం' తొలిమెట్టుగా పనికి వస్తుందనుకోవడం పట్ల ఆవేదన వ్యక్తం చేస్తారు.

అమోంకర్ దృష్టిలో హిందుస్థానీ, కర్ణాటక సంగీతాలు వేరు వేరు కావు. "ఈ వేరు భావనను నేను విశ్వసించను. దాదాపు శృతి, రాగాలు వీటికి ఒకేలా ఉంటాయి. వాద్య పరికరాల్లో కొంత తేడా ఉన్నా అంతా భారతీయ శాస్త్రీయ సంగీతమే. ఈ రెండూ శ్రోతల్లో రసభావం పెంపొందిస్తాయి" అంటారు. ఇప్పటి ట్రెండ్స్ నుండి దూరం కావడానికి మళ్లీ నాట్య శాస్త్రం, సంగీత రత్నాకరం, బృహద్దేశి గ్రంథాలను మళ్లీ మళ్లీ అధ్యయనం చేస్తారామె.

ముప్పై ఏళ్ల వయసు పైపడిన తరువాత కిషోరీ అమోంకర్ గొంతు హఠాత్తుగా మూగపోయింది. ఆ తొమ్మిదేళ్ల కాలంలో తల్లి వెంట సహగానానికి వెళ్ళినా పాడేది కాదు. ఆ స్థితికి తనలో తానే దుఃఖ పడేది. అయినా సంగీతంపై నా ప్రేమ చావలేదు. చూపులతోనే తల్లి గానవాహినిను అందుకుని హృదయంలో పాడుకుని సాధన చేశారామె. 1987లో సంగీత నాటక అకాడమీ పురస్కారం, పద్మభూషణ్ అవార్డులు పొందారు. 1998లో "సంగీతా సామ్రాజ్ఞి" బిరుదుతో బాటు రెండు లక్షల నగదు బహుమతి అందుకున్న అమోంకర్ తన అయిదున్నర దశాబ్దాల సంగీత జీవితంలో పలు సన్మానాలు పురస్కారాలు అందుకున్నారు. ఇప్పుడేమో 'పద్మవిభూషణ్'కు ఎంపికైనారు.

మారిన సంగీత విధానాలకు విరుద్ధంగా అలనాటి సంప్రదాయాన్ని పునరుద్ధరించేందుకు తను పుట్టిన గోవాలో గురుకులాన్ని ఏర్పాటు చేయనున్నారు. ఇందుకు ప్రభుత్వం కూడా స్థలం కేటాయించింది. జీవితంలో సంగీతమే తపస్సుగా భావించి అందులోనే మమేకమై స్వరంలో స్వరంగా కలిసిపోయే అరుదైన కళాకారిణి కిషోరీ అమోంకర్.

-హెచ్.రమేష్‌బాబు




## నువ్వు లేక నేను లేను



క్రేజీ మ్యూజిక్ డైరెక్టర్ దేవీశ్రీ ప్రసాద్‌ని ఈ మధ్యకాలంలో తన మనసు దోచుకున్న పాట గురించి అడిగితే।

"నువ్వు లేక నేను లేను' సినిమాలో 'నిండు గోదారి కదా ఈ ప్రేమ' పాట చాలా బాగుంది. పల్లవి బాగా నచ్చేసింది. పాటలో మంచి ఒంపూ., సొంపూ వున్నాయి. పాటలో వున్న రిథమ్‌కి మన మనసు కూడా ఉర్రూతలూగడం ఖాయం. కులశేఖర్ సాహిత్యం కూడా అద్భుతంగా వుంది" అని తన అభిప్రాయం వెలిబుచ్చారు.

## నీ ప్రేమకై



ఘరానా అల్లుడు'తో దర్శకుడై 'తాజ్‌మహల్', 'రాజా' మొదలైన సక్సెస్‌ఫుల్ చిత్రాలు రూపొందించిన యువ దర్శకుడు ముప్పలనేని శివకి మంచి మ్యూజిక్ టేస్ట్ వుంది. ఆయన సినిమాల్లో అధిక శాతం మ్యూజికల్ హిట్సే. సురేష్ ప్రొడక్షన్స్ బేనర్‌లో అబ్బాస్, వినీత్‌లతో రూపొందిస్తున్న 'నీ ప్రేమకై' ఆడియో మంచి గుర్తింపును సంపాదించు కుంది.

ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి ఆయన ఇలా వివరిస్తున్నారు. టైటిల్ సాంగ్ "వెండి మబ్బుల పల్లకి" నాకు ఇష్టమైన పాట. లవ్లీనెస్ వుంది, మెలోడి వుంది, ఆడియన్స్‌ని చాలాకాలం పాటు మూడ్‌లో వుంచే గమ్మత్తు వుంది. 'రాజా' సినిమాలో "ఏదో ఒక రాగం" పాటలాగా, 'పెళ్ళి' సినిమాలో 'జాబిలమ్మ నీకు అంత కోపమా' పాటలాగా ఈ పాట కూడా నిలిచిపోతుంది. ఇద్దరి హీరోల మనసులకి ఆ అమ్మాయి నచ్చుతుంది. ఈ వెన్నెల పాటలో ఆ మనసు తెలుస్తుంది."

## మనసంతా నువ్వే



సంగీత దర్శకుడు ఆర్పి పట్నాయక్, గేయరచయిత కులశేఖర్‌లు మంచి స్నేహితులు. వీరిద్దరి కెరీర్ 'చిత్రం' సినిమాతో ఊపందుకుంది. తన స్నేహితుని సంగీతం గురించి, తన గురువు సీతారామశాస్త్రి గారి సాహిత్యం గురించి కులశేఖర్ మదిలో అందమైన భావాలు నిండి వున్నాయి. "మనసంతా నువ్వే"లో సంగీతం, సాహిత్యం అద్భుతం. ప్రతి పాటా ఓ రసగుళిక. ముఖ్యంగా 'ఎవ్వరినెప్పుడు తన వలలో బంధిస్తుందో ఈ ప్రేమ' పాట అయితే ఎక్సలెంట్. అలాగే 'తూనీగా' పాట కూడా. ఈ పాటలోని సింప్లిసిటీ నన్ను బాగా అకట్టుకుంది. పొయిటిక్ టచ్ వుంటూనే అందరూ పాడుకునే విధంగా వుందీ పాట" అని చెప్పారు కులశేఖర్.

## అమృత



మణిరత్నం దర్శకత్వంలో రెహమాన్ స్వరాలకు వేటూరి అందించిన 'అమృత' సాహిత్యం అమృతంలా వుందని అందరూ చెబుతున్నారు. చంద్రబోస్ కూడా అలాగే స్పందిస్తున్నారు. "రామోజీ ఫిలిం సిటీకి వెళ్తూ 'అమృత' పాటలు విన్నాను. ఆ పాటల్లోని స్వచ్ఛతకి, ఆర్ద్రతకి నా కళ్ళ వెంబడి నీళ్ళొచ్చాయి. వేటూరి గారి ఎక్స్‌ప్రెషన్స్ ఎంత అద్భుతంగా వున్నాయని, 'ఏ దేవి వరము నీవో చిరునీడ లేల కనుల' పాట అయితే మరీమరీ బాగుంది. ఆ పాటలో, 'నేనెత్తి పెంచిన శోకంలా' అన్న వాక్యమైతే నన్ను కదలించేసింది. వేటూరి గారు రైటర్స్‌కి రైటర్స్. మాలాంటి యువ రచయితలకి ఆయన పాటలు ఒక సిలబస్" అంటూ ఉద్వేగంగా చెప్పారు చంద్రబోస్. 'అమృత' పాటలు చంద్రబోస్‌ని అంతగా ఆకట్టుకున్నాయనడానికి మరో తార్కాణం. ఈ పాటలు గురించి ప్రస్తావించగానే కంఠతా పట్టినట్టుగా సాహిత్యమంతా వల్లె వేయటమే.

## నీతో చెప్పాలని



'ఆనందం' సినిమాతో కుర్రకారుకి ఆనందం కలిగించిన యువ కథా నాయకుడు ఆకాష్ నటించిన మరో ప్రేమకథా చిత్రం 'నీతో చెప్పాలని' సత్యానాయుడు దర్శకత్వంలో రూపొందిన ఈ చిత్రం అతి త్వరలో విడుదల కానుంది. కోటి ఆధ్వర్యంలో రూపొందిన ఈ చిత్రం ఆడియోకి శ్రోతల్లో మంచి ఆదరణ లభిస్తోంది. ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి ఆకాష్ ఇలా

## కలుసుకోవాలని



రామ్‌గోపాల్‌వర్మ, తేజ దగ్గర ప్రొడక్షన్ మేనేజర్‌గా పని చేసిన రాజు తన స్నేహితులు ప్రవీణ్, గిరిలతో కలిసి ఆర్‌పిజి ప్రొడక్షన్స్ బేనర్‌పై ఉదయకిరణ్, గజాలా కాంబినేషన్‌లో రఘురాజ్ దర్శకత్వంలో 'కలుసుకోవాలని' చిత్రం నిర్మించారు. ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట ఏదని రాజుని అడిగితే, 'నిర్మాతను కాబట్టి నాకు అన్నీ నచ్చుతాయి' అన్నారు. పర్టిక్యులర్‌గా ఒక సాంగ్ గురించి చెప్పమంటే ఆయన ఇలా చెప్పుకొచ్చారు. "ఉదయించిన సూర్యుడినడుగు... పాట బాగా ఎక్సైటింగ్‌గా వుంది. మంచి ట్యూన్ చక్కటి లిరిక్, అందమైన స్టెప్స్ కలగలసిన పాట అది. పాటలో మంచి మూడ్ వుంది. చూసేవాళ్ళకి, విన్నవాళ్ళకి కూడా మంచి మూడ్‌ని క్రియేట్ చేస్తుంది."

## నువ్వు నాకు నచ్చావ్



తెలుగు సినిమాకి సునీల్ ఇప్పుడు క్రేజీ ప్రొడక్ట్. సునీల్ వుంటే తమ సినిమాకి ఎస్సెట్ అని దర్శక నిర్మాతలు భావిస్తున్నారంటే అతనికున్న పాపులారిటీని అర్థం చేసుకోవచ్చు. 'నువ్వు నాకు నచ్చావ్' సినిమాలో సునీల్ కామెడీ బాగా ఆకట్టుకుందని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఈ చిత్రంలో సునీల్‌కి నచ్చిన పాట ఏమిటో తెలుసుకుందాం.

"ఉన్నమాట చెప్పనీవు ఊరుకుంటే ఒప్పుకోవు ఇంకెలాగ సత్యభామ' పాట నాకు చాలా చాలా నచ్చింది. ఈ పాట వినగానే నాకు నచ్చేసింది. ట్యూన్ అంత బాగుంది. కొన్ని కొన్ని అంతే. ఎందుకు నచ్చాయంటే కారణాలు కనుక్కో వడం కష్టం. 'నేను మీకు నచ్చుతున్నానంటే కారణం ఏమిటంటారు? పాటలు కూడా అంతే" అంటూ కొంచెం ఫిలసాఫికల్‌గా మాట్లాడాడు సునీల్.

## ఓ చినదాన



ట్రెండ్‌కి తగ్గట్టుగా ఎవరిక్కావల్సిన రీతిలో ప్రేక్షకుల మనసుల్ని హత్తుకునే విధంగా సంభాషణలు రాయగల సమర్థుడు మరుధూరి రాజా. తాజాగా ఆయన సంభాషణలు సమకూర్చిన ఈ చిత్రం ప్రేక్షకుల్ని గిలిగింతలు పెడుతోంది. 'ఓ చినదాన'లో మీకు నచ్చిన పాట ఏదని అడిగితే ఆయన ఇలా చెప్పుకొచ్చారు.

"చేయివేసి చేసుకున్న చిననాటి బాసలు మరిచిపోతనా మరిచిపోతానా" పాట ఎప్పటికీ మనల్ని మరిచిపోనివ్వదు. ఆ పాటలో వున్న అందమైన బాల్యానుభూతులు మనకి కూడా తియ్యగా అనిపిస్తాయి. పాటలో మంచి రిథమ్ వుంది. సాహిత్యం కూడా బాగుంది. 'ముఖ్యంగా ఈ పాటకి శ్రీకాంత్, శృతిరాజ్‌లు వేసిన స్టెప్స్ నన్ను ఆకట్టుకున్నాయి".

వివరిస్తున్నారు.

"ప్రేమంటే అమ్మాయి లుక్స్ కాదు, అమ్మాయి లిప్స్ కాదు, చీక్స్ కాదు, షేప్స్ కాదు' పాట నాకే కాదు, అందరికీ బాగా నచ్చుతుంది. క్యాచీ ట్యూన్‌కి తగ్గట్టుగా ఈజీ వర్డ్స్‌తో పాట సాగుతుంది. ఈ పాటలో మరో విశేషమేమిటంటే దర్శకులు సత్యానాయుడుగారే ఈ పాట రాసారు" అని తెలిపారు ఆకాష్.

## నీలాంబరి



బెంగుళూరులో వుంటూ పదేళ్ళ కాలంలో వెయ్యి చిత్రాలకు పైగా సౌండ్ ఎఫెక్ట్స్ సమకూర్చిన డి.ఎస్.ప్రకాశరావు హైదరాబాద్‌లో ప్రస్తుతం ప్రకాష్ డిజిటల్ సౌండ్ రికార్డింగ్ థియేటర్‌ను నిర్వహిస్తున్నారు. తన మిత్రులతో కలిసి కన్నడంలో ఘన విజయం సాధించిన 'నీలాంబరి' చిత్రాన్ని తెలుగులోకి అనువదిస్తున్నారు. ఈ చిత్రం ఆడియో ఇటీవలే 'టిప్స్' ద్వారా విడుదలైంది. ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి ఆయన ఏమన్నారంటే -

"ఈ జగమే ఒకటి' పాట మంచి మెలోడితో వుండడంతో నాకు బాగా నచ్చింది. సాహిత్యం కూడా బాగుంది. పంచభూతాల గురించి వర్ణన, సౌందర్యారాధన చాలా ఆకర్షణీయంగా పాటలో ఒదిగాయి. ఈ పాటని ఒక్కసారి వింటే చాలు మళ్ళీమళ్ళీ వినాలనిపిస్తుంది" అని తెలిపారు.

## రమణ



'మనీ' చిత్రంతో దర్శకుడైన ఎస్.శివనాగేశ్వరరావు తనకంటూ ఓ ప్రత్యేకమైన శైలిని సంపాదించుకున్నారు. మంచి హాస్యప్రియుడైన శివనాగేశ్వరరావు తాజాగా రూపొందించిన చిత్రం 'రమణ' విడుదలైంది. ఈ చిత్రం ద్వారా నూతన సంగీత దర్శకుడు మహర్షిని పరిచయం చేసారు. 'రమణ'లో మీకు నచ్చిన పాట ఏదని అడిగితే - "పున్నమి వెన్నెల కిన్నెరసాని' పాట నాకు బాగా నచ్చింది. మంచి రిథమ్ వుంది. స్వీట్ ఫాస్ట్ బీట్ ఇది. విన్న ప్రతి ఒక్కరిలోనూ మూమెంట్ వస్తుంది. ఆర్కెస్ట్రయిజేషన్ చాలా అద్భుతంగా వుంది ఈ పాటలో'' అని తెలిపారు శివనాగేశ్వరరావు.

## డబుల్‌రోల్



(1) ఆ 'షోకు'లన్నీ సినిమా ఫస్ట్ డే
ఫస్ట్ 'షోకు' వెళ్ళడానికే!?

**-అమృత అండ్ అనూష, విశాఖపట్నం.**

(2) పట్టుమని ఓ 'ఆరంకెలు'
వెయ్యమంటే వెయ్యలేవు గానీ
మరి ఎందుకో 'ఆ రంకెలు'!?

**-బి.కాశ్యలి, విశాఖ.**

(3) రంగా... రోజురోజుకి నువ్వునాకు
భా'రంగా' తయారవుతున్నావ్‌రా!?

**-కోట చందన, మచిలీపట్నం.**

## పేరు-రిపేరు




(1) మా ఆయన సుందరయ్య
- ఎదురులేని మనిషి

**-బి.శ్రీసత్య హైదరాబాద్**

(2) అందాల ఓ చిలకా -
నిన్ను నేను ప్రేమిస్తున్నాను -
నీతోనే నేను

**- పి.ప్రియాంక, చోడవరం.**

(3) రమణ - బుద్ధిమంతుడు
- మంచి మనిషి

**-సాయిదినేష్, కర్నూలు.**



## చిలిపిలిపి




సన్మానం - కుమారుని శీలము

**-బి.లక్ష్మీనారాయణ, వనస్థలిపురం**

కాన్పూరు - పురుళ్ళు పోసే ఊరు

**- జెడి దయానంద్, వరంగల్**

వారఫలాలు - వారానికి సరిపడేలా
ఫ్రిజ్ లో పెట్టుకోడానికి కొనుక్కునే పళ్ళు.

**- బి.వి.రావు, రుద్రవరం.**

# కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు



ప్ర : నాటికాలేజీ కుర్రాళ్ళకి
నేటి కాలేజీ కుర్రాళ్ళకి తేడా...?

జ : అప్పటి కుర్రాళ్ళు రోడ్డుమీద కెళ్ళి సైట్‌కొట్టేవాళ్ళు. ఇప్పటికుర్రాళ్ళు ఇంటర్నెట్‌లో వెబ్‌సైట్ కొడుతున్నారు.

ప్ర : అత్యంత భార్యా విధేయుడు...

జ : నిద్రలో గురకపెట్టడానికూడా భయపడేవాడు.

ప్ర : భవిష్యత్‌లో అక్షరాభాస్యం ఎలా చేస్తారు?

జ : మౌస్ చేత్తో పట్టించి కంప్యూటర్ స్ర్కీన్ మీద అక్షరాలు రాయిస్తారు.

-భమిడిపాటి వెంకటేశ్వరరావు, (చందానగర్)

# పేరడీ పేరడ్



తండ్రి : చదువులేదు సంధ్య లేదు జ్ఞానమే లేదు
పొట్టకోస్తే ముక్కరాదు ఉందీ షోకేలే
మిగిలిందీ షోకేలే

తల్లి : డబ్బూపోయే డాబూ పోయే ఫలితం లేదాయే
బుక్కుతీసి చదవగలిగే శక్తీ కరువాయే
ఆ తెలివే లేదాయే

తండ్రి : చదువురాని చవటకన్నా గాడిదే మేలు
ఫీజుకట్టి చచ్చేకన్నా నరకమే మేలు
వీణ్ణిగూర్చి తలచే కన్నా తర్పణం మేలు
నా తద్దినం మేలు ॥చదువు॥

తల్లి : సబ్బు వేస్తే గుడ్డలైనా గబ్బు విడిచేనే
ముక్కవేస్తే కుక్కలైనా ఇల్లుకాచేనే
వాటికన్నా హీనమై వీడారి పోయేనా
మమ్మార్చి వేసేనా ॥డబ్బు పోయే॥

మూలం: చెలియలేదు చెలిమిలేదు
చిత్రం: వినోదావారి 'దేవదాసు'

-శ్రేష్ఠ, హైదరాబాద్

# చిలిపికవిత



"హలో మిస్ మేరీ
చేస్తున్నావు నా మనసుపై స్వారీ
నీవే నా బుల్ బుల్ ప్యారీ
నువ్ కాదంటే నాదారి గోదారి
ఔనంటే సరైన స్థలం ఊరవతల క్వారీ
తీసుకురానా మనకోసం ఓ లారీ!?"
"అలాగే మిస్టర్ హరి
ఇవాళ నీ పని సరి
ఎందుకంటే
మా నాన్న ప్రాణాలు తీసే తలారి"

-పి.యస్.రాజు, రావికంపాడు

# ఈ రూటే వేరు



రాముడు = వచ్చి ముడువుము
LOVE = 'L'oss 'o'f 'V'aluable
'E'nergy

-వాణి, కాచిగూడ

పూర్వీకులు - దరిద్రంతో బలహీనంగా ఉండే వారు (పూర్ అండ్ వీక్)

- సీతామాలక్ష్మి, సంతోష్‌నగర్

సీరియల్ 3

# సిద్ధాంతి ఇంటి కథ



- మల్లాది వెంకట కృష్ణమూర్తి



"జాంబవతి అనే పేరు ఛార్మింగ్‌గా లేదా?" అని అడిగింది అనన్యని ఆమె బామ్మ.

"లేదు. జాంబవతి అంటే పురాణాల్లో పేరు కదా బామ్మా?"

"అవును"

"కోతా?"

"కాదు. ఎలుగుబంటి".

"మరి అలాంటి పిచ్చి పేరు ఎందుకు పెట్టారు బామ్మా?" ప్రశ్నించింది అనన్య.

"మా నాన్న ఇష్టదైవం జాంబవంతుడు కాబట్టి ఆ పేరు పెట్టుకున్నారు".

"జాంబవతుడ్ని ఎవరైనా దైవంగా కొలుస్తారని ఇంతదాకా నేను వినలేదు బామ్మా" ఆశ్చర్యంగా చెప్పింది అనన్య.

"ఇప్పుడు విన్నావుగా. జాంబవంతుడేం సామాన్యుడా? సాక్షాత్తు శ్రీకృష్ణుడితో ఫైట్ చేసాడు. ఒక్కరోజు కాదు, రెండు రోజులు కాదు. జాంబవంతుడ్ని ఓడించడానికి శ్రీకృష్ణుడికే ఇరవై నాలుగు రోజులు పట్టిందంటే అతనెంత బలవంతుడో వూహించుకో. ఆ పాయింట్ మా నాన్నగారికి బాగా పట్టింది. దాంతో శ్రీకృష్ణుడితో సమానమైన జాంబవంతుడు ఇష్టదైవం అయిపోయాడు. ఏటా జాంబవంతుడి గుడికి మమ్మల్నంతా తీసుకుని వెళ్ళేవారు"

"జాంబవంతుడికి గుడి కూడా వుందా బామ్మా?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది అనన్య.

## జరిగిన కథ

అనగనగ ఓ బామ్మ. వయసుతో సంబంధంలేని కుర్ర మనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీతారల పౌరాణిక గెటప్పులలోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పనిచేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజు కట్ చేసిన ఫోటో భాగాలు వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి. నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని, అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. 'నీకు అక్క చెల్లెళ్ళు ఉన్నారా' అన్న అనన్య ప్రశ్నకు జవాబుగా జాంబవతి గురించి బామ్మ చెప్పడం మొదలు పెడుతుంది.

"ఎందుకు లేదు? కేరళలో 'తల్లావిక్కే' అనే చిన్న వూళ్ళో వుందా గుడి . మా నాన్న చాలా రీసర్చ్ చేసి కనుక్కున్నాడా సంగతి. ఆ వూరికి బోటులోకి వెళ్ళాలి"

"అక్కడ ఎలుగుబంట్లు తిరుగుతుంటాయా బామ్మా?"

"లేదు కాని పూజారి మాత్రం చూడ్డానికచ్చం అలాగే వుంటాడు".

"పాపం పూజారి భార్య!?" అంది అనన్య సానుభూతిగా.

"పూజారి భార్య కూడా అలాగే వుంటుంది"

"పాపం పూజారి పిల్లలు...." అంది అనన్య మళ్ళీ.

"వాళ్ళ పిల్లలు ముగ్గురు కూడా".

"పాపం పూజారి అల్లుళ్ళు, కోడళ్ళు...! అది సరే కాని బామ్మా. మీ అక్క జాంబవతి కూడా చూడ్డానికి అలాగే వుంటుందా?"

"ఛ. పసిమిరంగు. గుండ్రటి మొహం. ఆ రోజుల్లో ఆడవాళ్ళు సినిమాల్లో వేషం వేయడానికి జంకేవాళ్ళు కాని ఈ రోజుల్లాంటివైతే మీనా, సౌందర్య స్థాయిలో వుండేది తెలుసా?"

"అంతటి అందగత్తెకి భగవంతుడు ఏం లోపం పెట్టాడు బామ్మా?"

"ఏం లోపం పెట్టలేదు. అసలు నీకా అనుమానం ఎందుకొచ్చింది?"

"మరి అంతటి బ్యూటీకి పెళ్ళికాలేదన్నావే బామ్మా".

"అదా? దానికి ఆ రోజుల్లోనే కవర్లలో ప్రేమ లేఖలు వచ్చేవి తెలుసా?"

"ప్రేమలేఖలు కవర్లలో కాక కార్డుల మీద వస్తాయా ఎక్కడైనా?"

"నువ్వు చెప్పేది ఈ రోజుల సంగతి. ఆ రోజుల్లో ఆఫీసులు తప్ప మామూలు జనానీకం అంతా కార్డు ముక్కలే రాసుకునే వారు".

"ఈ రోజుల్లో కూడా కార్డ్ ముక్కల్లోనే రాస్తుంటారు. కాని, ఆ కార్డులని వేలెంటైన్స్ డే కార్డులంటూంటారు. మరి అన్ని ప్రేమలేఖలొస్తే ఒక్కడూ నచ్చలేదా జాంబవతి బామ్మకి?"

"చాలామందిని వాళ్ళు రమ్మని చెప్పిన టైంకి వీరాంజనేయుడి గుడికెళ్ళి కలుసుకునేది. ఆల్‌మోస్ట్ అందర్నీ ఇష్టపడింది. కాని ఎవరి ప్రేమ పెళ్ళి పూర్తయ్యే దాకా రాలేదు".

"ఆ రోజుల్లో కూడా కట్నం ప్రాబ్లం వుండేదా బామ్మా?"

"కట్నం ఇవ్వలేకపోడానికి మా నాన్నగారేమన్నా బికారా? ఇంగ్లీష్ వాడి దగ్గర సబ్ కలెక్టర్ ఉద్యోగంలో వుండే వారు. కట్నం సమస్య కాదు".

"మరింకేం సమస్య?" ప్రశ్నించింది అనన్య.

****

తన తమ్ముడితో గుళ్ళోకి వచ్చిన జాంబవతిని చూసాడు వెంకన్నబాబు. తన కవర్ అంది, తన మీద ప్రేమ వుంటేనే వచ్చిందా? తనమీద ప్రేమ వుంటే, గులాబి పువ్వు తల్లో పెట్టుకుని రమ్మని అందులో రాసాడు. ఆతృతగా చూసాడు. మొహం తప్ప వెనక భాగం కనబడక పోవడంతో వెంకన్న బాబు ఆమె వెనక్కి వెళ్ళి చూసాడు.

తల్లో నల్లటి కురుల మధ్య ఎర్రటి మందార పువ్వు కనిపించింది. వెంటనే అతని మొహం వాడిపోయింది. జాంబవతికి తన మీద ప్రేమ లేదా? ఉత్తరంలో రాసినట్లుగా ఇప్పుడు తను మరణించి తీరాలి. ఆమెకి తన మీద ప్రేమ లేకపోతే ఇక బ్రతకలేనని రాసాడు. కాస్త తొందర పడ్డాడా?

ఆ రోజుల్లో ఆడ, మగ ఒకరితో ఒకరు మాట్లాడుకునే వారు కాదు. మాట్లాడుకున్నారంటే, వాళ్ళ మధ్య ఏదో వుందని లోకులు అనుకునే కాలం అది. అందుకని జాంబవతితో వెంకన్న ఏం మాట్లాడలేకపోయాడు.

దుఃఖ పూరితమైన అతని వదనాన్ని చూసింది జాంబవతి. పూజారికి తనతో తెచ్చిన ఇత్తడి బుట్టలోని మందారపూలని ఇస్తూ చెప్పింది. "స్వామీ, మా ఇంట్లో గులాబి చెట్టు లేదు. అందుకని మందారాలు తెచ్చాను. తల్లో కూడా ఒకటి పెట్టుకున్నాను. ఈ మందారాలనే గులాబీలుగా భావించి స్వీకరించి నన్ను అనుగ్రహించండి స్వామీ".

వెంకన్నబాబు మొహం ఆ మాటలకి వికసించింది. ఛ! తను ఎంత మూర్ఖుడు. వాళ్ళింట్లో ఏ పూల చెట్లున్నాయో, ఏవీ లేవో తెలుసుకోకుండా అలా రాయడం తన తప్పే.

ఈ సారి రాసిన లెటర్‌లో తనని పెళ్ళి చేసుకోడానికి అంగీకారం తెలపడానికి మంగళ వారం వీరాంజనేయస్వామి గుడికి వచ్చేప్పుడు జడలో మందార పువ్వుతో రమ్మని కోరాడు.

మంగళవారం సాయంత్రం జాంబవతి అసలు గుడికే రాలేదు. పైగా జాంబవతి తల్లి స్వామికి వడమాల వేయించింది. యావత్ కుటుంబ సభ్యులతో ఆవిడ వచ్చింది కాని ఒక్క జాంబవతి మాత్రం రాలేదు.

ఆ ఏరియాలో ఎవరికి అనారోగ్యం చేసినా మందు కోసం వెళ్ళే ఆయుర్వేద వైద్యుడి దగ్గరకి వెళ్ళి వెంకన్నబాబు ఎంక్వయిరీ చేస్తే జాంబవతికి ఎలాంటి సుస్తీ లేదని కూడా తేలడంతో వెంకన్నబాబుకి మళ్ళీ దిగులు పట్టుకుంది.

ఇంకో కవర్లో ఆమె తనని పెళ్ళి చేసుకోడానికి అంగీకరించలేదని తెలియజేయడానికి గుడికి రానందుకు, అందులో వడమాల వేసినందుకు తప్పనిసరిగా రావాల్సి వున్నా రానందుకు, తన బాధనంతా ఆ వుత్తరంలో నింపాడు. తనని ఆమె వివాహం చేసుకోడానికి తనలో అభ్యంతర కరమైంది ఏదీ కనబడలేదని, అయితే తన ఊహకి ఒక్క కారణం తడుతోందని, తను మందార పువ్వు పెట్టుకుని రమ్మని రాయడంతో, ఆ రోజు మందార పువ్వు పూయక, ఆ పువ్వు తల్లో లేకుండా రావడానికి ఇష్టం లేక వచ్చి వుండదని, కాబట్టి మళ్ళీ మంగళవారం (వడమాల వేయించక పోయినా) ఈ కింది పూలలో ఏదో ఓ పూవు పెట్టుకుని వస్తే, తనతో వివాహం ఆమెకి ఇష్టమేనని భావిస్తానని చెప్పి, మందార, మల్లెమాల, మొగలిపువ్వు, సన్నజాజి చెండు, చామంతి, కనకాంబరం, కదంబం .... ఇలా ఆ వూళ్ళో, దొరికే పూల పేర్లతో



ఉత్తరం నింపి పోస్ట్ చేసాడు.

ఎప్పటిలాగే పోస్ట్‌మన్‌కి కాపేసి ఆ ఉత్తరం ఇంట్లో ఎవరికీ తెలీకుండా అందుకుంది జాంబవతి.

మంగళవారం ఎంతో టెన్షన్‌గా వెంకన్నబాబు జాంబవతి కోసం వీరాంజనేయస్వామి గుళ్ళో ఎదురు చూసాడు. ఆమె వచ్చింది. ఆమె వెనక్కి వెళ్ళి చూసాడు.

తల్లో మందారం, మల్లెమాల, మొగలి పువ్వు, సన్నజాజి చెండు, చామంతి, కనకాంబరం పూలు, కదంబం.... అన్నీ వున్నాయి.

****

"ఇంట్రెస్టింగ్?" అడిగింది బామ్మ అనన్యని.

"వెరీమచ్"

"నువ్వు నేను, నువ్వు నాకు నచ్చావ్ లోలా వుండవా రోజుల్లో ప్రేమలు. ఇలా రహస్యంగా బాటసారి సినిమాలోలా వుండేవి".

"బాటసారా?"

"ఓ! నువ్వు బ్లాక్ అండ్ వైట్ సినిమాలు చూడవు కాబట్టి నీకు బాటసారి గురించి తెలీదులే. ఆ సినిమాలోని విశేషం హీరో హీరోయిన్లు ఒకరి నొకరు చివరిదాకా చూసుకోరు".

"అంటే, మొదట్నించీ విరహమన్న మాట. జాంబవతి, మన వెంకన్నబాబుల ప్రేమ అలా మ్యూట్‌గానే సాగిందా లేక సౌండ్ బటన్ ఆన్ అయిందా?" ప్రశ్నించింది అనన్య.

"సౌండ్ బటన్ ఆన్ అయింది".

"ఈ పూలు, పళ్ళు, గుళ్ళు కాదు కాని అక్కడ్నించి చెప్పు బామ్మా'

"మధ్యలోది వదిలేద్దామంటావా? సరే. అయితే విను" మళ్ళీ బామ్మ చెప్పసాగింది.

****

"ఏదైనా మాట్లాడవా? మొహమాటం దేనికి?"

"ఏదైనా అడుగు బాబూ"

"ఫర్వాలేదు. అడుగు బాబూ"

"మాట్లాడించవయ్యా మగడా! మూగో, కాదో తెలుస్తుంది కదా"

పదిమంది పెద్దలు ధైర్యం చెప్పాక పెళ్ళి చూపుల్లో వెంకన్న బాబు జాంబవతిని ప్రశ్నిం చాడు.

"మీ ఇంట్లో ఏ పూలు ఎక్కువ కాస్తాయ్?"

"గోగుపూలు" సిగ్గుపడుతూ చెప్పింది జాంబవతి.

"అదేం ప్రశ్నరా?"

"ఇంకోటడుగు నాయనా? భారత భాగవతాల్లో ఏం అడిగినా ఠక్కున చెప్పేస్తుంది. అయిదో క్లాస్ దాకా చదువుకుంది. హైస్కూల్ చదువు వద్దని ఆ తర్వాత మాన్పించేసాం"

"తొమ్మిది తొమ్ముదులెంత?" ప్రశ్నించాడు వెంకన్నబాబు.

"ఎంతో వుండాలి. మర్చిపోయాను" చెప్పింది జాంబవతి కాసేపాలోచించి.

"పోనీ నీకు వచ్చిన ఎక్కం అప్పచెప్పమ్మా" వెంకన్నబాబు తల్లికోరింది.

"పదమూడో ఎక్కం తప్ప" జాంబవతికి సపోర్టిచ్చాడు వెంకన్నబాబు.

పదో ఎక్కం అప్పజెప్పింది. అది తేలిక. ఇంకోటేదైనా చెప్పమంటే, ఒకటో ఎక్కం చెప్పింది. పెళ్ళి చూపుల్లో ఉభయులకీ పిల్ల, పిల్లవాడు నచ్చారు. కట్నకానుకలు నచ్చాయి. ఇక పెళ్ళికి నిశ్చితార్థం చేసుకుని ముహూర్తాలు పెట్టించు కోవడమే తరువాయి.

నిశ్చితార్థానికి డేట్ గురించి పంచాంగం చూస్తుండగా, జాంబవతి దగ్గరికి ఎవరో వచ్చి చెవిలో ఏదో గుసగుసలాడితే ఠక్కున లేచి వెళ్ళింది.

"దేనికి వెళ్ళింది?" అడిగాడు వెంకన్నబాబు తండ్రి.

"పాపాయికి పాలు పట్టడానికి"

"ఏమిటి? పాపాయి పాలు...?" అదిరిపడింది వెంకన్నబాబు తల్లి.

"అబ్బెబ్బే! పాపాయంటే నిజం పాపాయి కాదు. అది దాని పెంపుడు జీవికి పెట్టుకున్న పేరులెండి".

"అలాగా!"

"ఓసారి దాన్ని తీసుకురమ్మని చెప్తారా? నేనూ చూస్తాను" అడిగాడు వెంకన్నబాబు జాంబవతి విరహాన్ని భరించలేక. లోపలికి కబురెళ్ళిన కొద్ది క్షణాల్లో జాంబవతి సిగ్గుపడుతూ బయటికి వచ్చింది ఆ జీవితో. తన చేతిలోని తాచుపాముని వెంకన్న ముందుంచింది.

"త త్త... త్త.... తాత్త... తాచుపాము" పడగ విప్పి తనవంకే చూస్తున్న దాన్ని చూసి నత్తితో వెంటనే కెవ్వున అరవలేక నసిగాడు వెంకన్నబాబు.

"దీని పేరు పాపాయి" చెప్పింది జాంబవతి ఉత్సాహంగా.

"ఏమిటి? నువ్వు పెంచేది పామునా?"

అప్పటికే పెళ్ళికొడుకుతో సహా అతని తరపువారంతా 'స్టాండప్ ఆన్ ది ఛెయిర్" పొజిషన్‌లో నిలబడ్డారు

"అవును".

అదికూడా తమషాని చూడడానికి తల అటు ఇటు అందరి వేపు తిప్ప సాగింది. మధ్యలో రెండు మూడుసార్లు కస్సు బుస్సుమంది.

'ఏయ్ పాపాయ్. ఊర్కో ఏమిటది కొత్త వాళ్ళ ముందు" అని

"అదేం చేయదులెండి" అని వాళ్ళకి ధైర్యం చెప్పసాగింది జాంబవతి.

"ముందు దీనిక్కడనించి తీసుకెళ్ళండి" గట్టిగా అరిచాడు వెంకన్నబాబు.

"ఏ పులిని చూసినట్లో భయపడతారేంటి? ఇది తాచు పామేనండి" అని జాంబవతి దాన్ని తన చేతుల్లోకి ఎత్తుకుంది. అది తన చేతిని చుట్టుకోవడంతో చెప్పింది.

"వద్దమ్మా. భయం వద్దు. అయినవాళ్ళే. అంతా మనవాళ్ళే".

"కాదు. మేం దాని వాళ్ళం కాదు. అవతలికి తీసుకుపోదాన్ని" చెప్పాడు - అంతదాకా నిష్కామ సేవ మీద లెక్చర్ దంచిన వెంకన్నబాబు బాబాయ్.

తండ్రి సైగ అర్థం చేసుకుని మురిపెంగా చెప్పింది.

"పదవే. మీ అమ్మ, నాన్న దగ్గరికి వెళదాం" లోపలికి నడిచింది.

"అదేమిటి? లోపల ఇంకా పాములు న్నాయా?" అడిగింది వెంకన్నబాబు తల్లి.

"మొత్తం అయిదు. దాని అత్తలు, బాబాయ్



లతో కలిపి"

"రేపు పాపాయి పుడితే, ఇలా పాములాగే దాన్ని మురిపెంగా పెంచుతుంది" చెప్పింది జాంబవతి తల్లి.

"నాకొద్దీ సంబంధం" కుర్చీమీద నించునే చెప్పాడు వెంకన్నబాబు లో గొంతుతో.

"అవన్నీ వాళ్ళముందే ఇక్కడే మాట్లాడు" అంత భయంలో కూడా వెంకన్నబాబు తల్లి కొడుకుని కసిరింది.

*****

పకపక నవ్వుతూ వింటున్న అనన్య చెప్పింది.

"పాపం. వెంకన్నబాబు కోసం నాగన్నలని వదిలేసిందా జాంబవతి?"

"అలా జరిగి వుంటే దానికి పెళ్ళయ్యేది. మేం చిలక్కి చెప్పినట్టు చెప్పి చూసాం. ఊహు. తనతోపాటు తన పెంపుడు పాములని కూడా ప్రేమించే వాళ్ళనే చేసుకుంటాననే శపధం చేసింది. పాము గురించి సరైన అవగాహన ఉంటే, భయపడాల్సిన పని లేదంది. మనం దాన్ని చూసి భయపడినట్లుగా అదీ మనల్ని చూసి భయపడుతుందని చెప్పింది.

"వెంకన్నబాబు పాముల్ని వదిలేయమని రిక్వెస్ట్ చేయడానికి వస్తే 'దానంతట అదిగా ఏ పాము ఎప్పుడు కాటేయదు. వేసినా ఎవరూ చచ్చిపోరు. పాము కాటు తిన్నామన్న భయంతోనే పోతారు. నా మటుకు నాకు నలభై ఏడుసార్లు పాములు కాటేసాయి. అయిదుసార్లు హాస్పటల్ పాలయ్యానే తప్ప చచ్చానా?' అన్నది. 'ఇంతకాలం పాలు పోసి పెంచుకున్నా మీరు చెప్పినట్లు వాటిని జూకి తరలిస్తే, అవి బ్రతికేదే పన్నెండు లేదా పదిహేను ఏళ్ళు. జూలో అయితే ఇంకో మూడేళ్ళు ముందే మరణిస్తాయి' అన్నది. జైలులాంటి జూలో తన పాపాయిల్ని పెట్టనంది.

ముందు వెంకన్నబాబు ధైర్యం చేసి జాంబవతిని పాముల్ని లెక్కచేయక పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. కాని అతని తల్లితండ్రులు కాని, స్నేహితులు కాని, బంధువులు కాని ఛస్తే అతని ఇంటికి ఆ తర్వాత రామని తెగేసి చెప్పడంతో ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. అదీగాక అతని మిత్రులు 'ఎక్కడనించి పాము వస్తుందో అన్న భయంతో అసలు కాపురం ఎలా చేస్తావు? పిల్లలెలా పుడతారు?! అని తెగభయ పెట్టడంతో తన ప్రేమని చంపుకున్నాడు.

జాంబవతి పాముల్ని పెంచడం మానేస్తే, పెళ్ళయి వుండేది. కాని అది మొండి ఘటం. కాబట్టి ససేమిరా అంది. దాంతో ఈ విషయం చుట్టుపక్కలకి పాకి ఏడు జిల్లాల నించి పెళ్ళి కొడుకనేవాడు వస్తే ఒట్టు. దాంతో పెళ్ళి కాలేదు. తన జీవితాన్ని పాములకి అంకితం చేసి పాఠశాలలకి పాముల్ని తీసుకెళ్ళి వాళ్ళముందే వాటిని వదిలేసి ఎడ్యుకేట్ చేయడంతో జీవితం గడిపింది" చెప్పింది బామ్మ.

"పెంపుడు పాముల కోసం పాపం జాంబవతి బామ్మ తన వైవాహిక జీవితాన్నే పణంగా పెట్టిందన్న మాట. చివరికి పాము కరిచే పోయిందా బామ్మా?"

"లేదు. ముంగిస కరిచి"

"అదేమిటి?"

"జాంబవతి పెంపుడు పాముని ఓ ముంగిస కొరికేసింది. అది చూసి జాంబవతి కోపంతో దాన్ని కొట్టింది. అది తిరగబడి కరిచింది. ఆ కాటుకి రేబిస్ లాంటి వ్యాధి వచ్చి ముంగిసలా అరచి చచ్చిపోయింది".

"ముంగిస ఎలా అరుస్తుంది బామ్మా?"

"మిమిక్రీ చేద్దామన్నా నాకు తెలీదు. నేను వినలేదది. పోబోయే ముందు హాస్పటల్‌లో అరిచిందట."

"జాంబవతి కాక నీకు ఇంకా ఎంతమంది తోడబుట్టిన వాళ్ళు బామ్మా?" ప్రశ్నించింది అనన్య.

వెంటనే బామ్మ సమాధానం చెప్పకుండా ఏదో ఆలోచిస్తుండడంతో అడిగింది అనన్య మళ్ళీ.

"నిన్నే బామ్మా"

"గుర్తు తెచ్చుకోనీమ్మా. ఒకటా, రెండా, వాళ్ళంతా పోయి ఏభై ఏళ్ళు పైనే అయింది... ఒకటి రెండు... మూడు..... నాలుగు.... వాడితో కలిపి అయిదు. నేను కాక ఇంకా అయిదుగురున్నారమ్మా"

"అయిదుగురిలో జాంబవతి కథ చెప్పావు. మిగిలిన నలుగురు? వాళ్ళకి పెళ్ళిళ్ళు కాలేదా?" ప్రశ్నించింది అనన్య.

"ముగ్గురికి అయింది. ఇద్దరికి కాలేదు"

"పెళ్ళయిన ముగ్గురికీ పిల్లలు పుట్టనే లేదా? అసలు వాళ్ళ పేర్లేంటి బామ్మా?" ఆసక్తిగా అడిగింది అనన్య.

లేచి వెళ్ళి హాల్లో గోడకి వేలాడుతున్న ఓ పాతకాలం ఫొటోని తెచ్చింది అనన్య. అది ఏభై, అరవై ఏళ్ళక్రితం తీసిన ఫేమిలీ గ్రూప్ ఫొటో అని ఇట్టే తెలిసిపోతోంది. మెడకి జరీ అంచు కండువా చుట్టుకుని వున్నాయన బామ్మ తండ్రి వల్లభరావు. పక్కనే విశాలమైన జరీబార్డర్ కంచి పట్టు చీర కట్టుకుని వున్నావిడ ఆయన భార్య కనకం. వాళ్ళకి వెనక, అటు ఇటు నిలబడ్డ ముగ్గురు, కింద కాళ్ళ దగ్గర కూర్చున్న ముగ్గురు వాళ్ళ సంతానం.

"బామ్మా - ఇది కదా నువ్వు?" అడిగింది అనన్య కింద కూర్చున్న వాళ్ళలో బుట్ట గౌనులో వున్న ఓ పాపాయిని చూపిస్తూ.

"అవునమ్మా. నా పక్కన కూర్చుని వేరుశనగ కాయలు తింటున్నదే ఇది జాంబవతి".

"పాము లేదే?"

"ఫొటోగ్రాఫరు పాముంటే, ఫొటో తీయడానికి రానని కండిషన్ పెట్టాడు. కాబట్టి ఇదిగో ఈ చిన్నబుట్టలో వుంది దాని పాము"

"ఓ!... ఇతను మీ అన్నయ్య బామ్మా?" అడిగింది అనన్య. వెనక నిలబడ్డ ఒకతన్ని వేలితో చూపిస్తూ.

"పిచ్చిదానా. వెనక నిలబడ్డ ముగ్గురూ నాకు అన్నలేనే. కింద కూర్చున్న వాళ్ళలో ఒకడు తమ్ముడు, ఇంకొకత్తె అక్క".

"మరి బామ్మా...." అనన్య ఇంకేదో అడగబోతుంటే.....

వాళ్ళింటి డోర్ బెల్ మోగింది. బామ్మ వెళ్ళి తలుపు తీసేలోగా రేడియో నాటకంలోలా "తలుపు, తలుపు బామ్మగారున్నారా" అన్న ఓ మగ గొంతు వినిపించింది. ఆ గొంతు వినగానే కొద్దిగా తుళ్ళిపడింది బామ్మ.

**(ఇంకావుంది)**





# 1-15 ఫిబ్రవరి 2002లో శ్రీ జనార్దన మహర్షి రాసిన




# కథకు వచ్చిన స్పందన

“హాసం'లో 'మధు' మోహం అను చక్కెర వ్యాధి” కొన్ని వాస్తవిక జీవితాలకు అక్షర రూపమే. ప్రతిదానిని అనుమానపు భూతద్దంలో చూసే ార్యలకు ఈ కథ కనువిప్పు కావాలి. ర్చుకొనాల్సిన చోట అనువమానపు గతగులుతుంటే వేదనకు గురి అవుతున్న వారు చరో. దీనికి విద్యావంతులైన మహిళలే ఎక్కువగా కారణం కావటం విశేషం. నేటి అనువమానపు నమాజంలో వాస్తవాలను అక్షరీకరించిన ఈ కథ ఒకరిద్దరికైనా కనువిప్పు కలిగిస్తుందని, మరిన్ని కథలు మీ కలం (సామాజిక ఇతివృత్తంతో) నుండి ఆశిస్తూ.....

-చప్ప నాగేశ్వరరావు, పాములవలస (వి),
విజయగరం జిల్లా.

ఒకే అక్షరం మార్పుతో అర్థాలే మారిపోయే దాలున్న అద్భుతభాష ఇంగ్లీషు అని మురిసి పోతూ పొరుగింటి పుల్లకూరే రుచి అనుకుంటున్న సగటు తెలుగోడికి, అదే ఒక అక్షరం మార్పుతో 'అర్థాలే వేరులే' అనిపించే పదాలు తెలుగులోనూ మధు (మేహం బదులు మోహం) వున్నాయని తెలియజేసిన మహర్షిలా సార్థక నామధేయులని పించుకున్నారు. హాసం 1-15 ఫిబ్రవరి సంచికలోని మీ చిన్ని రచనతో.

తెలుగు మాష్టారి పరామర్శ పలుకులు సరిగా గమనించక తలూపిన పురుషోత్తం “ఓరి చచ్చినోడా.....” అన్న పెళ్ళాం తిట్ల పురాణంతో కామెడి ఆఫ్ ఎర్రర్స్ అర్థమయి టెంక్షన్ తెచ్చుకున్నాడు అని చెప్పటంలో 'హాస్య' జనార్దనం' కనబడ్తాడు. ఇక చివరగా ... హోం ఏజ్‌లో (పద ప్రయోగమే కామెడీ!) తల్లికొడుకుల సంభాషణలు నవ్విస్తాయి. “నీ బాధ చూళ్ళేక నా బాధ కక్కేశాన్రా” అన్న తల్లి కళ్ళలో నీళ్ళు చూసిన పురుషోత్తం కళ్ళలోనూ నీళ్ళు (తల్లి తరువాత మాటలకు) అంటూ చెప్పిందాంట్లో సెంటిమెంటల్ జనార్దనం' కనబడ్తాడు.

డాక్టరుగారు “మీ బాడినే ఓ షుగర్ ఫ్యాక్టరీ” అనడం, నాన్న ఇల్లిస్తాడనుకొన్నాను కాని ఫాక్టరీ అనుకోలేదు అనడం, తీపితినే అదృష్టం పెళ్ళితోనే పోయిందనడం కామెడిని విశ్వరూపం స్టైయిల్‌లో చూపిస్తాయి. షుగర్‌ను ఓ ఎయిడ్స్‌లా భావించి స్పందించిన చుట్టుప్రక్కల వాళ్ళ మాటలు ఒకింత చిరాకు కలిగించినా నవ్వించక మానవు. చాలా రోజులకు మహర్షి కలం జాడించి వ్రాసిన హాస్యరచన.

-జి. ప్రభాకర్‌రావు, హైదరాబాద్

మీరు రాసిన కథ ఆలోచన రేకెత్తించేదిగాను, పురుషోత్తం లాంటి భార్యాబాధితులకు బుద్ధి వచ్చేటట్లుగాను, పురుషోత్తం భార్య వంటి వారికి గుణపాఠం గాను ఉంది. ఇన్ని రకాలుగా మీ కథ వలన ప్రయోజనాలు చాలా ఉన్నాయి. మీరిలాగే 'హాసం'లో మీకు వీలున్నప్పుడల్లా ఓ చక్కని కథ రాసి, మమ్మల్ని ఆనందింపచేస్తారని ఆశిస్తూ....

మెట్టి మాల్యాద్రి, గుండుభాయివీధి, కావలి.

'హాసం' ఫిబ్రవరి 1-15 సంచికలోని 'మధుమోహం' అను చక్కెర వ్యాధి అనే టైటిల్ వెరైటీగా వుండే సరికి చదవాలనిపించింది. చదివించింది. హృదయ స్పందన కలిగించింది. కథలో ఎక్కడా మీరు పురుషోత్తం పెళ్ళాం పేరు చెప్పలేదు. అది లోపం కాదు. అలా చెప్పక పోవటంలో కథలు వ్రాయటంలో మీరెంత ఘటికులో చిటికలో చెప్పవచ్చు. పురుషోత్తం, భార్యపేరు ఫలానా, సుగుణ అంటే మంచి గుణము కలది. సుందరీ అంటే అందమైందని మేము అనుకోవచ్చు. కేవలం పురుషోత్తం పెళ్ళాం అనటంలో, ఆమె ఎలాంటిదో ఆలోచించిన వాళ్ళకు ఆలోచించినంతగా కనపడుతుంది. మీరు అలాగే చేసారు, అద్భుతంగా ఆమె పాత్రను మలిచారు. మరో విధంగా అనుకొంటే, ఆమెకు అస్సలు పేరు పెట్టకపోవడం వలన, ఆమె అంత పేరున్న మనిషి కాదులే, వట్టి వెర్రిబాగుల్ది అని పాఠకులే అనుకుంటారులే, అని మీరు భావించి వుంటారు.

'హాసం' హాస్య సాహిత్య ప్రియులకి,

నా కథను చదివి స్పందించినందుకు, మీ ఉత్తరాలు చదివి స్పం దించి రాస్తున్న మాటలివి. నేను 1998లో సిన్మాల్లో ఓ భాగం కావాలని మద్రాసు వెళ్ళి శ్రీ తనికెళ్ళ భరణిగారి దగ్గర అసిస్టెంట్‌గా చేరాను. అప్పటికే నేనేవో కథలు, కవితలు రాసేశాను. అంతేగాక సాహిత్యాన్ని తెగ చదివేశాన్ 'అహ'త్ముడనై చాలామంది రచయితల కంచం లాగేద్దామనే ధీమాలో ఉండేవాడ్ని. అప్పుడు నన్ను భరణిగారు అడిగారు. 'ఏం చదివావని?” అప్పటి కమర్షియల్ రచయితలందరి రచనలు చెప్పాను. నవ్వాడు. ఆ తరువాత నన్ను అందమైన 'మైదానం'లోకి శ్రీపాదని, కుటుంబరావ్‌ని, బుచ్చిబాబుని తోడిచ్చి పాతికేళ్ళ వెనక సాహిత్యానికి తీసుకెళ్ళి పదేళ్ళు ముందుకెళ్ళి ఆలోచించే మంత్రాన్ని నేర్పించారు.

ఆ తర్వాత నేను సినిమాలకు కథల్ని, మాటల్ని రాయటం ప్రారంభించాను. ఆ రాస్తున్నప్పుడు అన్ని అక్షరాలు నావి కావు. నలుగురు నాలుగు నోళ్ళు వేశారు. పేరు నాదేశారు.

... సినిమాల్లో ఎంత తృప్తి ఉన్నా కేవలం నా సొంతం కాదు. వంద ఫ్లాట్స్ ఉన్నా ప్లాట్... అదే పత్రికలకి రచన సొంతిల్లు కట్టుకుని కాంపౌండ్ వాల్ మీద గర్వంగా పేరు చెక్కుకుని మహా సంతృప్తిని పొందచ్చు. అందుకే నేను పత్రికలకి కథ రాయటంపై ఎక్కువ ఆసక్తిని చూపించే వాణ్ణి. అదీ “హాసం” రాజాగారు మరింత పెంచారు. గతంలో సాహిత్యానికి 'భారతి', 'ఆంధ్రపత్రిక'లు చేసిన సేవని “హాసం” మళ్ళీ ద్విగుణీకృతం చేస్తోంది. ఇది ఏ అట్టహాసం లేని 'రాజా' హాసం.

ఇక పోతే.... మధు'మోహం' అను చక్కెర వ్యాధి కథని నేను ఓ పెద్ద తల్లి 'తీపి' బాధని చెప్పాలని రాశాను. చిన్నప్పుడు నేను ఓ కవితను తెగ ప్రేమించాను. అది విశ్వనాథ & విశ్వనాథ వారు రాసినది. (యథాతథంగా గుర్తు లేకపోతే క్షమించండి)

“ఆమె తల్లి
వాడు కొడుకు
నాడు ఏడిపించాడు - అన్నం తిననని
నేడు ఏడిపిస్తున్నాడు - అన్నం పెట్టనని”

ఈ కవితలోని తల్లి ఏడుపుని అద్భుతంగా చెప్పారు. దాని ఇన్స్పిరేషన్‌తో నేను ఒక కవిత రాశాను.

“కడుపులో బిడ్డ తిరగబడింది.
పెద్దాపరేషన్
కోలుకోవటానికి రెండేళ్ళు పట్టింది
ఇరవై రెండేళ్ళ తర్వాత
మళ్ళీ తిరగబడ్డాడు.
ఇంకేం కోలుకొంటుంది”

(ఈ కవిత రాజాగారు 'వార్త'లో ఉన్నప్పుడు ప్రింట్ చేశారు) మళ్ళీ చాలా రోజుల తర్వాత కథగా రాయాలనిపించింది. అనాథ శరణాలయానికి నెట్టేసిన తల్లిని... కొడుకు బుద్ధితెచ్చుకొని తిరిగి తీసుకురావటానికి కొంత సెటైర్‌లో రాయడానికి ప్రయత్నించాను.

ఆ విషయాన్నే పాఠకులు తమ ఉత్తరాలలో అభికరించారు. నా కథ కంటే వారి విశ్లేషణలే చాలా రంజకంగా ఉన్నందుకు పాఠకుల్లోని రచయితలకి అభినందనలు తెలుపుతూ...

మీ
**జనార్దన మహర్షి**



### 1-15 ఫిబ్రవరి 2002లో శ్రీ జనార్దన మహర్షి రాసిన



# కథకు వచ్చిన స్పందన

కొన్ని రోగాలు ఉదరసంబంధమైనవైతే... మరికొన్ని హృదయ సంబంధమైనవి... కొన్ని ఆపరేషన్‌తో పోతే... మరికొన్ని కో - ఆపరేషన్‌తో పోతాయ్. చాలా చిన్న కథలో ... చాలా పొందిగ్గా... 'మోహం' యొక్క ఫలితాన్ని... చిత్రిక పట్టాడు... జనార్దన మహర్షి.... సూపర్‌మార్కెట్‌లో 'మీకేం కావాలి' అని సూపర్ మార్కెట్ అతను అడిగితే 'పక్కింటావిడ' అన్న పురుషోత్తం జవాబులో శృంగారాన్ని... 'మర్యాదగా చెప్పండి... పక్కింటి మధు మీద మీకు కన్ను పడింది కదూ' అన్న భార్య మాటల్తో భయాన్ని.... అసలు షుగర్ ఎలా వస్తుందన్న ప్రశ్నకు 'చెరకు రసం నుంచి' అన్న సమాధానం దగ్గర హాస్యాన్ని, 'తీపి మాటలు' వినకండి.... తీపి పదార్థాలు తినకండి, అని డాక్టరంటే... "నాకా అదృష్టం... పెళ్ళితోనే పోయింది" అన్న దగ్గర శాంతరసాన్ని... యిలా ప్రతి సందర్భంలో ... రకరక రసాల్ని నింపి కథకు నిండుతనాన్ని తెచ్చారు.

అన్నిటికన్నా... ఈ కథకే తలమానికం అన్న వాక్యాలు "ఏంటీ.... నీకు షుగర్ వచ్చిందటగా" అన్న భార్య మాటలకు..... పురుషోత్తం లాగి పెట్టి కొట్టి వచ్చింది షుగర్ కాదు... మా అమ్మ...." అని వెనక్కి తిరిగి తల్లికేసి... "రామ్మా" అన్నాడు తియ్యగా" అన్న వాక్యాలు కరుణరసపూరితాలై... మొత్తం కథకే... హుందాతనాన్ని తెచ్చి పెట్టాయ్. కామెడీకి ... క్లయిమాక్స్‌లో చిన్న ట్రాజెడీ టచ్ యివ్వటమనే... చార్లిన్ తరహా కథలెప్పుడు కలకాలం గుర్తుండి పోతాయ్.... మొగుడిలా బతకటానికి.... పనోడిలా పడుండటానికి... మధ్యనున్న స్వయంకృతాపరాధాన్ని... సెంటిమెంటుకు అన్వయించి... అల్పమైన పదాల్లో... అనల్పమైన భావాల్ని పొదిగాడు. మహర్షి - పెళ్ళాం పోరు నుండి ... తల్లి పొత్తిళ్ళలోకి వచ్చిన... పురుషోత్తములకు ఈ కథ ఓ చెర్నాకోల.... ఎందుకంటే... తల్లి స్పర్శ అన్ని రోగాలకి మృత సంజీవిని అని అమృతప్రాయమైన.... అమ్మ ఒడి గురించి చెప్పిన కథ యిది.

-ఎస్.వి.హరికుమార్, యూసుఫ్‌గూడ, హైదరాబాద్.

పురుషోత్తం మధుమతిపై మోహపడటం 'మధుమోహం' అయింది. పెళ్ళాం చెప్పే మాటలను అంతగా తీయగా, వినటం వలన, అతడికి 'మధుమోహం' రావడం సమంజసంగా వుంది, తల్లి అనుకోవటం, అతడిని ఆ విధంగా దెప్పిపొడవడం బాగానే వుంది. ఈ చిన్న కథ. మాకు రెండు అర్థాలు గల కవితా ఖండికను చదువుతున్నట్టుగా వున్నది. ప్రతిదీ సమర్థించు కొంటూ వ్రాసుకొచ్చారు. భావాలతో దూసు కొచ్చారు. కథకు యిచ్చిన చిత్రంలో మాత్రం హుందాతనం, క్లారిటీ, సముచితంగా కనిపించటం లేదు. చివరకు పిరికిగొడ్డులాంటి పురుషోత్తంను పులిబిడ్డలా చేసారు. ముగింపులో తెగింపు చూపారు. మాటల్ని మరీ కుదింపు చేసారు. "సూపర్ మార్కెట్‌లో పడ్డ వ్యక్తి సూపర్ స్పెషాలిటీ హాస్పటల్‌లో లేచాడు" అన్నారు. అందలి విషయాన్ని కావాలంటే నాలుగు పేజీల్లో చెప్పవచ్చు. ఆ వాక్యంలో ఎంతో చాకచక్యం ప్రదర్శించారు. పురుషోత్తం పెళ్ళాన్ని లాగి కొట్టి, తల్లికి స్వాగతం చెప్పటం, వచ్చింది షుగర్ కాదు మా అమ్మ' అనటం వేయాల్సిన చురకను చక్కని సందేశంలా అందజేసారు. అంతచక్కని కథను మీరు ఎలా వ్రాయగలిగారన్న ఈర్ష్య చదివిన ప్రతి ఒక్కరిలోనూ కలుగక మానదు. అలాగే మేమెందుకు వ్రాయలేక పోయామా అన్న బెంగ లేకపోలేదు.

-వెలివల సాంబశివరావు.
ఎ.టి.అగ్రహారం, గుంటూరు.


STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS OF HAASAM HAASYA SANGEETHA PATHRIKA HYDERABAD AS REQUIRED UNDER RULE 8 OF NEWSPAPERS (CENTRAL) RULES, 1956

FORM IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Hyderabad |
| 2. | Peroidicity of Publication | Fortnightly |
| 3. | Printer's Name<br>Whether citizen of India?<br>Address | K.I.Varaprasad Reddy<br>Indian<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212, Moti Nagar,<br>Hyderabad-18 |
| 4. | Publisher's Name<br>Whether Citizen of India?<br>Address | K.I.Varaprasad Reddy<br>Indian<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212,Moti Nagar,<br>Hyderabad-18. |
| 5. | Editor's Name<br>Whether Citizen of India<br>Address | Raja<br>Indian<br>32,Suneetha Apartments,<br>Amberpet,Hyderabad-13. |
| 6. | Names & Addresses of Individuals Who Own the Newspapers | Hummus Infoway Pvt. Ltd.<br>502, Sri Balaji Nilayam,<br>13-1-212,Moti Nagar,<br>Hyderabad-18. |
| 7. | Shareholders holding more than one percent of the total Captial | 1. K.I . Varaprasad Reddy<br>2. P.Subbarao |

I, K.I.Varaprasad Reddy, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: 01-03-2002.

sd /-
K.I.Varaprasad Reddy
Publisher

# భిక్షమెత్తి బతికి అక్షర భిక్ష పెట్టిన సారంగపాణి

**పదిహేడవ శతాబ్దం!**

**కార్వేటి నగర సంస్థానం....**

**సంధ్యా సమయం...**

**ప్రభువులు... శ్రీ మన్మహామండలేశ్వర కఠారి సాళ్వరాజు పెరుమాళ్ళు వారు....**

**దర్బారులో ఆశీనులై.... చప్పట్లు చరిచారు!**

**తెర తొలిగింది...**

**నాట్యం ప్రారంభమైంది....**

క్షీరసాగరమథనం.... అమృత కలశం చేతబూని మోహిని...

ఓ వైపు సురులు... మరోవైపు అసురులు....

'ఆమె' అపూర్వంగా నర్తిస్తోంది.... నవరసాల్ని కురిపించేస్తోంది!

ఎంత వొయ్యారం.... ఏమి లావణ్యం!......

నిజంగా జగన్మోహినిని తలపింప చేస్తోంది!!

హొయలుగా నడుస్తూ.... అమృతం పంచుతోంది మోహిని....

గుటకలు వేశాడు.... కఠారి సాళ్వరాజు!....

నాట్యం అయిపోయింది!....

కానీ రాజా వారి గుండెల మీద 'ఆమె' పదం నర్తిస్తోనే ఉంది!

నిద్రపట్టదు... ఆకలి పుట్టదు... సురగిట్టదు....

దుర్భరమైన విరహవేదన అనుభవిస్తున్నాడు!!!

ఆ నర్తకిని రాజు మోహించాడు!!

అంతఃపురానికి రమ్మని ఆదేశించాడు!!

రాజు తల్చుకుంటే... దెబ్బలకి కొదవా....

రాజావారు క్షణమొక యుగంగా నిరీక్షిస్తున్నారు!

గజ్జెల చప్పుడైంది!

రాజు గుండె ఆగినంత పనైంది!

మోహిని వచ్చి... రాజా వారి ఎదురుగుండా నిల్చింది!!

ఆ సొగసుని.... కళ్ళతో తాగేశాడు రాజు!!

"ఇంతటి అపూర్వ సౌందర్యవతిని ఇంతకు ముందెన్నడూ చూల్లేదు"

మందహాసం చేసింది... మోహిని....

"ఇకముందుకూడా చూళ్ళేరు ప్రభూ....." సవరం తీసేసింది. వేషం విడ్చేసింది!

ఆశ్చర్యం!!

'ఆమె'.... మోహిని కాదు!

'సారంగపాణి' ... మొగవాడు....

రాజావారు ముందు దెబ్బతిన్నారు .... తర్వాత చకితులై పోయారు....

"మీరు మొగవారా?.... శభాష్.... శభాష్.... ఇంత భ్రాంతి కలిగించిన మీరు మహానటులు..." అంటూ తన మెళ్ళోని ముత్యాలహారాన్ని బహూకరించి రాణీవార్ని పిలిపించి..

"చూశారా మహారాణీ... ఆయన మోహినిగా మారిపోయి మా మనసు దోచుకున్నారు! మా జీవితంలో ఇదొక మధురఘట్టం!!"

"నా జీవితంలో కూడా" అని మనసులో అనుకుంది మహారాణి!!

సారంగపాణి ఇద్దరికీ నమస్కరించి శలవు పుచ్చుకున్నాడు...

ఇక్కడ రాణీవారి అంతః పురంలో - ఈవిడకి నిద్రలేదు!!!

ఏమి రూపలావణ్యం

ఏమి తేజోవంతమైన కళ్ళు...

ఏమి మగటిమి!!

కలగకూడని కోర్కె కలిగింది మహారాణికి... అంతరంగిక చెలికత్తెతో కబురుపెట్టింది!!

రాజావారు మళ్ళీ పిలిపించారని తెలియగానే... అమాయకంగా అంతఃపురానికి అడుగుపెట్టాడు సారంగపాణి.

ఎదురుగా రాణి!!

కోర్కెతో కాగి పోతోంది!!

కాటుక... కామం కలిసి... కళ్ళు విచిత్రంగా మండుతున్నాయ్

కోర్కె తీర్చమని చెయ్యి పట్టుకోబోయింది రాణి!!

కాళ్ళమీద పడ్డాడు సారంగపాణి!!

"తల్లీ.... నువు రాజుగారి భార్యవు. అమ్మతో సమానం.... నీకిది తగదు...." అని బతిమాలాడు... వాపోయాడు.

ఈ లోగా రాజావారు రావడం!!!

రాణీ.... ప్లేటు ఫిరాయించడం... తనని మోహించి బలవంతం చెయ్యడానికొచ్చాడని లేని నేరం మోపటం!!

విచక్షణారహితుడైన రాజు... ముందు వెనకలు ఆలోచించకుండా

"కళాకారుడివి కాబట్టి చంపకుండా వొదిలేస్తున్నా..." అని చెప్పి.... సారంగపాణి యావదాస్తినీ.... లాక్కుని... కట్టుబట్టల్తో దేశ బహిష్కరణ విధించాడు.

కలికాలంలో కళాకారుడు

మరోసారి దరిద్రుడయ్యాడు!!

అసలు 'సారంగ' నామంలోనే ఈ దోషం ఉందేమో

ఇంచుమించు ఇదేను సారంగధరుడి కథ గూడా!.....

ఇక ఆయన సంగీత సాహిత్యాల జోలికెళ్తే......!!

సారంగపాణి పదాలు అన్న పుస్తకం 1867లో నేలటూరి సుబ్రహ్మణ్యం గారి 'విద్యావిలాస ముద్రాక్షరశాల'లో ముద్రించబడింది.

అందులోని పాటలు, పదాలూ ఎంత ప్రఖ్యాతి చెందాయంటే ఆ పాటలు ప్రవహించి.. ప్రవహించీ... ఆఖరికి బొబ్బిలిలోని సన్యాసులు... ముసలివాళ్ళు.... బిచ్చగాళ్ళు కూడా పాడుకునేవారు!

సారంగపాణి పదాలు..... భర్తృహరి సుభాషితాల్లాగా... మూడు భాగాలుగా ఉన్నాయ్. మొదటి భాగం... శృంగారం... రెండు.... సామాజిక స్పృహ.... మూడో భాగం వైరాగ్య వర్ణన.

**శృంగారం:** **కనకాంగీ... నినుజేరీ.... మఱి మఱి తమి మీఱి...**
**విరహ భారముచే తరముగాక తారీ - మరులూరీ**

**సామాజిక స్పృహ:** **వారస్త్రీలను నమ్మరాదుగా**
**యెంతదోపిన సంతుష్టి లేదుగా**
**నిన్నజారు కొప్పు బెట్టుకొని**
**మైజారు చీరకట్టుకుని...**

**వైరాగ్యం:** **కణ్ణునూనుకుని - దిరుగక మునుపే**
**కంఠధ్వని తగ్గిపోకమునుపే**
**అఱ్ఱు ముందరికి వంగకమునుపే**
**అంగము, తల, వణుకెత్తక మునుపే**
**అన్నమొక్కరు తినిపించకమునుపే**
**దొప్పలోన చైకదుగక మునుపే....**
**ధోవతి బరువై తోచక మునుపే....**
**హరినామస్మరణ చేయకుంటే**
**అవతల గతియేమీ....**

ఇలా ధూర్జటి.... కాళహస్తీశ్వర శతకం.... కంచెర్ల గోపన్న దాశరథీ శతకం గుర్తుకు వొస్తాయ్ః!

ఇలాంటి పదాలు వైరాగ్యబోధకాలై... హృదయానికి హత్తుకుంటాయ్

రాజావారి ఆగ్రహానికి గురై - ఆస్తి అంతా పోగొట్టుకున్నా

సారంగపాణి దుర్భర దారిద్ర్యం అనుభవిస్తూ.... గత్యంతరం లేక... పదాలు పాడుకుంటూ ఊంఛవృత్తి చేసుకునేవాడు!!

ఆయన భిక్షమెత్తి బతికినా... తెలుగుజాతికి అక్షర భిక్ష పెట్టి... సాహిత్యాన్ని.... సుసంపన్నం చేసిన మహానుభావుడు సారంగపాణి!!!

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

తనికెళ్ళ భరణి,
కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాదు - 500 018
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.



తనికెళ్ళ భరణి

భరణిగార్కి:

శతకోటి నమస్కారములు. పెద్దలు వ్రాసింది చదివి పక్కన పెట్టకుండా మాబోటి అల్పులకు 'హాసం' ద్వారా గొప్పగొప్ప మహనీయులను పరిచయం చేస్తున్నందుకు.....

అక్షరాలను నక్షత్రాలుగా మార్చి ఒక బ్రహ్మీ ముహూర్తాన అభిషేకించనా! మాటల పూదోటల వెంబడి పరుగెత్తి అలసిన గొంతుతో స్తుతించాలా (నా)!

పారిజాతాల్లోని పరిమళాలను తెచ్చి మీ పాదాలకు పారాణిగా పూయాలా (నా) పూర్ణచంద్రుని వెన్నెలలోని చల్లదనాన్ని అడిగి మీ కళ్ళకు హారతులద్దనా (లా)!

ఆ గోదారి నీళ్ళతో మీ కాళ్ళు కడిగి ఆ నీళ్ళు నెత్తిన జల్లుకుంటే వచ్చే జన్మకైనా మాబోంట్లకు కాస్త మీ శైలి ఒంటబట్టునా! సందేహం లేదు. బట్టును.

విశ్వపతి' శాస్త్రి కథ మీ శిల్పచాతుర్యంతో మలిచి కంటి ముందు ఆవిష్కరిస్తే, నా కళ్ళమ్మట అశ్రుధారలే!

"గొల్లపిల్లల వ్రేళ్ళ సందు మాగాయ పచ్చడి పసందు ఎటుల కనుగొంటివయ్యా, నీకెవరు చెప్పిరయ్యా" అంటూ పోతన గూర్చి పాపయ్య శాస్త్రి గారు ఆశ్చర్య పోయారు! అలాగే విశ్వపతి శాస్త్రి తపన... తపస్సు.... మీ కెలా తెలిసిందండీ!

వ్రాయక నిర్మాతల్నీ, వ్రాసి ప్రేక్షకుల్నీ ఏడిపించే ఆత్రేయగారిలా.... ఏడిపించేశారు కదండీ....

ఇంతటి చక్కటి అనుభూతి "విషాదమే" అయినా మరపురాని బాధ కన్న మధురమే లేదు. ఒక్కసారి మీ పాదాభివందనం చేసుకుని వెళ్ళగలిగితే వేడి వేడి అన్నంలో కొత్తావకాయ వేసుకుని ఒక్క పిసరు "నేచ్చుక్క" తగిలించి తిన్నంత హాయిగా ఉండదూ...! ఉంటుంది.

-టి.వి.సత్యనారాయణ (త్యాగి)
హబ్సిగూడ, సికిందరాబాద్

**ప్రసిద్ధ హాస్య రచయిత 'కాంతం కథల' మునిమాణిక్యం జయంతి (మార్చి 15) సందర్భంగా**

క్లాసిక్స్ రీటోల్డ్



# ఉపాధ్యాయ ఉవాచ

మునిమాణిక్యం నరసింహారావు

**ఉపాధ్యాయుడి జీవితం అంధకార బంధురమూ కాదు, బ్రతకలేక బడిపంతులు కావడం అనే మాట నిజమూ కాదు. అనుభవించే వాడికి ఈ జీవితం కూడా హాస్యరసం ఇస్తుంది. ఈ సంగతి చెప్పడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.**

---

మొదట నేనీ ఉపాధ్యాయ వృత్తిలోకి ప్రవేశించాలని నిర్ణయించుకున్నాక, ఎన్ని స్కూళ్ళకి ఎన్ని దరఖాస్తులు పంపానో లెఖ్ఖ లేదు.

హైస్కూలు కమిటీ అధికారి పదిసార్లు తిప్పి ఇరవైసార్లు బేరమాడి చివరికి ఏమైతేనేం నెలకి 28 రూపాయల జీతానికి పనిజేస్తానని నా మెడలు వంచి ఒప్పించాడు. తీరా ఆర్డరు ఇయ్యబోయే ముందు ఒక్క సందేహం అన్నాడు. సెలవియ్యండి అన్నాను వినయంగా.

"ఏమీ లేదండీ. మా స్కూల్లో కొంచెం అల్లరి కుర్రవాళ్ళున్నారు. చూడబోతే మీ దగ్గర నదరు తక్కువ. చెప్పగల ధైర్యం ఉందా?" అని అడిగాడు.

మల్లుపంచె, పాప్లిను చొక్కా, సిల్కు కోటు - ఇన్ని ఉన్నా ఇంకా నదరు తక్కువేమిటో నాకు అర్థం కాలేదు. ఏమైతేనేం ఆర్డరు చేతిలో పడింది.

విద్యార్థిగా బల్లపై కూర్చున్నవాడికి కుర్చీలో కూర్చునే రోజు వచ్చింది. ఉల్లాసంగా స్కూలుకి వెళ్ళొచ్చుగా?... ఉహుఁ! ఏదో చెప్పలేని భయం... కొంత క్రొత్త... కొంత బిడియం... కొంత సిగ్గూను... అతి ప్రయాస మీద మేడ మెట్లెక్కి క్లాసులోకి వెళ్ళాను - వెళ్ళాను అనడం ఒక శబ్దాలంకారం. వెళ్ళింది నేను కాదు - నా కాళ్ళు.

కుర్చీలో కూర్చునే పర్యంతము చీమ చిటుక్కుమన్నా వినిపించేటంతటి నిశ్శబ్దంగా ఉంది. కూర్చునేసరికి నాకు పరమానందం కలిగింది. బ్రిటిష్ రాజ్యాన్ని ఏలే చక్రవర్తి సింహాసనం మీద కూర్చున్నప్పుడు ఆయనకు గలిగే ఆనందం నాకు కలిగిన సంతోషం ముందు తృణ సమానము. జయసూచకంగా ఒక్క చిరునవ్వు నవ్వాను. ఉత్తర క్షణంలో పిల్లలందరు ఒక్కమారు బెంచీలమీద ఢమఢమా అని వాయించారు. ప్రళయకాల సూచనార్హమైన పిడుగువలె ఆ శబ్దము నా గుండెల్లో మారుమ్రోగింది. ఆ చిన్న చిరునవ్వు మెరుపునకు ఇన్ని ఉరుములా?

నాకేం తోచలేదు. కాళ్ళు తేలిపోవడం మొదలెట్టాయి. సాధ్యమయినంత వరకు గాంభీర్యాన్ని కళ్ళల్లో నిలువబెట్టి ఇంగ్లీషులో "నాకు చాలా విచారముగా ఉంది" అనేసరికి అందరూ ఏకగ్రీవంగా "చ్చో చ్చో చ్చో చ్చో" అని సానుభూతిని వెలిబుచ్చారు. ఇంతకంటె దీనావస్థ ఇంకేముంది?

ఏమీ తోచక ఒక విధమైన దురవస్థలో పడి నేను కొట్టుకుంటూంటే, మీసకట్టున్న కాలు పొడవు పెద్ద కుర్రాడొకడు చటుక్కున లేచాడు. లేచి నా ప్రేక్ష్యం లేకుండానే చరచరా క్లాసు వదిలి బయటికి వెళ్ళిపోయాడు. నేను అతగాడిని ఆపే స్థితిలో లేను.

**ఈ క్రింది బొమ్మలలో దాగిన సినీ ప్రముఖులను గుర్తించ లేకపోతే రివర్స్‌లో చూడండి**



బొమ్మలాట



ఏదో ఒక దౌర్జన్యం చేయకపోతే పిల్లలు హద్దుమీరి అల్లరి సాగించేలాగున్నారు. పాఠం చెప్పడం మొదలుపెడదామంటే అది ఏమో నాకు తెలియదు. అడిగితే సక్రమంగానూ వినయంగానూ చెప్పే స్థితిలో వాళ్ళులేరు. వాతావరణ స్థితి ప్రమాదకరంగా ఉంది.

ఇవన్నీ అవగాహన చేసికొని అమాంతం ఉపన్యాసం ఎత్తుకొని పెద్ద పెద్ద మాటలు నోటినిండా పలుకుతూ, తడుముకోకుండా ఒక్క దమ్మున గంటకొట్టే పర్యంతం వాళ్ళకి ఒక్క ముక్క అర్థం కాకుండా ఉపన్యాసం కురిపించాను. అంతే - వాళ్ళు చల్లబడ్డారు. ముఖాలు వికసించాయి, కొత్త మాష్టరు గట్టివాడేనని నమ్మకం ఏర్పడినట్లుంది. నాకు ఆ విధంగా ఆ రోజుకి గండం తప్పింది.

అయితే ఉపాధ్యాయుడికి గండాల గౌరిదేవిలాగ ఏ రోజున ఏ గండం వస్తుందో చెప్పలేం. కనీసం కొన్ని గండాలైనా తప్పించుకోడానికి ఈ క్రింది విషయాలని అతను తప్పకుండా తెలుసుకుని ఉండాలి.

ప్రతి సంస్థకీ, జాతికీ, బృందానికి ఎల్లాగయితే కొన్ని హక్కులుంటాయో, అల్లాగే విద్యార్థి బృందానికి కూడా కొన్ని జన్మహక్కులున్నాయి. మాష్టారు మార్కులు బాగా వెయ్యాలి, తన సొమ్మేదో పోతున్నట్లు పిసినారిగా వ్యవహరించి మొహం చూసుకోరాదు. పరీక్షపత్రాలు కూడా అలాగే కఠినంగా ఇవ్వకూడదు. పుస్తకం మొహం చూడని విద్యార్థి కూడా దర్జాగా ఆన్సర్లు రాసేటట్లు ఉండాలి ప్రశ్నపత్రం అంటే- ఇవి ముఖ్యమైనవి.

ఇవిగాక మరికొన్ని నిబంధనలున్నాయి.

1. పరీక్షలో కాపీ చేస్తూ ఉంటే ఉపాధ్యాయుడు చూసీ చూడనట్లు ఊరుకోవలె. పేపరు చదువుకుంటున్నట్లు నటించాలి. అంతేకాదు గుమ్మందగ్గర నుంచుని, హెడ్‌మాష్టారు (లేదా ప్రిన్సిపాల్) వస్తూవుంటే, ఆ సమాచారాన్ని కుర్రాళ్ళకి అందించాలి.

2. కుర్రవాడు ఆలశ్యంగా వచ్చినా, అసలు క్లాసుకు రాకపోయినా ఉపాధ్యాయుడు గమనించరాదు.

3. రోడ్డు వెంట పోతున్నప్పుడు ఏ విద్యార్థి అయినా తనకి నమస్కారం పెడతాడేమో, పెడితే తను వెంటనే స్వీకరించడానికి కొద్దిగా చెయ్యి ఎత్తవలసి ఉంటుందేమో, దాంతోపాటు సన్నగా చిరునవ్వు నవ్వవలసి ఉంటుందేమో, అని అందుకు సంసిద్ధంగా ఉండాలి. ఏమరిపాటుతో ఉండకూడదు.

4. కుర్రవాడి తాలూకు తల్లిదండ్రులెవరైనా తటస్థపడి, అతని చదువు సంధ్యల గురించి వాకబు చేస్తే. "మీ వాడికేమండీ బంగారం" అంటూ కాసిన్ని మంచి మాటలే చెప్పాలి.

ఇలాగే ఇంకా ఎన్నో ఎన్నో నిబంధనలూ చట్టాలూ ఉన్నాయి.

చట్టాన్ని ధిక్కరించి ఏ ఉపాధ్యాయుడైనా, విద్యార్థి అంచనాకి తక్కువ మార్కులు వేసినా, క్లాసులో హాజరు విషయంలో కఠినంగా ప్రవర్తించినా, విద్యార్థి యొక్క తల్లి దండ్రులతో గొప్పకిపోయి నేరాలు చెప్పినా - అట్టి ఉపాధ్యాయుడు శిక్షార్హుడు.

శిక్షలు మళ్ళీ రెండు రకాలు. ఒకటి సామాన్య శిక్ష. రెండవది కఠిన శిక్ష. ఉపాధ్యాయుని తప్పిదమును బట్టి బాలురే శిక్షలు నిర్ణయింతురు.

ఆయన క్లాసులో పిల్లికూతలు కూయుట. ఎదిరించుట. ఆయన సైకిలుకి గాలి తీసివేయుట. ఆయన పుస్తకములు తస్కరించుట. భార్యతో ఆయన ఏ సినిమాకో వెళుతున్నపుడు సర్వనామములతో ఆయనని పిలుచుట - ప్రతి ఉపాధ్యాయునికీ ఏదో ఒక సర్వనామముండుట సర్వసాధారణం - ఇవి సామాన్య శిక్షలో భాగములు.

ఇక కఠిన శిక్ష విధానం ఎటువంటిదంటే, క్లాసులో సామూహికంగా ఎదిరించుట - ఆ ఉపాధ్యాయునకు వ్యతిరేకముగ నినాదాలిస్తూ ఊరేగుట - వంటరిగా వెళుతున్నప్పుడు రాళ్ళు రువ్వుట, అవసరమునుబట్టి కొట్టుట - ఇవి.

సర్వనామాలు సర్వసాధారణం అని చెప్పారు కదా - సుబ్బారావుగారికి 'డబ్బా' అని పేరు పెట్టారు. గోడల మీదకి ఆ పేరు ఎక్కించారు. ఊరు అశేష జనానికి తెలిసే నిమిత్తం ఊళ్ళో స్వేచ్ఛగా విహరించే ఆంబోతు మీద అందంగా రాశారు 'డబ్బా' అని. సుబ్బారావు మేష్టారి సర్వనామమైన డబ్బా ఎంత ప్రచురితం అయిపోయిందంటే, ఆయన భార్య "ఏమండీ - పిల్లాడికి పాలడబ్బా తేవాలండీ" అని అంటానికి కూడా భయపడేది.

విద్యార్థులకి తీవ్రమైన కోపం వస్తే ఉపాధ్యాయుణ్ణి కొట్టడం పరిపాటి. నా సహోపాధ్యాయుడైన నాగరాజుగారిని విద్యార్థులు ఓ మాటు ఆ కాస్త మంచి మాటా చేశారు. ఆయన హెడ్మాష్టారు దగ్గరకు వెళ్ళి మొరపెట్టుకొని "అయ్యా నేనీ ఉపాధ్యాయ వృత్తిని వదిలేస్తాను. బతికే లాగునలేదు పరిస్థితి. దెబ్బలు తిని మళ్ళీ ఏ ముఖం పెట్టుకొని పదిమందిలో తిరిగేది" అన్నాడు. దానికి హెడ్మాష్టారు సహజ గాంభీర్యంతో "ఏ మొఖం తోనా? ఉపాధ్యాయుని ముఖంతో - అదిసరే - ఎన్నోసారి నువ్వు దెబ్బలు తినడం ?" సాగర సదృశమైన ఆ గాంభీర్యానికి నాగరాజుగారు పాపం కళ్ళు తేలేస్తూ "ఎన్నోసారి కూడా నండి నా కర్మం కాలితే!" అన్నారు. హెడ్ మాష్టారు గొంతు సవరించుకొని "ఓస్, మొదటి సారికే ఇంతా? పిచ్చివాడా! నిక్షేపంలాంటి ఉద్యోగాన్ని వదులుకొని నోట మన్ను కొట్టుకుంటావా? ఎవరు చెప్పారు నీకీ సలహా? ఎవరు చెప్పారంట?... చాలు చాల్లే... అవమానమా? ఇటువంటివి పెట్టుకుంటే నెగ్గినట్టే! నా జీవితం ఆదర్శంగా తీసుకో - నన్ను చూచి ధైర్యం తెచ్చుకో - ఎందుకు పిచ్చిన పడతావు? కొట్టారు కొట్టారు అంటావు. కొట్టంది ఎవరిని? మొదట నన్ను నెల్లూరులో కొట్టారు. తర్వాత గుంటూరు స్కూల్లో పనిచేస్తుంటే అక్కడ కొట్టారు. అటు తర్వాత నూజివీడులో, తర్వాత ఏలూరు, దెందులూరు. ఆత్మకూరు, అనకాపల్లులలో కొట్టారు. విశాఖ పట్నంలో సముద్రపు ఒడ్డున పడేసి మరీ కొట్టారు. రాజధానికి మూల ఉందామని బరంపురం పోతే అక్కడ కూడా

**ఈ క్రింది బొమ్మలలో దాగిన సినీ ప్రముఖులను గుర్తించ లేకపోతే రివర్స్‌లో చూడండి**



తప్పలేదు దెబ్బలు... అందుకని...''

హెడ్మాష్టారుగారి ఈ అనుభవ కథా కథనం విన్నాక, 'విద్యార్థులు నన్ను కొట్టార'ని ఒక్క ఉపాధ్యాయుడు పబ్లిగ్గా బాధపడితే ఒట్టు! ఎప్పుడూ బాధపడని నన్నుచూసి తోటి ఉపాధ్యాయులు 'రావుగారినీ విద్యార్థులు కొట్టే ఉంటారు' అని జాలిపడితే "మొగ్రో నా కలాంటి సన్మానం జరగలేదయ్యా'' అంటే, నామాట నమ్మరే! అవున్లే... అవున్లే... అంటూ ముసిముసినవ్వులు నవ్వుతారు... పోనీ మీరైనా నమ్ముతారా? లేక వాళ్ళలాగే నవ్వుతారా?



పాఠశాలల్లో తెలుగు పండితులకు బొత్తిగా గౌరవం లేకపోయింది. ఆ క్లాసులో పిల్లలు విజృంభించి అల్లరిచేసి ఇతర క్లాసులలో కూడా పని జరుగకుండా చేయుటం అందరికీ తెలిసిన విషయమే! ఇంగ్లీషు క్లాసులో నోరెత్తి రెండు మాటలు మాట్లాడలేని గుంటడికి తెలుగు క్లాసులో వల్లమాలిన తెలివి పుట్టుకొస్తుంది. ఇతర క్లాసులలో బెంచీలతో బాటు నిర్జీవ ప్రతిమలాగ ఉండేవాడు ఈ క్లాసు వచ్చేసరికి సజీవుడై గొంతెత్తి ఉపన్యాసాలు ఇస్తాడు. అంతేకాకుండా ఇంగ్లీషులో మూగబోయిన అతని సరస్వతి తెలుగు క్లాసులో ఛనక్‌మని నాట్యం చేస్తుంది.

ఇదంతా ఎందుకు చెప్పానంటే, ఓరోజున తెలుగు మేష్టారు శలవు పెడితే ఆ క్లాసుకి నన్ను వెళ్ళమన్నారు హెడ్‌మాస్టారు. నేనూ తెలుగు భాషయందుండే అభిమానంవల్ల ఒప్పుకున్నాను కాని పాండిత్యం ఉండికాదు. నాకు తెలుగులో పాండిత్యంలేదనీ, వ్యాకరణం క్షుణ్ణంగా చదివి ఉండలేదనీలెట్లా తెలిసిందో మరి, కొందరికి తెలిసిందని నేననుకుంటాను. లేకపోతే, ఓ కుర్రాడు లేచి నా ప్రాణానికి 'లంగూడీ అంటే ఏమిటండీ?' అంటూ ఎందుకు అడుగుతాడు! లంగూడీ! లంగూడీ ఏమిటి? ఇదెక్కడి మాటదేవుడా! ఎప్పుడూ వినలేదే! నాలో బయలుదేరిన గాభరాని పైకి కనిపించనియ్యకుండా, కోపంగా ముఖంపెట్టి 'సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చు మీది' సూత్రం అర్థం అయిందా?' అన్నా. "అది అర్థం అయిందండి. లంగూడీయే అర్థం కాలేదండీ'' అన్నాడు. అతగాడి వరసచూస్తే యుద్ధానికి సిద్ధం అవుతూన్న ప్రత్యర్థిలా కనిపించాడు. ఓటమిని అంగీకరించకూడదు. అందుకే బింకంగా 'వ్యాకరణం క్లాసులో ఇతర విషయాలు అడక్కు'' అన్నా. "ఇది వ్యాకరణానికి సంబంధించినమాటే నండి'' - ఎంత సౌమ్యంగా అన్నా నా ప్రాణాలతో ఆడుకుంటున్నట్లనిపించింది... అప్పటికే పిల్లలు ఒకరి మొఖం ఒకరు చూచుకుని తలవొంచుకుని ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. ఇంతలో నా పాలిట భగవంతుడిలా స్కూల్ ప్యూను బెల్ కొట్టాడు. 'బ్రతుకు జీవుడా' అనుకుని దాని "అర్థం వచ్చే క్లాసులో చెప్తాను లేవోయ్'' అని బయటికి వచ్చిపడ్డాను.

తర్వాత ఆ మాటకోసం ఎన్ని నిఘంటువుల్ని తిరగేశానో లెఖ్ఖలేదు. ఎవరినైనా అడుగుదామంటే నామోషీ - అసలు అలాంటి పదం ఉందో లేదో ఆ కుర్రాడు నన్నేడిపించడానికి ఆ పదం ఏదో సృష్టిస్తే, దీని గురించి పది మందినీ అడిగితే అంతకంటే అభాస ఉందా? 'మేష్టారూ, వాడు మిమ్మల్ని ఏడిపించడానికి అన్నట్టున్నాడండీ' అని వాళ్ళంతా నవ్వితే? అందుకే ఆ సంగతి అంతటితో మరిచిపోయాను. కనీసం మరిచిపోయినట్లు నటించాను.

కాని ఆ గడుగ్గాయి కుర్రాడెందుకు మరిచిపోతాడు? నన్ను ఏడిపించానికే కంకణం కట్టుకున్నాడు - తర్వాత క్లాసులో అడగనే అడిగాడు. నేను భయపడినంతా అయింది. నేను తెల్లమొహం వెయ్యడం - తబ్బిబ్బు పడడం - వాడు కూర్చోకుండా అర్థం చెప్పవలసిందే అన్నట్లు జండాకొయ్యలాగ నుంచునే ఉండడం- తక్కిన విద్యార్థులలో కొందరు చాటుచాటుగానూ కొందరు బాహాటంగానూ నవ్వుతూ ఉండడం - నాకు తెలియదు అని చివరికి ఓటమిని అంగీకరించి 'అయినా ఎక్కడుంది ఆ మాట?' అని చిరాకు పడ్డాను. ఇదిగోనండి ఈ వ్యాకరణ పుస్తకంలో అంటూ ముందుకు వచ్చాడు. నా గుండె గుభిల్లుమంది - తీరా వాడిచ్చిన పుస్తకం చూద్దును కదా నాకూ నవ్వు వచ్చింది. అప్పటికే సముద్ర ఘోషలా ఉంది క్లాసంతా నవ్వులతో - ఇంతకీ అదేమిటో తెలుసాండీ - చిన్నయసూరి వ్యాకరణ సూత్రంలో మాట అది :- ఇ ఈ ఎ ఏ లంగూడి - అని, 'లం' అనే అక్షరాన్ని దానిముందు అక్షరంతో కలపకుండా తర్వాత అక్షరంతో కలిపి చదివి నా ప్రాణమూ పరువూ రెండూ తీశాడు. తెలియక అలా చేశాడంటారా? ఒక్కనాటికి నమ్మను.

ఇలాంటి లంగూడీ ప్రకరణాలెన్నో ఉపాధ్యాయుని జీవితంలో -

తరువాయి భాగం వచ్చే సంచికలో

**ఈ క్రింది బొమ్మలలో దాగిన సినీ ప్రముఖులను గుర్తించ లేకపోతే రివర్స్‌లో చూడండి**



బొ
మ్మ
లా
ట



Ramakrishna

# నీతో చెప్పాలని...

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో
'హాసం'
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

ఆకాష్, అనుప్రియ, ఆషిత, గిరిబాబు,
సుధాకర్, బ్రహ్మానందం,
యమ్.యస్.నారాయణ, జీవా,
హరిప్రసాద్, సూర్య, తిరుపతి ప్రకాష్,
రఘుబాబు (మురారి-ఫేం), కృష్ణవేణి,
తెనాలి శకుంతల

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | : బి. సత్యానాయుడు |
| సంగీతం | : కోటి |
| మాటలు | : మరుధూరి రాజా |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : వి. జయరాం |
| ఆర్ట్ | : డి. సత్యనారాయణ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : రాంబాబు కె. సిహెచ్. వి. శర్మ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : హరి కె. చందూరి. రవి సంకూరి |
| అసిస్టెంట్స్ డైరెక్టర్స్ | : అనుకుమార్ పి. సురేష్ విక్రమ్. |
| నిర్మాతలు | : కె. గిరిజా కుమారి, ఎ. శ్యామల, గణపం పెద్దిరెడ్డి. |




నీతో చెప్పాలని...

# నీలాంబరి

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో
'హాసం'
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

రమ్యకృష్ణ, ప్రేమ, తార, అర్చన, చారులత,
సుమన్, వినోద్‌కుమార్, రంగనాథ్, దేవరాజ్, చారుహాసన్

## సాంకేతిక నిపుణులు

ప్రకాష్ స్టూడియోస్ సమర్పించు
మాటలు, పాటలు: వెన్నెలకంటి
డబ్బింగ్ ఇన్‌చార్జ్ : శివ రాంప్రసాద్ గోగినేని
డబ్బింగ్ ఆర్టిస్ట్స్ :
విజయభాస్కర్, వాయిపుత్ర నాగార్జున, కిషోర్, ఆర్‌సియం రాజు, కాదంబరి కారణ్, మనోహర్, మంగరాజు, మధుబాబు, వల్లం నరసింహరావు, సుబ్బారావు, దీప, లెలినా చౌదరి, భవాని, ప్రియాంక, పుష్ప, అనురాధ
డైలాగ్స్-సాంగ్ రికార్డింగ్ ప్రకాష్ స్టూడియోస్, హైదరాబాద్
ఇంజినీర్స్ : డి. శంకర్, యం. హేమసుందర్
డి.టి.యస్ మిక్సింగ్ : ప్రసాద్ రికార్డింగ్ థియేటర్, హైదరాబాద్
ఇంజనీర్స్ : రాధాకృష్ణ, కుమార్
పోస్టర్స్ ప్రింటింగ్ : ధనలక్ష్మి సినీ ఆర్ట్స్, శివకాశి
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : పి.నాగేశ్వరరావు
అసిస్టెంట్స్ : వి రవికుమార్, జి. రవి వర్మ, శేఖర్
రికార్డింగ్ - రీ రికార్డింగ్

మారుతి స్టూడియో, బెంగుళూరు
కెమెరా అసిస్టెంట్స్ : భాస్కర్, హరి
పబ్లిసిటి - టివీ యాడ్స్ : రామకృష్ణ, నాగరాజు (ప్రకాష్ స్టూడియోస్)
అనువాద సహాయకులు : బి.కె. రాంమోహన్, గోపి
ఆర్ట్ : హెచ్. మూర్తి
మేకప్ : కుమార్
కథ : సునీల్ పరమేశ్వర్
డాన్స్ : సంపత్
అసిస్టెంట్స్ : జయ, ఆనంద్
ఫైట్స్ : దళపతి దినేష్, కె. వెంకటేష్
స్టిల్స్ : రాజు
అసిస్టెంట్ : నారాయణ
ఎడిటింగ్ : రవి, దాము
కో-డైరెక్టర్ : యం.డి. శ్రీధర్
అసిస్టెంట్స్ : కుమార్, సోము, బాబు
కెమెరా : కృష్ణకుమార్
సంగీతం : రాజేష్ రామనాథ్
దర్శకత్వం : సూర్య



రచన: శివగణేష్ ❶ గానం: సునీత, శ్రీరామ్ ప్రభు

ఆ: ఏమో ఏమైందో మరి నాలో నే లేను
అ: ఏదో ఏదేదో అనుకున్నా అనలేను
ఆ: ఇలా నన్ను మార్చేసింది
అ: అదే నిన్న లేనట్టుంది
ఆ: ఆ చోరవే ప్రేమ అని నాకు ఈనాడే తెలిసిందిలే ॥ఏదో॥
ఆ: చూస్తూనే వెళ్లి నీపైనే వాలి రానంది మనసెందుకో
అ: నీతోడే కోరి నీ నీడై మారి వచ్చింది తనువేమిటో
ఆ: నేనెవరని నాకే పరిచయమే చేసినా ఈ తీరు బాగుందిలే
అ: ఆ వరసే ప్రేమ అని నాకు ఈనాడే తెలిసిందిలే ॥ఏమో॥
అ: చెప్పాలి గుండె విప్పాలి అని అనుకుంది ఎదమాటుగా
ఆ: లోలోనే దాగి ఎన్నాళ్లో వేగి పొంగింది పరువాలుగా
అ: పదునెనిమిది ప్రాయం పదహారు కళలే
కలలకు కనులిస్తుండగా
ఆ: ఆ చోరవే ప్రేమ అని నాకు ఈనాడే తెలిసిందిలే ॥ఏమో॥

రచన: సత్యానాయుడు ❷ గానం: కోటి, కార్తీక్

సా: ప్రేమకొరకు జీవించు ప్రేమలోనె విహరించు
ప్రేమ యాత్ర సాగించు ఆ ప్రేమ గెలిచి పెళ్లాడు
అబ్బ.. ఏం చెప్పావ్ గురు.. రిథమ్‌లో పాడు
ప: ప్రేమ అంటె అమ్మాయి లుక్సు కాదు అమ్మాయి లిప్సు కాదు
హిప్సు కాదు చీక్స్ కాదు షేప్సు కాదు
కాదల్ అంటె అమ్మాయి జీన్సు కాదు
అమ్మాయి హీల్సు కాదు
టైట్సు కాదు ఫైసు కాదు హైట్సు కాదు
లవ్వు అంటె ఇవేను కానేకాదు మనసొకటే...



అ: ఓనమాలు నేర్పుతుంది ఈ ప్రేమ ॥చమక్కురో॥
అ: వయ్యారి భామ సుఖించుదామా తపించు వేళల్లో
నరాలే జివ్వుమంటె జివ్వుమంటె జివ్వుమంటుంటే
ఆ: వరాల ప్రేమ సుఖాలసీమ వరించు వేళల్లో
పెదాలే కెవ్వుమంటె కెవ్వుమంటె కెవ్వుమంటుంటే
అ: సొగసైన గొల్లభామ వరసైన ముద్దుగుమ్మ
ఆ: నిను వీడలేని జన్మ అందించె నాకు బ్రహ్మ
అ: సిరిమువ్వల్లో సవ్వళ్లో అల్లర్లో అల్లర్లో
ఆ: చిరుజల్లుల్లో చిందుల్లో సందళ్లో సందళ్లో
అ: హే... నిన్ను నీకు తెలుపుతుంది ఈ ప్రేమ ॥చమక్కురో॥

రచన: పోతుల రవికిరణ్ ❻ గానం: సందీప్, గంగ

అ: ఓహో... ఓహో...
మేఘాల ఆకాశమే ఒక వింతగా మెరిసే
ఆ: మౌనాల ఈ ప్రేమలే పులకింతగా మురిసే
అ: నిజమేనా కలలేనా అదేదో ఆరా తియ్యాలని
ఆ: కలలైనా నిజమౌనా ఇదేదో నీతో చెప్పాలని ॥మేఘాల॥
అ: ఎవరేమి అన్నా ఎదుటేమి వున్నా
ఎదలోన ఏమూలనో నా ధ్యాస నాదేలే
ఆ: నిను కోరుకున్నా నిను చేరుకున్నా
మదిలోన ఏమాయెనో నా శ్వాస నీదేలే
అ: షికారే ఇలా సాగుతుంటె కలే తీరదా ॥నిజమేనా॥
అ: వయసేమి అన్నా బతిమాలుకున్నా
బదులీయకున్నానులే నా దారి నాదేలే
ఆ: మనసేమి అన్నా మితిమీరుతున్నా
చోరవేదో చేశానులే నా ఆశ నీవేలే
అ: ఖుషీగా ఇలా సాగుతుంటె భలే హాయిలే ॥నిజమేనా॥



❶ గానం: చిత్ర

ప: ఈ జగమే ఈ జగమే ఈ జగమే ఆగెను నను చూసి
చెరగని సొగసిది తరగని వయసిది
ఈ జగమే ఈ జగమే ఆగెను నను చూసి
చెరగని సొగసిది తరగని వయసిది
భూమీ నాదిలే గగనం నాదిలే
గాలీ నిప్పు నీరూ నాదిలే
ఇది సాటిలేని అందమంట జన్మ జన్మకైనా ॥ఈ జగమే॥
చ: ఆ చందమామ కూడా తెల్లబోయే నా యవ్వనమే చూసి
తారకలన్నీ నేడు చిన్నబోయే నా వయ్యారం చూసి
చిలక నా పలుకులే వింటూ మూగబోయిందిలే
హంస నా నడకలే కంటూ సొమ్మసిల్లిందిలే
మాయల కన్నుల మాయనీ కల ఇది
సుందర ప్రకృతి మించిన సొగసిక నాదే నాదే॥ఈ జగమే॥
చ: వీచేటి పూలగాలి ఓడిపోదా నా చిగురు వయసు చూసి
సాగేటి కాలమైనా ఆగిపోదా నా తళుకు బెళుకు చూసి
జగతి నన్నేగనినేడు తలను వంచిందిలే
మెరుపు నన్నే గని నేడు సిగ్గు పడుతుందిలే
విరిసిన కలువిది చెరువుకే చెలువిది
మాయాలోకపు కిన్నెర సుందరి నేనే నేనే
ఈ జగమే ఈ జగమే ఈ జగమే ఆగెను నను చూసి
చెరగని సొగసిది తరగని వయసిది భూమీ నాదిలే
గగనం నాదిలే గాలీ నిప్పు నీరూ నాదిలే
ఇది సాటిలేని అందమంట జన్మ జన్మకైనా



పలికించినా చెలి తలపే ఇది
చిలికించినా తొలి వలపే ఇది
ప్రతిరాత్రి మన్మధుని కేళి తేలి
దింధినక్కుదినా దుర్గమ్మా
ఈ బుల్లెమ్మకు బుల్లోడుకి తగని సిగ్గమ్మ
మూడు ముళ్లేసుకున్నారు ఈ దంపతుల
నువ్వే దీవించు మాయమ్మా
ఆశే చెప్పే ఊసొకటి ప్రేమే అడిగే తోడొకటి
ప్రణయం పొంగే పులకింతలో
నన్నే నేను మరిచానే మరిచి మనసే ఇచ్చానే
గిల్లి చూసే గిలిగింతలో
హద్దన్నదే ఇక లేదన్నది
ఆ వెన్నెలే మన చూపైనది
మనసంతా మరపించు ఇలా ఎలా
దింధినక్కుదినా దుర్గమ్మా
ఈ బుల్లెమ్మకు బుల్లోడుకి తగనని సిగ్గమ్మ
మూడు ముళ్లేసుకున్నారు ఈ దంపతులు
నువ్వే దీవించు మాయమ్మా
దింధినక్కుదినా దుర్గమ్మా
ఈ బుల్లెమ్మకు బుల్లోడుకి తగని సిగ్గమ్మ
మూడు ముళ్లేసుకున్నారు
ఈ దంపతుల నువ్వే దీవించు మాయమ్మా

అ: ఈడు జోడు చేరి మా దాగుడు మూతల్లోని
ప్రేమే నేడు పట్ట కొత్త పాఠాలెన్నో నేర్చుకోదా
ఆ: ఓ... అ: ఓ... ॥అమ్మాయే॥

రచన: పోతుల రవికిరణ్ **5** గానం: కుంచె రఘు, గంగ

ఇ: చమక్కురో చమక్కురో చమక్ చమక్ చమక్కురో
చమక్కురో చమక్కురో చమక్ చమక్కురో
అ: అయ్యో రామా అయ్యోరామా వింతే ఈ ప్రేమ
నాలో లేనే లేనంది నీలో నన్నే చూడంది
చమక్కురో చమక్కురో చమక్క్ చమక్క్ చమక్కురో
ఆ: అయ్యో రామా అయ్యోరామా ఇంతే ఈ ప్రేమ
నాలో నాకే తెలియంది ఏదో నేడే జరిగింది
గిమిక్కురో గిమిక్కురో గిమిక్క్ గిమిక్క్ గిమిక్కురో
అ: ఆకాశాలే హద్దంది
ఆ: ఆవేశాలే ముద్దంది
అ: హే... మాయదారి మాటకారి ఈ ప్రేమ ఇ:॥చమక్కురో॥
అ: శుభాలవేళ సుమాలమాల
తరించువేళల్లో
ఉయ్యాలే ఊపమంటే ఊపమంటే ఊపమంటుంటే
ఆ: సుగంధవేళ స్వరాలలీల
జపించువేళల్లో
సరేలే ఆపమంటే ఆపమంటే ఆపమంటుంటే
అ: వయసైన కోనసీమ
మనసైన సత్యభామ
ఆ: వరదైన కొంటెప్రేమ
ఎదురైన చందమామ
అ: ఒడి నవ్వుల్లో పువ్వుల్లో ముచ్చట్లో ముచ్చట్లో
ఆ: తడిముద్దుల్లో పొద్దుల్లో చప్పట్లో చప్పట్లో



ఆ మనసునే ప్రేమించరా...
ప్రేమించడం ఒక వరమురా ॥ప్రేమ అంటె॥
ప్రేమ యాత్రలో సోదరా సహనమే నీ తోడురా
ప్రేమ గమ్యం చేరగా సాహసముతో సాగరా
మంచి టైములో మంచి నిర్ణయం
వలపుజంటకే కొత్త విజయం
ఏరికోరిన చిన్నదానినే ఎన్నుకున్నచో లైఫు స్వర్గం
ప్రేమ యమ ట్విస్టు రూటురా
నువ్వు బ్లైండుగా వెళ్ళమాకురా
లవ్వాడువరకే నీ డ్యూటి అనుకో
పెద్దోళ్ళ పలుకే ఆపైన వినుకో ॥ప్రేమ॥
అందమొకటే చాలదురా మంచి మనసు ఉండాలి
ఆడదానికి ఓర్పుంది నేర్పుకూడా ఉండాలి
అణకువతో నడవడిక కావాలిరా అమ్మాయికి
సహనముతో బంధాలను నిలిపేటి అమ్మాయిని
ఇన్ని ఉన్న చిన్నదాని చెయ్యి అందుకుంటె ఎంత లక్కీ
ఆ లక్కునే దక్కించుకో కలకాలము కలిసుండరా॥ప్రేమ॥

రచన: భువనచంద్ర **3** గానం: టిప్పు, గోపికా పూర్ణిమ

అ: ఓ మిస్సు... ఆ: ఓ...
అ: వచ్చింది... ఆ: ఓ...
అ: టీనేజీ ఆ: ఓ...
అ: ఎక్స్‌ప్రెస్సు ఆ: ఓ...
అ: అమ్మో అమ్మాయి కళ్ళు అల్లో నేరేడి పళ్ళు
అమ్మో ఆ రెండు జళ్ళు వాలే పిస్తోలు గుళ్ళు
ఒక్కసారి వచ్చిచూడు వంతులేసి ఆడిపాడరో హొయి
పాసైతే తప్పదు బాచీ పెళ్ళంటు పెద్దల పేచీ



కమలదళామల కోమల కాంతి కళాకలి తామల బాలలతే
సకలవిలాకలా నిలయ త్రమకేళి చలత్కలహంసకులే
అళికుల సంకుల కువలయ మండల మౌళిమిలత్వకులాలికులే
జయజయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే
॥అయిగిరి॥

**5** గానం: శివకాకాని, నిత్య సంతోషిణి, కోరస్

దిందినక్కుదినా దుర్గమ్మా
ఈ బుల్లెమ్మకు బుల్లోడుకి తగని సిగ్గమ్మ
మూడు ముళ్ళేసుకున్నారు ఈ దంపతుల
నువ్వే దీవించు మాయమ్మ
మొగ్గేవిచ్చి సిగ్గేవచ్చి లగ్గోలగ్గో లగ్గం పెట్టే
చెట్టు పుట్టా మెచ్చేలాగ చెట్టాపట్టాలెయ్యాలంటా
చిలకా గోరింకా మీరంట (2) జింబాలక జిమకులక
దింథినక్కుదినా దుర్గమ్మా
ఈ బుల్లెమ్మకు బుల్లోడుకి తగని సిగ్గమ్మ
మూడు ముళ్ళేసుకున్నారు
ఈ దంపతుల నువ్వే దీవించు మాయమ్మా
మల్లె మంచం రమ్మంది దాహం నాలో కొసరింది
స్వర్గాలేవో చూపించనా
ఆరాటాలా పిలుపుంది ఆశే నేడు తెలిపింది
నిన్నే ఒడిలో లాలించనా



ఈ జగమే ఈ జగమే ఈ జగమే ఆగెను నను చూసి
చెరగని సొగసిది తరగని వయసిది (2) ॥ఈ జగమే॥

**2** గానం: ఉష, కోరస్

మల్లియల మనసింక పలికించవా
మధువులా చిరుజల్లు చిలికించవా
కనులే కలిసే కలలే తెలిసే
కన్నియను సరసాల తేలించవా
మల్లియల మదినిండా కవితే నువ్వా
ఆశల పల్లకిలో ఊసులాడే వేళ...
శ్వాసలే భాషగా మాటాడవా
చుక్కలా తోటలో సొక్కి సోలేవేళ...
మక్కువతో జతచేరి ఆటాడవా
కన్నె కలలన్నీ కడలి అలలల్లే చేరే తీరం నువ్వేలే
వేయి కన్నులతో రేయి పగలంతా వెతికే రూపం నువ్వేలే
నాతోడు నీవంటూ నీ నీడనేనై పాడేను ఈ ప్రేమగీతి
మల్లియల మదినిండా కవితే నువ్వా
నా ఎదకు శృతి నీవై నీ ఎదకు లయనేనై
అనురాగ రాగాలు రేపే చలి
మురిపాల చెక్కిలికి ముద్దులా రంగోలి
ముచ్చటగ దిద్దమని కోరెను చెలి
జతగ రమ్మంటూ బతుకే నీదంటు
మదిలో తలపేదో తెలిపింది
పండు వెన్నెలలో గుండెలోకటవుతూ

ఈ స్టూడెంట్ లైఫే గొప్పది బాబూజీ
లైనేసెయ్‌రా లక్ష్మోజీ ఓ సూపర్ ఫిగరుని చూసి
ఇక మళ్ళీ రాదుర లైఫులో టీనేజీ
అందమైన ఈ జీవితానికి అర్థమున్నదోయ్ బ్రదరు
అల్లిబిల్లిగా ఆటలాడుతూ పొద్దుపుచ్చ మాకు డియరు
వాస్తవానికి విలువిచ్చి ఒళ్ళువంచి పనిచెయ్యి
ఎంతో నువ్ శోధించాలి ఏదో నువ్ సాధించాలి
అన్నాడోయ్ షేక్స్పియరు ॥పాసైతే॥

ఆ: ఆనందంగా ఎన్‌జాయ్ చెయ్యని లైఫే వేస్టోయ్
చెదపురుగుల్లా బుక్సుని తింటే వచ్చే దేంటోయ్
అ: లవ్వో గివ్వో సెటప్పు చెయ్యడం ఫాషను బాబోయ్
ఫ్యూచరులోన ఆ తీపి గురుతే సుఖమిస్తుందోయ్
ఆ: ఏ డిగ్రీ మనకున్నా ఉద్యోగం రాదన్నా
అ: నిరాశే వలదన్నా నీ డ్యూటీ చెయ్‌మన్నా
నేడు పడ్డ కష్టాల అసలు విలువ తెలిసేది
ఫ్యూచర్‌లోనే... కన్నా ॥పాసైతే॥

ఆ: రేపటికోసం ఇవాళ్టి సౌఖ్యం వదలకు నేస్తం
అ: లక్కుందంటే స్వర్గాలె ఒళ్ళో వాలుట తథ్యం
ప్లానింగ్ లేక బిల్‌గేట్సు అయినా పాపర్ కాడా
ఆ: జీవితమంటే కానేకాదోయ్ రంగులమేడ
అ: చిరుబీజంలోపలనే మహావృక్షం దాగుందోయ్
శ్రమ శక్తిని గుర్తిస్తే ఘన విజయం నీదేనోయ్
చదువుతోనే విజ్ఞానం చదువుతోనే సౌభాగ్యం
ఆ: సాధించాలోయ్ నేస్తం... లైఫేజే గేమ్ లెట్స్ ప్లే ఇట్
లైఫేజే సాంగ్ లెట్స్ సింగ్ ఇట్... లైఫేజే జిగ్ జాగ్ పజిల్
లెట్స్ సాల్వ్ ఇట్



అ: జీవితమే ఓ సైయ్యాట జీవితమే ఓ పూదోట
అందంగా దానిని మలిచెయ్ ఓ నేస్తం ॥అందమైన॥

**4** రచన: సాహితి — గానం: జయచంద్రన్, శ్రీవర్ధని

అ: అమ్మాయే ఓరకంట చూసిందంటే
నాదిరిదిన్నా థిల్లానా నాదిరిదిన్నా థిల్లానా
ఆ: అబ్బాయే చక్కున కన్నే గీటాడంటే
నాదిరిదిన్నా థిల్లానా నాదిరిదిన్నా థిల్లానా
అ: పడుచోళ్ళ ఒంట్లో పాకే కరెంటు వైరు
ఆ: దానికే పెట్టేద్దాము ప్రేమన్న పేరు
అ: వయసైనా తరగదు ఈ జోరు ॥అమ్మాయే॥
ఆ: ఓ... అ: ఓ...

ఆ: వేసవి సెగనే చలి పొగమంచుగ గడుపును కాలాలు
ప్రేమల్లో కలిసిన హృదయాలు
అ: బండలనైనా దిండ్లుగ తలచి ఒకటిగ రేపవలు
హాయిగా ఒరుగును ప్రణయాలు
ఆ: మూడుపూటలా వెచ్చవెచ్చగా పట్టుకుంటె నిండు కౌగిలి
అ: ఆ... చెప్పపెట్టక నొప్పిపుట్టక పారిపోదా అన్నమాకలి
ఆ: నింగిని స్వర్గం కన్నా మా ప్రేమల స్వర్గంలోనా
ఆనందాలే చిందేహాయి సంతోషంగా సాగేనోయి
అ: ఓ... ఆ: ఓ... ॥అమ్మాయే॥

అ: ప్రేమ జంటలు ఉల్లాసంగా గడిపే సమయాలు
ఎన్నటికి వాడని సరదాలు
ఆ: ఇద్దరి మనసులు ఇంపుగ చేరి జరిపే సరసాలు
ముద్దులై కురిసే మురిపాలు
అ: సిగ్గుమొగ్గలే ముద్దుగుమ్మనే కోరుకుంది కోడె వయసు
ఆ: రెచ్చగొట్టిన అందగాడినే మెచ్చుకుంది కన్నె మనసు



కరిగే కాలమ్ము ముందుంది
నీ మనసు నామనసు జతకూడి నేడు పాడింది
ఈ ప్రేమగీతి మల్లియల మనసింక పలికించవా
మధువులా చిరుజల్లు చిలికించవా కనులే కలిసే
కలలే తెలిసే కన్నియను సరసాల తేలించవా
ఓహో... ఓహో...
మల్లియల మనసింక పలికించవా
మధువులా చిరుజల్లు చిలికించవా

**3** గానం: కౌసల్య, కోరస్

బ్యూటీవుంది మనముందే
డ్యూటీ నీదే పద మందే
బ్యూటి నిన్నే కోరుతుంది రాకపోతే వేస్ట్ అంది
నడుము ఊపులు ఎఫ్‌టీవి
చిలిపి పాటలు ఎమ్‌టీవి తళుకు బెళుకు స్టార్‌టీవి
జల్సాకి జెమిని టీవి వ్యాక్సింగ్‌తోటి బాక్సింగ్ చెయ్యి
బ్యూటీ కాంపిటేషన్ మ్యాచింగ్ డ్రస్‌తో మ్యాచ్ ఫిక్సింగ్
దిల్‌కా ఫ్యాషన్
బ్లీచింగ్ లేనిదే అట్రాక్షన్ ఫేస్‌లోవుంది ఇంట్రాక్షన్
ఐబ్రోలో ఆక్సిజన్ మెడిక్యూర్‌లో కొత్త ఫంక్షన్
తుళ్ళు వయసిది లేటెస్టు కళ్ళ బ్యూటీ కాంటెస్టు
టెస్టులెన్ని చేసినను బ్యూటి ఒకటే ఎవరెస్టు
రైటు లెఫ్ట్ క్యాటువాకు అదిరె సస్పెన్సు
థర్టీసిక్సు ట్వంటీ సిక్సు నడుమే బ్యాలెన్సు



**4** గానం: కోరస్

అయిగిరి నందిని నందితమేదిని విశ్వవినోదిని నందనుతే
గిరివరవింధ్య శిరోదినివాసిని విష్ణువిలాసిని జిష్ణునుతే
భగవతి హేశితి కంఠకుటుంబిని భూరికుటుంబిని భూరి కృతే
జయజయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే
సురవరవర్షిణి దుర్ధర ధర్షిణి దుర్ముఖమర్షిణి హర్షరతే
త్రిభువన పోషిణి శంకరతోషిణి కిల్బిషమోషిణి ఘోషరతే
దనుజనిరోషిణి దితిసుతరోషిణి దుర్మదశోషిణి సింధుసుతే
జయజయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే
॥అయిగిరి॥

అయిజగదంబ మదంబ కదంబ వనప్రియ వాసిని హాసరతే
శిఖరి శిరోమణి తుంగహిమాలయ శృంగ నిజాలయ మధ్యగతే
మధుమధురే మధుకైటభ భంజిని కైటభ భంజిని రాసరతే
జయజయహే మహిషాసుర మర్దిని రమ్యక పర్దిని శైలసుతే
॥అయిగిరి॥

అయి సుమనస్సుమనస్సుమనస్సు మనస్సునమస్సు మనోహర
కాంతియుతే
సుత రజ నీరజ నీరజ నీరజ నీరజ నీకర వక్త్రవృతే
సునయన విభ్రమరభ్రమరభ్రమరభ్రమర భ్రమరాధిపతే
జయహే జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే
॥అయిగిరి॥

## కిషోర్‌కుమార్ లైఫ్‌నే మార్చివేసిన

# ఆల్‌రౌండ్ ఎంటర్‌టైనర్ - డేనీ కేయే






డేనీ కేయే

కిశోర్‌కుమార్ పేరు చెప్పగానే ఒక గాయకుడు మాత్రమే కాదు, ఒక నటుడు, దర్శకుడు, నిర్మాత, సంగీత దర్శకుడు గుర్తుకు వస్తారు. ముఖ్యంగా నటుడిగా కిశోర్‌కి ఒక ప్రత్యేక స్థానం ఉంది. అతడు కమెడియన్ అంటే కమెడియన్ కాదు. మామూలు మూస హీరో అంటే హీరో కాదు. అమాయకత్వం, కొంటెతనం, హాయిగా ఉండే మనస్తత్వం కలిగి హుషారుగా పాటలు పాడే కథానాయకుడతను. "చల్తీకా నామ్ గాడీ" "హాఫ్ టికెట్", "నౌకరీ", "ఝుమ్రూ", "బాప్‌రే బాప్" - ఇలా ఎన్నో సినిమాలలో అటువంటి పాత్రలు ధరించి ప్రేక్షకులకు దగ్గరయ్యాడతను. అప్పటికి చిత్రరంగానికి పరిచయం కాని సరికొత్త హీరో ఇమేజ్ అది. ఎమోషనల్ అయిపోయి, బిగుసుకుపోయిన డైలాగులు గుప్పించే హీరోలకు విభిన్నంగా హాయిగా ఆడి, పాడే కిషోర్ పాత్రలు ప్రజలను ఆకట్టుకున్నాయి.



కిషోర్‌కుమార్

కిశోర్ చిత్రరంగంలో ప్రవేశించింది. ఇటువంటి పాత్రలు వేయడానికి కాదు. అతను చిన్నప్పటినుండి ఆశపడ్డది గాయకుడు కావాలని. సైగల్ అతనికి ఆరాధ్యదైవం. కానీ అతని గొంతు పాటలు పాడడానికి పనికిరాదు పొమ్మన్నారు స్టూడియో వాళ్లు. (వాళ్ల అన్నయ్య బావమరిది ఎస్.ముఖర్జీ నడిపే ఫిల్మిస్తాన్‌తో సహా).

అశోక్‌కుమార్ చేతికి బాంబే స్టూడియో వచ్చిన తర్వాత "జిద్దీ" అనే సినిమాలో చిన్న తోటమాలి పాత్ర లభించింది. సైగల్ స్టయిల్లో ఓ పాట ("మర్‌నే కీ దువాయేఁ క్యోం మాంగూఁ") పాడాడు కూడా. ఆ తర్వాత వచ్చిన ఛాన్సు "ఫరేబ్". ఇవన్నీ సీరియస్ సినిమాలే. కిషోర్‌కు ప్రత్యేకమైన గుర్తింపేమీ రాలేదు.

తన కెరియర్ ఎటుపోతుందో తెలియని స్థితిలో ఉండగానే కిశోర్ డేనీ కేయే నటించిన "నాక్ అన్ వుడ్" (1954) సినిమా చూడడం సంభవించింది. ఒక నటుడు తెరపై డాన్సు, మిమిక్రీ, మైమ్, పేరడీ చేస్తూ చక్కటి పాటలు కూడా పాడగలడని కిశోర్ ఎన్నడూ ఊహించలేదు. కానీ డేనీ అవన్నీ చేసి చూపించాడు. డేనీ రొమాంటిక్ హీరో కాదు. అతని ప్రేక్షకులు ప్రధానంగా చిన్నపిల్లలు. కానీ ఆ సినిమాలు చూసిన పెద్దలు కూడా పిల్లల్లాగానే వడివడి నవ్వుతారు. ఈ ఫార్ములా కిషోర్‌కి అద్భుతంగా నచ్చింది. తనను తానే డేనీగా మలచుకున్నాడు. "ముకద్దర్" సినిమాలో అమెరికన్ బ్రాడ్వే స్టయిల్‌లో గళ్లచొక్కా, టాప్ హేట్, చేతిలో వాకింగ్ స్టిక్‌తో ప్రత్యక్షమయ్యాడు. అతి త్వరలోనే "ఇండియన్ డేనీ కేయే"గా పేరు తెచ్చుకున్నాడు. టోటల్లీ ఎంటర్‌టైనింగ్ హీరోగా నిలదొక్కుకున్నాడు.

**జీవిత విశేషాలు**

అసలు పేరు: డేవిడ్ డేనియల్ కమిన్‌స్కీ.
జననం: జనవరి 18, 1913 న్యూయార్క్ సిటీలో
వలస వచ్చిన రష్యన్ కుటుంబంలో
తండ్రి టైలర్, హైస్కూల్ చదువు ఆగిపోయింది.
రేడియో స్టేషన్‌లో ఉద్యోగి.
తర్వాత కాట్‌స్కిల్స్‌లో కమెడియన్‌గా
భార్య సిల్వియా ఫైన్ రచయిత్రి
కొన్ని షోలకు స్క్రిప్టు సమకూర్చింది
మొత్తం నటించినవి 17 సినిమాలు
మరణించినది హృద్రోగంతో 1987 మార్చి 3న

కిశోర్ జీవితం దిశనే మార్చివేసిన ఈ డేనీ కేయే ఎవరు?

డానీ తొలి ఫీచర్ సినిమా "అప్ ఇన్ ఆర్మ్స్" (1944) ఓ మ్యూజికల్ కామెడీ. డేనీ కేయే అమెరికన్ ఎంటర్‌టైనర్. తమాషా ఏమిటంటే జన్మతః అతను రష్యన్. చాలామంది ప్రముఖులలాగానే అతడూ చిన్నప్పుడు దారిద్ర్యంతో బాధపడ్డాడు. చదువు మానేసి క్లబ్బుల్లో కామెడి చేశాడు. డేవ్ హార్వీ, కేథలీన్ యంగ్ క్లబ్‌లో అతను డాన్స్ ప్రదర్శన ఇచ్చిన తొలి రోజున జారిపడ్డాడు. ఆడియన్స్ పగలబడి నవ్వారు. ఇక అప్పటినుండీ జారిపడడం కూడా ప్రదర్శనలో భాగంగా చేసుకుని, డాన్సును, కామెడీని కలగలిపాడు.

1939లో బ్రాడ్వేలో అతని ప్రవేశం - "ది స్ట్రా హేట్ రెవ్యూ"తో. ఇక్కడే అతనికి సిల్వియా ఫైన్‌తో పరిచయం, ప్రణయం, దరిమిలా పరిణయం. ఆమె ప్యారడీ సాంగ్స్ రాయడంలో దిట్ట. 1940లలో బ్రాడ్వేలో, నైట్‌క్లబ్‌లలో, రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొంటున్న అమెరికన్ సైనికుల కోసం ఏర్పాటు



# నటుడే కాదు సంఘ సేవకుడు కూడా....

డేనీ హీరో, గాయకుడు, డాన్సర్, కమెడియన్ కూడా. ఆల్‌రౌండ్ ఎంటర్‌టైనర్ అన్నమాట. నిజజీవితంలో కూడా అతను బహుముఖ ప్రజ్ఞాశాలి. మంచి వంటగాడు, బేస్‌బాల్ టీమ్ ఓనర్. ఏరోప్లేన్ పైలట్. (బోయింగ్ 747 కూడా నడపగలడు). వీటన్నిటినీ మించి అతడు సమాజం పట్ల బాధ్యత ఫీలయ్యే మహామనిషి. 1954లో కెరియర్ ఉచ్చదశలో ఉండగానే యునైటెడ్ నేషన్స్ వారితో చేతులు కలిపాడు. యునిసెఫ్, (యునైటెడ్ నేషన్స్ వారు చిన్న పిల్లలకై ఏర్పరిచిన ఫండ్)కై నిధులు సేకరించాడు. ప్రదర్శనలు ఇచ్చాడు. యునిసెఫ్ వారు తీసిన లఘుచిత్రం "ప్రైడ్ పైపర్"లో ఉచితంగా నటించాడు. తనను ఆదరించిన బాలప్రేక్షకుల కోసమే ఇవన్నీ చేసాడనుకున్నా, సంగీతంపై, సంగీతకారులపై అభిమానంతో 'సింఫనీ మ్యూజిషియన్స్ పెన్షన్ ఫండ్' కోసం ప్రదర్శనలు ఇచ్చి పదిమిలియన్ల డాలర్ల నిధులు సంపాదించి ఇచ్చాడు.

చేసిన ప్రదర్శనలలో ఎన్నో షోలు ఇచ్చాడు. అతని తొలి సినిమాలు (రెండు రీళ్ల కామెడీలు) 1937లో రిలీజయినా, గుర్తింపు మాత్రం పదేళ్ల తర్వాతనే వచ్చింది. "లేడీ ఇన్ ది డార్క్" అనే షో కోసం "చెయ్‌కోవస్కీ" అనే 39 సెకండ్ల పాటలో 50 మంది రష్యన్ సంగీతకారుల పేర్లు అప్పజెప్పేడు. రష్యన్ పేర్లు ఎలా ఉంటాయో తెలిసిన వారికి ఇది గొప్ప ఫీట్ అని తప్పకుండా అనిపిస్తుంది. ఆ ప్రదర్శన చూసిన శామ్యూల్ గోల్డ్‌విన్ 1,50,000 డాలర్ల పారితోషికంతో సినిమా ఛాన్సు ఆఫర్ చేశాడు.

డానీ తొలి ఫీచర్ సినిమా "అప్ ఇన్ ఆర్మ్స్" (1944) ఓ మ్యూజికల్ కామెడీ. తన ఆరోగ్యం గురించి లేనిపోని భయాలు పెట్టుకుని వర్రీ అయ్యే పాత్ర డేనీది. గోల్డ్‌విన్ నమ్మకం వమ్ముకాలేదు. వెంటనే "వండర్‌మాన్" (1945)లో ద్విపాత్రాభినయం చేయించాడు. తర్వాత వచ్చినవి - హెరాల్డ్ లాయిడ్ "ది మిల్కీవే" (1936) సినిమా రీమేక్ "ది కిడ్ ఫ్రమ్ బ్రూక్లిన్" (1946). "ది సీక్రెట్ లైఫ్ ఆఫ్ వాల్టర్ మిట్టీ " (1947) (అదే పేరుతో ప్రఖ్యాత హాస్యరచయిత జేమ్స్ తర్బర్ రాసిన కథ దీనికి ఆధారం). "ది సాంగ్ ఈజ్ బోర్న్" (1948).

## డేనీ కెరియర్

మొత్తం నటించినవి 17 చిత్రాలు వాటిలో ప్రఖ్యాతమైనవి



"ది కిడ్ ఫ్రమ్ బ్రూక్లిన్"

- అప్ ఇన్ ఆర్మ్స్ (1944)
- ది కిడ్ ఫ్రమ్ బ్రూక్లిన్ (1946)
- ది సీక్రెట్ లైఫ్ ఆఫ్ వాల్టర్ మిట్టీ (1947)
- ఎ సాంగ్ ఈజ్ బోర్న్ (1948)
- ది ఇన్‌స్పెక్టర్ జనరల్ (1949)
- హాన్స్ క్రిస్టియన్ యాండర్సన్ (1952)
- నాక్ ఆన్ వుడ్ (1954)
- ది కోర్ట్ జెస్టర్ (1956)

1963 నుండి నాలుగు సంవత్సరాల పాటు "ది డేనీ కేయే షో' అనే టీవీ షో. (దీనికి ఫస్టు సీజన్‌లోనే ఎమ్మీ అవార్డు వచ్చింది) చివరి రోజుల్లో స్కోకీ (1981) అనే టీవి సినిమాలో కాన్సన్‌ట్రేషన్ క్యాంప్

ఆ తర్వాత విడిగా వచ్చి "ది ఇన్‌స్పెక్టర్ జనరల్" (1949) "ఆన్ ది రివియేరా" (1950) (దీంట్లో కూడా ద్విపాత్రాభినయమే) చేసాడు. మళ్లీ గోల్డ్‌విన్ వద్దకు వచ్చి "హాన్స్ క్రిస్టిన్ అండర్సన్" (1952) చేశాడు. మళ్లీ పారమౌంట్ స్టూడియోకు వచ్చి నార్మన్ పనామా, మెల్విన్ ఫ్రాంక్‌లను పెట్టుకుని స్వంతంగా సినిమా తీసాడు. వాళ్లిద్దరూ రాసి, డైరెక్టు చేసి, నిర్మించిన సినిమాయే డేనీ ఆల్ టైమ్ బెస్ట్ - "నాక్ ఆన్ వుడ్" (1954). ఇది ఓ స్పై థ్రిల్లర్ కమ్ కామెడీ. డేనీ ఓ చేతిలో ఓ బొమ్మ పెట్టుకుని మాట్లాడే వెంట్రిలాక్విస్టు. ఆ బొమ్మ డేనీ ప్రమేయం లేకుండానే ఇష్టం వచ్చినట్టు మాట్లాడి కస్టమర్లను అవమానిస్తుంటుంది. ఆ బొమ్మ ద్వారా కూడా మాట్లాడే డేనీయే కాబట్టి, అతను ఓ సైకియాట్రిస్టుకు చూపించుకోవడం మంచిదని ఒక ఫ్రెండు సలహా ఇస్తాడు. ఈ లోపుగా ఓ మారుణాయుధం తయారుచేసే ప్లాను కాగితాలను కొందరు క్రిమినల్స్ ఆ బొమ్మలో దాస్తారు. ఇక ఆ ముఠా వాళ్లు డేనీ వెంట పడతారు. ఇక డేనీ రకరకాల మారువేషాలు వేసి వారి బారిన పడకుండా చూసుకుంటూ ఉంటాడు. కిషోర్‌కుమార్‌ను ముగ్ధుణ్ని చేసిన సినిమా ఇదే! అందుకే లాగుంది, "హాఫ్ టికెట్" సినిమాలో ఈ వెంటాడడం థీమ్ పెట్టారు.



'అప్ ఇన్ ఆర్మ్స్'లో అందగత్తెల మధ్య డానీ

బింగ్ క్రాస్‌బీతో కలిసి నటించిన "వైట్ క్రిస్మస్" (1954), "ది కోర్టు జెస్టర్" (1956) అనే పారడీ కూడా డేనీ హిట్ సినిమాలే. తర్వాత నుండి అతని కెరియర్‌లో ఆటుపోట్లు రావడం మొదలు పెట్టాయి. "మెర్రీ ఆండ్రూ", "మీ అండ్ కల్‌నల్", "ది ఫైవ్ పెన్నీస్", "ఆన్ ది డబుల్" సినిమాలలో వేసిన తర్వాత 1963 నుండీ టీవి ద్వారా ప్రేక్షకులను అలరించాడు డేనీ. చివరిదాకా యునిసెఫ్ కార్యక్రమాలకో, మరో దానికో బెనిఫిట్ షోలు ఇస్తూనే ఉండి తన కళను సార్థకం చేసుకున్న ధన్యజీవి డేనీ కేయే!

-కమ్యూనికేటర్ ఫీచర్స్

# లలిత సంగీతం



సంప్రదాయ గీతం గానం, సంగీతం:
డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ

రాగం: ఖరహరప్రియ
22వ మేళకర్త
కాఫీ (హిందుస్తాని సంగీతం)

తాళం: మిశ్రచాపు
రూపక్‌తాల్
(హిందుస్తాని సంగీతం)

ఆరోహణ : స రి గ మ స ద ని స
అవరోహణ: స ని ద ప మ గ రి స

-షడ్జము, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కైశికి నిషాదం

ఆరోహణ, అవరోహణలందు యివే స్వరాలున్నవి.

ఈ గీతానికి అన్యస్వరమైన శుద్ధ దైవతమును కూడా ఉపయోగించారు స్వరకర్త. మానవాళికి భగవత్తత్త్వాన్ని సందేశాత్మకంగా చాటి చెప్పేవి తత్త్వగీతాలు. భగవంతుడు పవిత్రుడు, పరిపూర్ణుడు, అనంతుడు, శుభకరుడు, సకల కల్యాణ గుణసంపన్నుడు. అది ఆయన స్వభావం, తత్త్వం.

## ఏమి సేతురా లింగా...

ప॥ ఏమిసేతురాలింగా ఏమిసేతురా

1. చ॥ గంగ ఉదకము తెచ్చి నీకు లింగపూజ చేదమంటే
గంగలోన చేప కప్ప లెంగిలంటున్నాయిలింగా
మహానుభావా! మాదేవశంభో! వరలింగమూర్తీ! ॥ఏమి॥

2. చ॥ అక్షయావుల పాడి తెచ్చి అరపితము చేదమంటే
అక్షయావుల లేగ దూడ
లెంగిలంటున్నాయి లింగా ॥మహానుభావా॥

3. చ॥ తుమ్మిపూవులు తెచ్చి నీకు తుష్టుగా పూచేదమంటే
కొమ్మకొమ్మను కోటి తుమ్మెద
లెంగిలంటున్నాయి లింగా ॥మహానుభావా॥

"ఏమి సేతురాలింగా" అనే యీగీతంలో లింగరూపధారియైన పరమేశ్వరునికి భక్తితో నీరూ, పాలు, పూలు మొదలైనవి ఏవి సమర్పించుకోవాలన్నా అన్నీ మలినమైనవిగా తోచి భక్తుడు పొందే ఆవేదన చాలా హృద్యంగా చిత్రించబడినది. భగవంతుని తత్త్వమైన పవిత్రతను పదే పదే తలచుకుంటూ ఆయనకు కళంకితమైన వస్తువులను ఎలా సమర్పించేది అని భక్తుడు వాపోవడం యీ గేయంలోని యితి వృత్తం.

తత్త్వగీతాలకు సాధారణంగా జానపద సంగీతశైలినిగాని, లలిత సంగీతశైలినిగాని అనుసరించి బాణీలు కూర్చడం జరుగుతూంటుంది. ఒక వేళ శాస్త్రీయ సంగీత పద్ధతిలో కూర్చినా, ఆ గీతంలోని సందేశాన్ని ప్రజలకు అందజేయడం ముఖ్యోద్దేశం కనుక, ఆయా రాగాలను సరళమైన, లలితమైన విధంగా ఉపయోగించడం తప్పనిసరి అవుతుంది. అందుకే బాలమురళీగారు ఖరహరప్రియరాగంలోని స్వరాలను వాడుకుంటూ, అన్యస్వరమైన శుద్ధదైవతాన్ని కలుపుకుని, జానపద సంగీత శైలిని కూడా జోడించి స్వేచ్ఛగా స్వర సంచారాలతో మనోజ్ఞమైన బాణీని రూపొందించి కమనీయంగా గానం చేశారు. సుమారు 40 సంవత్సరాల క్రితం ఆయన పాడిన యీగీతం ఆకాశవాణిలో "భక్తిరంజని" కార్యక్రమంలో పలుమార్లు ప్రసారమై శ్రోతలను రంజింప చేసింది.




ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-74022993







**"ఎవరు చేసిన కర్మవారనుభవించక ఏలికైనను తప్పదన్నా!**
**ఏనాడో ఏ తీరో ఎవరు చెప్పాగలరు అనుభవించుట సిద్ధమన్నా!"**
**"మాయాదేహము స్థిరమని నమ్మి మదిలో పొంగకే ఓ మనసా**
**కాయము నిలువదు కాపాడిన గాని మాయమైపోవునే ఓ మనసా"**
**"గూటి చిలకేదిరా ఓరన్నా గూడు చినబోయెరా"**
**"చిన్మయుడగు చిద్రూపసద్గురుని చేరిమ్రొక్కవలెరా**
**తన్మయమైన తారకభావము తనలో తరచవలెరా"**

-ఇటువంటి అద్భుతమైన తత్త్వగీతాలు మనకు తరచుగా వినబడుతూండేవే. ఆత్మయే సత్యమని, నిత్యమని, కనిపించే యీ జగత్తంతా మిథ్య అని, అశాశ్వతమైన యీ ప్రాపంచిక విషయాలను విడిచిపెట్టి విరాగియై తనలోనున్న ఆత్మను కనుగొని తరించాలని మానవునికి యీ గీతాలు హితబోధ చేస్తాయి. ఆత్మసాక్షాత్కార్యాన్ని పొందే విధానము, ముక్తి మార్గాన్ని చూపే సద్గురువుల బోధలు మున్నగునవి యితి వృత్తాలుగా గల యీ పరతత్త్వ గీతాలు జానపద సాహిత్యంలో ఒక భాగంగా పరిగణించబడుతున్నవి.

మహాయోగియైన శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి "కాలజ్ఞాన తత్త్వాలు" రచించారు. లోకంలో భవిష్యత్తులో జరిగే అనేక సంఘటనలను ఆ గీతాల ద్వారా తెలియజేశారు. ఇంకా ఎంతో మంది యిటువంటి తత్త్వాలను రచించి అజ్ఞాతం గానే వుండి పోయారు. కాని వారి రచనలు మాత్రం నిరంతరం జనావళిని జాగృతం చేస్తున్నవి.

బైరాగులు, సన్యాసులు, యోగులు మున్నగువారు ఏకతార మీటుకుంటూ తత్త్వాలను పాడేవారని పెద్దలు చెబుతారు. అయితే ఆధునిక కాలంలో యీ గీతాలను పాడేటప్పుడు వివిధ రకాల వాద్యాలను ఉపయోగించినా, వైరాగ్య సూచకంగా సాగే ఆ యితివృత్తానికి, ఆ బాణీకి, ఆ రచనకు, అనుగుణంగా వుండేట్లు ఆ వాద్య సంగీతాన్ని రూపొందించడం జరుగుతూంటుంది. ఆకాశవాణిలోను, చలన చిత్రాలలోను అటువంటి గీతాలు వినేటప్పుడు యీ విషయాన్ని మనం గమనించవచ్చు.

మాయామాళవ గౌళరాగంలోను, దాని జన్యమైన నాదనామ క్రియా రాగంలోను ఎక్కువగా తత్త్వగీతాల బాణీలుండడం విశేషం. దీనిని బట్టి వైరాగ్య సంబంధమైన యితి వృత్తాలకు ఆ రాగాలు బాగా నప్పుతాయని చెప్పవచ్చు.

### బాలమురళీగారు ఆకాశవాణిలో పాడిన కొన్ని ప్రసిద్ధ తత్త్వాలు

"వస్తావట్టిదెపోతా వట్టిదే
ఆశయెందుకంట
చేసిన ధర్మము చెడని పదార్థము
చేరును నీ వెంట"
(నాదనామక్రియ)

"మాయలోకమున మమతలు
చెందక మాయను విడవే ఓ మనసా
న్యాయము విడువక అన్యాయము
వీడి గురుచాయనుగాంచవె ఓ
మనసా"
(శంకరాభరణం)

"పరమానంద రహస్యతత్త్వమును
ప్రణవము వినవలెరా
పరిపూర్ణంబై వెలుగుచున్న
సద్భావము కనవలెరా - ఓం....."
(సింధు భైరవి)

"ఈశ్వరాజ్ఞ ఏమో తెలియదు
అది ఎవరెరుగుదురు"
(సింధుభైరవి)




నలభై ఏళ్ళుగా సినీపరిశ్రమ తీరుతెన్నులపై
అధ్యయనం చేసిన రచయిత,
జర్నలిస్టు, నటుడు
**రావికొండలరావు**
రాసిన వ్యాసమిది



# నవ్వుల పంట రామనామాల జంట


సీతారామ్


నల్ల రామ్మూర్తి

కొన్నేళ్ళక్రితం సినిమాల్లో నవ్వుల పంట పండించడానికి ఓ జంట వుండేది. తెలుగు సినిమాలకి సంబంధించి, అదే తొలిజంట, చివరి జంటా అనే చెప్పుకోవచ్చు. ఆ రెండు రామనామాలూ విడగొట్టి చూస్తే ఒక నల్లరామ్మూర్తీ, ఒక సీతారామ్ కనిపిస్తారు. ఇద్దరూ ఓవూరి వాళ్ళు కాదు, ఒక్కసారే సినిమాల్లోకి రాలేదు. కాని సినిమా వూళ్ళో కలుసుకున్నారు, కూడ బలుక్కున్నారు, మిత్రులైనారు. జంటపేర్లలో సీతారామ్‌ది రెండో పేరయినా, సినిమాల్లోకి ముందొచ్చినవాడు అతనే. 'సీతారామ్' అని పేరుగా వేసినా, అందరూ అతన్ని "సీతారామయ్యా" అని పిలిచేవాళ్ళు.

"నా పేరు సీతారామయ్యే. హెచ్. ఎమ్. రెడ్డిగారు సీతారామయ్య అంటే పెద్దవాడనుకుంటారని, 'సీతారామ్' అని పొట్టి చెయ్యమన్నారు. దాందేముంది? చేసేశాను. 'సీత్రామ్' అని పిలిచే వారాయన." అని ఆయన చెప్పేవారు.

"మీ తొలి సినిమా అనుభవం ఏమిటి?" అని ఓసారి అడిగితే -"మంచి అనుభవం. బెజవాడ నుంచి పోతిన శ్రీనివాసరావుగారు 'కాళిదాసు (1940) సినిమాలో వేషం వెయ్యడానికని మెడ్రాసు పంపించారు. ఆ కంపెనీ వాళ్ళు ఉండడానికి బస ఇచ్చారు, తినడానికి భోజనం పెట్టారు. తిరగడానికి నాలుగు నెల్లు జీతం ఇచ్చారు. కాని వేషం ఇవ్వలేదు. ఏమని అడిగితే రాలేదన్నారు. ఈ సినిమాల్లో వేషాలు వేయించుకుని డబ్బులివ్వకుండా పోయేవాళ్ళు ఎక్కువ. నేను వేషం వెయ్యకుండా డబ్బు పుచ్చుకున్న మొనగాణ్ణి అదీ నా తొలి సినిమా అనుభవం. ఓ సినిమా ప్రొడ్యూసరు వేషం వేయించుకుని, డబ్బుకోసం తిప్పాడు. మాటల సందర్భంలో నా తొలి అనుభవం చెప్పానండీ. "మరింకేం- అప్పుడు వేషం వెయ్యకుండా హాయిగా అనుభవించారుకదా, ఇప్పుడు వేశారుకదా, నా సినిమాతో సరిబెట్టేసుకోండి." అన్నాడండి! 'అదీ హాస్యం అంటే' అనుకున్నానండి, కాని హాస్యం కాదు. నిజమే అయిపోయింది" అని చెప్పారు సీతారామ్. 1941లో వచ్చిన 'తెనాలి రామకృష్ణ' సీతారామ్ తొలిచిత్రం. "ఆ సినిమాలో వేస్తున్నప్పుడు అవుడ్డోర్ తీసుకెళ్ళారు. ఎండపోతే, చెట్ల కింద అందరం కూచుండగా నేనో పాట సరదాగా పాడాను. మన పురాణం గురించి, ముస్లింభాయ్ పాడిన పాటన్నమాట. ఆ పాటనాదే. ఏంటంటే - "ధరమ రాజ్‌కి తమ్ముడ గుంభాకర్ణుడు - దమయంత్కి తీస్కెళ్ళి లంకామే పెట్టేతల్కి - అనుమంతుడికీ కోపం వచ్చి, పాతాల్లోకం ఎగ్రి - బెమ్మ ముక్కూ పట్కోని లాగే తల్కి - బెమ్మకి మూడు ముకాలే అయినాయ్ బాబూ హల్లాతూహి" అని, ఆ పాట రెడ్డిగారు విన్నారుగదా," ఒరే సీత్రామ్ - నువ్వు ఆ పాటని ఓ కాగితం మీద రాసి, మూజిక్ డైరెక్టరికివ్వరా. ట్యూన్ కడతాడు." అన్నారు అలాగే చేశాను. సినిమాలకి పాటలు అ0లాగే రాయిస్తారు కాబోలు, నన్ను పాటలు రాయమంటారేమో అని భయం కూడా వేసింది. అయితే రెడ్డిగారు ఆ పాటని 'సత్యమే జయం' అన్న సినిమాలో పెట్టారు. నాకు వేషం ఇచ్చారు, ఆ పాట నా చేతనే పాడించారు. ఇదొక తమాషా అనుభవం కదండీ" అని సీతారామ్ చెప్పారు, నల్ల రామ్మూర్తితో పొత్తు కలియక ముందు అక్కడా అక్కడా వేషాలు వేసినా, 'అగ్ని పరీక్ష'లో ఇద్దరూ కలిసి ఓ 'భాగోతం' ఆడతారు. సీతారామ్ నరసింహస్వామి, రామ్మూర్తి చెంచులక్ష్మీ! వాళ్ళ పాట వాళ్ళే పాడుకున్నారు. 'పల్లెటూరి పిల్ల' నుంచి ఇద్దరూ జంటగా స్థిరపడ్డారు. "చిటపట చినుకుల దుప్పటి తడిపెను తలుపు తియ్యవే భామా" అన్న వాళ్ళు పాడిన పాట ఆకర్షించింది. జంటగా కాకపోయినా విడివిడిగానూ ఇద్దరూ వేశారు. 'బాలరాజు' లో సీతారామ్ "సూడ సక్కని సిన్నది, ఆ మేడ గదిలో వున్నది" అన్న పాట తనే పాడాడు. ముగ్గురు మరాటీలు, రత్నమాల, లైలా మజ్నూ మొదలైన సినిమాల్లో పెద్దవేషాలే వేశాడు సీతారామ్. "ఎన్ని సినిమాల్లో వేసి వుంటారు?" అని అడిగితే "ఎక్కడ లెక్కెడతాం!

ఏదో యేశాను. ఇచ్చింది జేబులో యేనుకున్నాను, ఎంత సంపాయించావంటే, ఏం చెప్తాను? సినిమాలూ అంతే!" అని తేల్చేశారు సీతారామ్ - విసుక్కుంటూ.

ఈ జంట సైకిళ్ళ మీద తిరిగేది. "సినిమా షూటింగులకి వెళ్ళాలంటే కార్లమీద వెళతారు! ఇప్పుడు సైకిలు మీద తిరుగుతారు "- అని అడిగితే, "షూటింగుకి సైకిలు మీదయినా వెళతాను. మాయిల్లు వాహిని స్టూడియోకి దగ్గరే. ఎప్పుడూ సైకిలు మీదనే వెళతాను. నా తోనే సైకిలు! తప్పా?" అని తిరిగి తనే అడిగారు సీతారామ్.

"మాయింటి పేరు 'నల్ల' కాదండి మావూళ్ళో ఇద్దరు రామ్మూర్తులం - నాటకాల వాళ్ళం వుండేవాళ్ళం. నేను నల్లగా వుంటానని నల్ల రామ్మూర్తి అన్నారు. అతను మరీ తెల్లగా వుండడు. ఐనా అతన్ని రామ్మూర్తి అని పిలవలేదు. అదీ నాకు ఆనందం'' అనని నల్ల రామ్మూర్తి చెప్పేవారు. పాటలు, పద్యాలూ పాడడం, కామిక్ రికార్డులు ఇవ్వడం, వేషాలు వెయ్యడం అతని పని. తూర్పు ప్రాంతపు యాసతో అతను ఇచ్చిన 'తూర్పు సావిత్రి' 'తూర్పు రామాయణం' అవార్డులు చాలా పాప్యులర్ అయినాయి. అతనే హీరో, రచయితా అన్నీనూ. 'సావిత్రి'ని రంగస్థలం మీద కూడా బాగా ఆడేవారు. చివరి ప్రదర్శన చాలా ఏళ్ళక్రితం మద్రాసులో జరిగితే, వాణిశ్రీ సావిత్రి పాత్ర వేసింది. సినిమాల్లో చిన్నా చితకా వేషాలు వేసినా, 'పల్లెటూరి పిల్ల'తోనే అతను బాగా తెలిశాడు. నల్లరామ్మూర్తి మార్కు హాస్యం ఏమిటంటే, సీరియస్‌గా మొహం పెట్టి నవ్వించడం! సన్నని గొంతుపెట్టి నవ్వించడం! కె. శివరావు తీసిన 'పరమానందయ్య శిష్యులు'లో రామ్మూర్తి కడుపుబ్బా నవ్వించారు. 'మాయాబజార్' సరేసరి, అందరికీ గుర్తే.



"చెంచులక్ష్మి"లో

"సినిమాల్లో సపోర్టింగ్ యాక్టర్లుంటారండి. అలాగ నేను సపోర్టింగ్ కమేడియన్ గానే వుండిపోయానండి. కారణం ఏంటంటేనండి, నాటకాలకి వెళ్ళిపోతూ వుంటానండి. పనిలేక పోతే మద్రాసులో వుండను. మావూరు వెళ్ళి పోతాను. అంచేత పైకి రాలేక పోయానేమోనండి, ఉంటే మాత్రం పైకి వచ్చేవాణ్ణా - చాల్లెండి' అని నవ్వించేవారు నల్ల రామ్మూర్తి. తెల్లపైజామా, సిల్కు జుబ్బా, కళ్ళజోడుతో కనిపించే నల్లరామ్మూర్తి ఆంధ్రాక్లబ్బులో చెట్ల కింద కూచుని కబుర్లు చెబుతూ నవ్వించేవారు. ఓసారి సీతారామ్ కనిపించగానే - "సీతారామయ్యా - శుభవార్త. నాకు డైరక్షన్ ఛాన్సు వచ్చింది. నువ్వు మంచి వేషం వెయ్యి" అన్నారు. "సంతోషం, థాంక్యూ, నిర్మాతెవరు?" అని సీతారామ్ కనుక్కుంటే, "వెతుకుదాంపద, సైకిళ్ళెక్కి" అని జోక్ చేశాడు. "ఎందుకలా చెప్పావు బే?" అని సీతారామ్ అడిగితే, "నాకు డైరక్షను ఛాన్సు వచ్చిందంటే నువ్వు అసూయ పడతావా లేదా అని చెప్పాను. పడలేదు. నువ్వేం హాస్య నటుడివయ్యా" అని నవ్వించారు రామ్మూర్తి.

"విజయచిత్ర' పత్రికలో ఒకసారి సుప్రసిద్ధ నిర్మాత డి. రామానాయుడు - పాఠకుల ప్రశ్నలకి జవాబులు ఇచ్చారు. అప్పటికే ఆయన రామారావు, నాగేశ్వరరావులతో చిత్రాలు తీసారు. ఓ పాఠకుడు - "మీ అభిమాన నటుడెవరు?" అని ప్రశ్నిస్తే "నల్ల రామ్మూర్తి" అని జవాబు ఇచ్చారు రామానాయుడు!" ఆ గౌరవం చాలదూ! అబ్బో కడుపునిండిపోయింది" అని సంతోషించారు రామ్మూర్తి.

లెక్కకి ఇద్దరూ చాలా సినిమాల్లోనే వేశారు. కాని, ఇద్దరూ లెక్క పెట్టుకోలేదు. "లెక్కపెట్టుకునేంత డబ్బు కూడా సంపాదించలేదండి" అన్నారు రామ్మూర్తి - "మనకో రేటంటూ లేదండి. అభిమానంగా ఎవరు ఎంతిస్తే అంతే తీసుకుంటాం!" అని చెబుతూ, లారెల్ హార్డీ, మార్క్స్ బ్రదర్స్ లాంటి జంట హాస్యం బాగుంటుందనీ - చెప్పే ఆ జంట సిగరెట్టుంటే సిగరెట్టు, బీడీ వుంటే బీడీ ఏదో ఒకటి పీలుస్తూ సైకిళ్ళమీద తిరుగుతూ "తృప్తి"గా కనిపించేవారు. వాళ్ళు కనుమరుగైపోయారు, ఆ హాస్యం మాత్రం కనుమరుగు కాదు...!

**జస్ట్ ఫర్ ఫన్**



విష్ణుమూర్తుల వారు చిరునవ్వు నవ్వుకొంటున్నారు. లక్ష్మీదేవి అడిగింది "ఏమిటో ఆ నవ్వుకు అర్థం?"

"ఆ! ఏముందీ? ఓ భక్తుడికి అర్జెంటుగా ఓ కోటి రూపాయలు కావాల్ట!"

"ఎందుకుట?"

"పెళ్ళి చేసుకుంటాడుట! ఖర్చులకి"

"డబ్బులేని వాడికి పెళ్ళెందుకుట?"

"నేను చేసుకోలేదా? వెంకటేశ్వర స్వామి గెటప్‌లో!" అన్నాడు.

"పోనీ పాపం ఇచ్చెయ్యక పోయారా! రూపాయలే కదా! డాలర్లు కాదుగా".

## తారుమారు

- రచన: టి.వి.సత్యనారాయణ

"ఇచ్చేవాడినే! నా దగ్గరే లేవు!"

"బడాయి"

"నిజం లక్ష్మీ! మన పెళ్ళికి చేసిన అప్పలు తీర్చకుండా భక్తులకు ఇవ్వడం మొదలెడితే కుబేరుడు ఒప్పుకుంటాడా! వూరుకుంటాడా!"

"పోనీ నేనివ్వనా"

"నాకే ఇవ్వలేదు! నా భక్తుడికా! సర్లే!"

"మరే మాలోచించారు!"

"వరకట్న పద్ధతి ప్రవేశపెట్టా! ఇహనుంచీ అన్నీ ఆ అమ్మాయే తెచ్చుకుంటుంది."

"ఆ!"

(అప్పటినుంచి కన్యాశుల్కం పోయి, వరకట్నం అమలులోకి వచ్చింది - రచయిత)

(16-31 జనవరి 2002 "హాసం" సంచికలో పరుచూరి గోపాలకృష్ణ రాసిన 'విమానము నోరు లేని యంత్రము' కథ చదివి, స్పందించి)

రమణగారు సబ్ ఎడిటర్‌గా ఉన్న రోజుల్లో వివిధ విషయాలపై సమాచారం సేకరించి సులభమైన శైలిలో గంభీరమైన వ్యాసాలు రాసేవారు. అమెరికన్ జాజ్ సంగీతం గురించి ఆయన 1958లో ఆంధ్రపత్రిక వీక్లీకై రాసిన వ్యాసం ఇదిగో-




# అమెరికన్ జాజ్ సంగీతం



జాజ్ సంగీతం అంటే అమెరికాలో చెవికోసుకుంటారు. ఒకనాడు చౌకబారు సంగీతమంటూ ఎంతోమంది ఏవగించుకొన్న ఈ జాజ్ సంగీతం ఇంతగా ప్రజానురంజకమైనదంటే దానిలో విశిష్టమైన గుణాలు ఉండి ఉండాలి.

జాజ్ సంగీతం అంటే, ఏమిటో వివరించేముందు ఏది 'జాజ్' కాదో చెబితే కొంత సులభంగా అర్థం అవుతుంది. అమెరికాలో సంగీతం వినటానికి చాలరకాల అవకాశాలున్నవి. ఒక నాణాన్ని ఒక రంధ్రంలో వేసే ఒక రికార్డుతో పాటలు వినిపించే యంత్రాలు వున్నాయి. ఆ యంత్రాలలో ఉండే రికార్డులలో జాజ్ సంగీతం వినిపించదు. మామూలు నృత్య బృందాల వారు ఉపయోగించే దానిలోను ఈ సంగీతం వినిపించదు. చాలామంది సుగమ సంగీతాన్ని, వ్యాపార సంగీతాన్ని 'బృంద సంగీతాన్ని' ఈ జాజ్ సంగీతాన్ని కలిపి ఒకేగాట కడుతుంటారు. కాని అది వాస్తవం కాదు.

'జాజ్' అనే పదం అసలు ఎప్పుడు ఎట్లా పుట్టిందో తెలియదు. అయితే దీనిని గురించి కొన్ని కథలున్నవి. 'జాసర్' అనే ఫ్రెంచి పదం నుంచి పుట్టి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. "జాసర్" అంటే బాతాఖానీ అని అర్థం. మరికొందరి ఉద్దేశం 'జాజ్' అనే పదం అమెరికాలోనే పుట్టి ఉండవచ్చునని, దక్షిణాదిన ఎవరో కార్మికుడు ఎప్పుడో ఒకనాడు ఈ సంగీతం (అప్పటికీ ఈ పేరు లేదు) విని ఉత్సాహాతిశయంతో ఈ సంగీతం వల్ల జనించే ధ్వనికి అనువుగా 'జాజ్' అని అరిచాడని' అప్పటి నుంచి, ఈ సంగీతానికి ఆ పేరు స్థిరపడి పోయిందని వీరి ఊహ. ఏమైనప్పటికీ మొదటి ప్రపంచ యుద్ధాంతం నాటికి ఈ 'జాజ్' అనే మాట అమెరికాలో వినిపించింది. అయితే దానిలో వర్ణక్రమం మాత్రం ఇప్పటికీ చాలారకాలుగా మారింది. మొదట "జే-ఏ-ఎస్"గా, ప్రారంభమై "జే.ఏ.ఎస్.ఎస్", జే-ఎ-టి-జడ్" ఇట్లా చాలా అవతారాలు మార్చి చివరకు ఇప్పుడు "జే-ఏ-జడ్-జడ్" అక్షరాల క్రమంతో "జాజ్"గా చలామణీ అవుతున్నది.

జాజ్ సంగీతంలో జన రంజకమైన లక్షణాలు చాలా ఉన్నవి. ఇది సజీవంగా ఉంటుంది. హాయిగా ఉంటుంది. మొండితేరినట్టుగాను ఉం టుంది. ఒకప్పుడు సనాతనులు దీనిపైన ధ్వజ మెత్తారు. వారిధాటికి తట్టుకుని నిలిచింది. ఈ సంగీతం పద్ధతులు గానీ, ప్రయోజనం గానీ ఏమీ అర్థం చేసుకోలేని వారి దూషణ, తిరస్కారాలను భరించింది. జయించింది. చింకిరిచింకిరి గుడ్డల్లో పుట్టిన ముత్యాలవంటి బిడ్డలను పోలినది జాజ్. ప్రారంభంలో - కాదు - మొదట తనమీద అంతగా ధ్వజమెత్తి, చీదరించుకొన్న వారిని క్రమక్రమేణా తన వైపుకు మరల్చుకోగలిగింది. 50 సంవత్సరాల నాడు జల క్రీడా మందిరాల వద్ద ఆ సరోవరాల అలల మధ్య మాత్రమే వినిపిస్తూ ఉండే ఈ జాజ్ ఈనాడు మెట్టని చోటు లేదు. ప్రాచీన సంగీత సమ్మేళనాలు జరిగిన ప్రఖ్యాత మందిరాలన్నిటిలోనూ నేడు జాజ్ కచేరీలు జరుగుతున్నవి.

జాజ్‌ను గురించి ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఈ సంగీతం చాలా పరిణామానికి లోనయింది. ఈ సంగీతం ఫలానా రోజున ఫలానా ఊళ్ళో పుట్టిందని చెప్పటం కష్టమే గాని ఒక్క సంగతి మాత్రం చెప్ప వచ్చు. అసలు ఈ సంగీతానికి మూలలు నీగ్రో సంప్రదాయాల లోనూ, వారిలో అప్పుడప్పుడు ఉదయిస్తూవచ్చిన చైతన్య రేఖలలోనూ చూడవచ్చును. సజీవమైన, సుగమమైన, లౌకికమైన, వాస్తవికమైన జానపద సంగీతం జాజ్ ప్రారంభమైందనవచ్చును. నీగ్రోజాతి ప్రజలు తమ వెతలను వెళ్ళబోసుకోటానికి, ఆధ్యాత్మికమార్గాన్ని అనుసరించారు. వాళ్ళలో ఉండి ఉండి ఎప్పుడో, ఎందుకో ఆనందం వెల్లివిరిసినప్పుడు ఆ సంతోషాతిశయం పొందిన రూపాంతరమే నాటి జాజ్ సంగీతం, మరి ఈనాడు ఇది అందరి సంగీతం అయింది. అనేక మెలికలు తిరిగింది.

ఎంతో పురోగమించింది. కొత్త కొత్తరీతులు సంతరించుకొన్నది. ఇంకా సంతరించుకొంటున్నది. ఇంకా అభివృద్ధి చెందుతున్నది. అందువల్లనే తొలినాటి నిరాడంబరత్వం దానిలో నేడంతగా కనపడదు. దానికి నిబంధనల సంబంధమైన బంధమేది లేకపోయినా కొన్ని కట్టుబాట్లు జాజ్ సంగీతంలో కుదురుకొన్నవి.

జాజ్ సంగీత లయరీతులు ఆఫ్రికన్ సంప్రదాయానికి చెందినవి. కాగా ఈ సంగీతంలో ఉండే మాధుర్యం, అందలి పొందికవంటి లక్షణాలు విశ్వజనీనమైనట్టివి. పూర్వం - అంటే గ్రంథ విద్యాగందం ఇంకా వెలవక పూర్వం ఆనాటి గాయకులు తమ పూర్వపుడప్పుల వాద్యంతో తమ స్తోత్ర గీతాలాపనలను త్రిపుట తాళయుక్తంగా ఉండే వరుసలను, బొహీమియన్ పోల్కా నృత్యాలను 19 శతాబ్దినాటి క్వాడ్రిల్ అడుగునూ మేళవించి ఒక నవీన సంగీతాన్ని సృష్టించుకున్నారు. ఆ సంగీతమే నేటి జాజ్ సంగీతానికి పునాది అనవచ్చును.



జాజ్ గాయని బిల్లీ హాలిడే

జాజ్ సంగీతానికి ముందున్నది "బ్లూస్" సంగీతం. ఇది స్వచ్ఛమైన నీగ్రో సంగీతం. పాడటానికి చాలా తేలికగా ఉంటుంది. ఈ సంగీతం భావోద్రేక ప్రకటనమే లక్ష్యంగా కలిగినదయినందున మనోభావాలతోపాటు, సంగీత రీతి కూడా మారిపోతుంటుంది.

జాజ్ సంగీతం నిత్యనూతనంగా ఉంటుంది. కాలక్రమేణా కొన్ని కట్టుబాట్లు దీనిలో కుదుర్చుకొన్నప్పటికి ఈ లక్షణం మాత్రం అట్లానే ఉంటూ వచ్చింది. ఇది దీనికి ముఖ్య లక్షణం కూడాను. జాజ్ గాయకుణ్ణి అని చెప్పుకొనే వాడెవడూ కూడా మరొకణ్ణి అనుకరించడు. ఎవరికి వారు ఎప్పటికప్పుడు కొత్తబాణీలను అన్వేషిస్తూ ప్రవేశ పెడుతూనే ఉంటారు.

జాజ్ సంగీతంలో ఇటువంటి విశృంఖలత్వం వల్ల అప్పుడప్పుడూ కొంత చెడు జరిగిన మాట నిజమే. స్వేచ్ఛపేరిట కొంత చౌకబారు సరుకు ఇందులో ప్రవేశించిన మాటకూడా నిజమే. ఇది చాలా నక్పృత్తుగానే జరిగింది. ఎక్కువ సందర్భాలలో జాజ్ సంగీతంకు తమకుగల స్వాతంత్ర్యాన్ని సద్వినియోగమే చేసుకున్నారు. దానికి అర్హులమనిపించుకున్నారు. వారి సామర్థ్యం, వారి ఉపజ్ఞ 'జాజ్'ను సుసంపన్నమైన సంగీతంగా, మరింత ప్రజారంజకమైన కళగా చేయటానికి తోడ్పడినవి.

జాజ్ సంప్రదాయంలో నిబంధనల బంధాలు లేకపోవటం వల్లనే భారతీయుల లోనూ దీనికెంతో మంది భక్తులు, ప్రియులు లభించారు. భారతీయ సంప్రదాయంలో కూడా కళాకారుడికి వుండవలసిన స్వేచ్ఛకే ప్రాముఖ్యం ఉన్నది.

"జాజ్" అనేది విశాలమైనది. ఇందులో న్యూఆర్లియన్సు, డిక్సీలాండ్, రాగ్టయిమ్, బాప్, కూతజాజ్, ప్రోగ్రసివ్ జాజ్ అని అట్లా అనేక రకాలున్నవి. తరచు ఈ సంగీతపు స్వింగ్, "పాపులర్" గీతాల చేరువకు కూడా విస్తరిస్తుంటుంది. ఈ విభిన్న రీతులు జాజ్‌ను మరింత సుసంపన్నం చేయటానికి తోడ్పడినవి. వీటిలో కొన్ని కొంతవరకే తోడ్పడి ఉండవచ్చు. మరికొన్ని ఎక్కువగా ఉపయోగపడి ఉండవచ్చు. మొత్తం మీద ఇవన్నీ కలిసి జాజ్ సంగీతాన్ని ఇప్పుడది ఉన్న బృహత్ రూపానికి తెచ్చినవి. ఒకనాడు జాజ్‌ను చీదరించుకోటంలో కొంత సబబుగా కూడా ఉండక పోలేదు. మరి ఈనాడు ఆ పరిస్థితి కనపడదు. కనపడటానికి అవకాశం లేదు. జాజ్ ఎంతో అభివృద్ధి చెందింది. రసికులైన వారికి నవ్యరసాస్వాదనావకాశం లభింపజేస్తున్నది. స్ట్రావిన్స్కీ, హిండ్‌మిత్ వంటివారని సైతం తన వశం చేసుకోగలిగింది. పురాతన అమెరికన్ ప్రజలు ఏనాడు ఎరుగని, పొందిక, మన్నికగల సంగీతం జాజ్‌పరంగా లభించింది.

ఒకనాటి జాజ్‌గాయకుడు నిరక్షరకుక్షి. ఈనాటి "జాజీయుల" సంగతి అట్లా కాదు. ఎక్కడో ఒకరు తప్ప వీరిలో హెచ్చుమంది గ్రంథస్థ సంగీత సిద్ధాంతాలలో ఆరితేరినవారు. స్వరరచనలో ప్రసిద్ధులు. అటువంటి వారు ఏవైనా మామూలు సూత్రాలను ఉల్లంఘించడం జరిగిందంటే అది అజ్ఞానం వల్ల మాత్రం కాదు. కావాలనే కాదు అట్లా ఉల్లంఘించి ఉండాలి. కొత్త పుంతలు త్రొక్కటానికే అట్లా ఉల్లంఘించి ఉంటారు.

ఆధునిక "అభ్యుదయ" జాజ్ సంప్రదాయం 1940లో ఏర్పాటయింది. అప్పటివరకు మోటుపద్ధతికి అంటి పెట్టుకుని ఉండే వారు. అనంతరం చారీ పార్కర్, డిజ్జీగిలెస్పీ వంటి వారి చేతిలో ఇది కొత్తదారులు తొక్కింది. వుడీ హెర్మన్, స్టాన్‌కెంటన్‌లు ఇంకా దీనిని ముందుకు తీసుకుపోయారు.

డేవ్ బ్రూబెక్ ఇట్లా ప్రయోగాలు చేసిన వాళ్లందరి భావాలు తీసుకొని వాటి అన్నిటిని సమన్వయపరిచి జాజ్‌కు ఒక కొత్త రూపం ఇచ్చాడు. దీనితో జాజ్ సంగీతం మరింత ప్రజానురంజకంగా తయారైంది. ఇప్పుడు జాజ్ భక్తులే గాక తద్య మనకు సైతం దాని రసాను భూతి సులభసాధ్యం అయింది. ఈ 'అభ్యుదయ' జాజ్ సంగీతం పట్ల కూడా ప్రజలలో పలు విధాలమైన భావాలు కలిగినవి. డిక్సీలాండ్ రకం సంగీత ప్రియులు, ఇంకా కొందరు సనాతన జాజీయులు ఇదేమీ బాగాలేదన్నారు. కాగా పూర్వం జాజ్ అంటే వట్టి చెత్త అని ఛీదరించుకునే వారు ఈ అభ్యుదయ జాజ్ రీతి విన్న తరువాత ఫరవాలేదు జాజ్‌లో కూడా వినదగింది ఉన్నదనుకొనే దాకా వచ్చారు.

జాజ్‌లాగా నిత్యనూతనంగా మారిపోతూ ఉండే జాజ్ వంటి కళ భవిష్యత్తులో ఎట్లా ఉండబోతుందో చెప్పటం అసాధ్యమైన సంగతి. అయితే ఒకటి మాత్రం నిశ్చయం. జాజ్ సంగీతం బాగా కుదురుకొన్నది. ఇక మనుగడకై కాళ్లు త్రొక్కుకోవలసిన అవస్థ ఉండదు. ఆ దశ ఎప్పుడో దాటిపోయింది. జాజీయులు బిడియ పడవలసిన స్థితి దాటిపోయింది. ఈనాడు అన్నిరకాల సంగీతాల లాగానే ఇదీ ఒక సంగీత కళ. దీనికి కొన్ని విశిష్ట లక్షణాలంటూ ఏర్పడినవి. దానికి ఒక కళాధిష్ఠాన దశ ఉన్నది. జాజ్ ఏనాడూ నిలవ నీరులాగా ఒకే చోట నిలిచి ఉండలేదు. అన్నిటికంటే కూడా మానవునిలో సహజంగా ఉంటే సంగీత రసానుభూతికి కావలసిన మూల లక్షణాలు జాజ్‌లో ఉన్నవి. మిగతా ఎన్ని మార్పులు జరిగినా ఈ ముఖ్య లక్షణాలు మాత్రం మారలేదు. అందువల్లనే ఈనాడు జాజ్ సంగీతం నిత్యాధికమైన ఆసక్తిని సంగీత ప్రియులలో రేకెత్తిస్తున్నది.



**"ఈ అనంత విశాల ప్రపంచంలో భగవంతుడనే వాడొకడున్నాడని వయొలిన్ తంత్రులపై నీవు జాలు వార్చిన సంగీతం విన్న తరువాత పరిపూర్ణంగా విశ్వసిస్తున్నాను."**

**ఈ మాటలు అన్నదెవరో కాదు ప్రఖ్యాత సంగీత విమర్శకుడు, పరిశోధకుడు, రచయిత "ఆల్ఫ్రెడ్ ఐన్‌స్టీన్". అదీ ఏదో తలపండిన సంగీత విద్వాంసుడితో కాదు. ఓ పధ్నాలుగేళ్ల కుర్రవాడితో అంటే అంతా ఆశ్చర్యపోవచ్చు. కాని నిజం. ఆ కుర్రవాడి పేరే "యహుది మెనుహిన్".**

# వయొలిన్‌కే రాగాలు నేర్పిన యహుది మెనుహిన్



ఈయన పేరు చెప్పగానే మనకు వెంటనే వయొలిన్ గుర్తొస్తుంది. పాశ్చాత్య సంగీత ప్రపంచంలో ఆయన అగ్రగణ్యులు. మార్చి 12, 2002కు ఆయన మృతి చెంది మూడేళ్లవుతుంది. తన 75 ఏళ్ల కళా జీవితంలో వయొలిన్‌పై ఆయన చేసిన సంగీత జైత్రయాత్ర ప్రపంచ వ్యాప్తంగా సాగింది. అమెరికాకు వలసపోయిన రష్యన్-జేవిష్ దంపతులకు 1916 ఏప్రిల్ 22న న్యూయార్క్‌లో యహుది మెనుహిన్ పుట్టారు. తల్లిదండ్రులు పెట్టిన అసలు పేరు 'మెన్‌చిన్'. కానీ వ్యవహారంలో మెనుహిన్ అయింది. యహుది రెండవ పుట్టిన రోజుకు కొద్దిరోజుల ముందు వారి కుటుంబం శాన్‌ఫ్రాన్సిస్‌కో చేరుకుంది. ఇంట్లో సంగీత వాతావరణం ఉండేది. కచేరీలకు మెనుహిన్‌ను తీసుకెళ్ళే వారు తల్లిదండ్రులు. నాలుగేళ్ల వయస్సున్న యహుది ఒక సంగీత సభకు వెళ్లినప్పుడు ఆకర్షితుడై వయొలిన్ కొనిపెట్టమని తండ్రిని కోరాడు. అలా ఆనాడు అందుకున్న వయొలిన్ అతని జీవితం కడదాకా సహవాసిగా ఉండిపోయింది.



భార్య,కుమార్తెలతో మెనుహిన్

మెనుహిన్ వయొలిన్ వాదనలో సిగ్మండ్ ఆంకార్ వద్ద వయొలిన్ పాఠాలు నేర్చుకున్నాడు. 18 నెలల తరువాత పెర్సింజర్ వద్ద శిష్యరికం చేసి మ్యూజిక్ టెక్నిక్స్‌లో ఆరితేరారు. లాంఛన ప్రాయంగా యహుది తొలికచేరీ 7వ ఏట 1924 ఫిబ్రవరి 29న ఆక్లాండ్ ఆడిటోరియంలో జరిగింది. ఈ సభలో బెరియాట్ "సీన్ డి బాలెట్"ను వాయించగా గురువు పెర్సింజర్ పియానోతో సహవాద్యం అందించారు. ఆ తరువాత 1925లో గురువు పెర్సింజర్ వెంట న్యూయార్క్ వెళ్లిన మెనుహిన్ తన శిష్యరికాన్ని కొనసాగించారు. 1926 జనవరి 17న గురుశిష్యులిరువురూ ఇచ్చిన సంగీత కచేరీ ఓ మైలు రాయి వంటిది.

1926లో తల్లిదండ్రులతో బాటు తన నివాసాన్ని యూరప్‌కు మార్చిన మెనుహిన్ పారిస్‌లోని ప్రఖ్యాత రుమేనియన్ వయొలిన్ విద్వాంసుడు కంపోజర్ జార్జ్ ఎనెస్కో వద్ద వయొలిన్ అభ్యాసం ప్రారంభించారు. అయితే యూరప్‌లో యహుది మొదటి కచేరీ 1927 ఫిబ్రవరి 6న పారిస్‌లో జరిగింది. ప్రసిద్ధ లామరెక్స్ ఆర్కెస్ట్రా వారు ఈ కచేరీని ఏర్పాటు చేయడం విశేషం. ఆ తరువాత ఏడెనిమిది సంవత్సరాల పాటు యూరప్‌లోని అన్ని ప్రధాన నగరాల్లోనూ సంగీత కచేరీలు చేశారు. మెనుహిన్ గ్రామఫోన్ రికార్డులివ్వడం మొదలు పెట్టింది 1928లో. 1932లో ఆయన లండన్‌లోని హెచ్.ఎం.వి స్టూడియోలో 'ఎల్గార్ వైలిన్ కాన్‌చెటో'ను రికార్డు చేసినప్పుడు ఎల్గార్ వయసు 75 కాగా మెనుహిన్ వయసు 16 ఏళ్లే కావడం గమనించదగిన

విషయం. గడచిన శతాబ్దిలోని గొప్ప స్వరకర్తలైన ఎల్గార్ "కాన్‌చెటో"ను క్రైస్లర్ కోసం రచించారు. క్రైస్లర్‌కే అంకిత మిచ్చాడు. క్రైస్లర్ వాయించగా ఆయన విన్నాడు కూడా. కాని తన కాన్‌చెటోను మెనుహిన్ వాయించగా ఓ అలౌకికానందానభూతికి లోనైనాడు. అంతగొప్ప వయోలిన్ వాదనాన్ని తాను అంతకుముందు ఎన్నడూ వినలేదని కితాబునిచ్చాడు. ఆరేళ్ల వయసులో కంపోజింగ్స్ ప్రారంభించి అద్భుతంగా పియానోతో కచేరీలు చేసిన మొజార్ట్‌ను ఆరాధించినట్లుగానే మెనుహిన్‌ను ఆరాధించారు.

మెనుహిన్ 11 ఏళ్ల వయసులో ఒకసారి న్యూయార్క్‌లోని సింఫోని ఆర్కెస్ట్రాతో కలిపి బీథోవెన్ వైలిన్ కాన్‌చెటోను వాయించినప్పుడు ఆ స్వరవిన్యాసానికి శ్రోతలంతా నివ్వెరపోయారు. వయోలిన్‌ను అంతగొప్పగా పలికించడం ఎలా సాధ్యమైందని నిర్విణ్ణులైపోయారు. కచేరి ముగింపుకు వచ్చే సరికి ఆర్కెస్ట్రాలోని కొందరు కళాకారులు ఆనందోద్వేగాలను తట్టుకోలేక ఏడ్చేశారు. శ్రోతలను ఇంత తారాస్థాయికి తీసుకెళ్లడం అంటే అది అంత సులభ సాధ్యం కాదు. దానిని అతి పిన్న వయస్సులోనే సాధించిన ప్రతిభాశాలి మెనుహిన్.

న్యూయార్క్‌కు తిరిగివచ్చిన తరువాత బ్రూనో వాల్డర్‌తో కలిసి సంగీత కచేరీలు చేస్తూ ప్రపంచ పర్యటన చేశారు. 13 దేశాల్లోని 73 నగరాల్లో ఆయన చేసిన కచేరీలు ఒక్కొక్కటి వంద కచేరీలకు మించిన పేరు తెచ్చి పెట్టాయి. రెండవ ప్రపంచ యుద్ధంలోకి అమెరికా ప్రవేశించిన తరువాత సైనికుల మనోల్లాసానికి గాను ఉత్తర, దక్షిణ, అమెరికా, పశ్చిమదేశాలు, యూరప్‌లలో 500 పైగా సంగీత కచేరీలు చేశారు. ఆ కాలంలో బయట చేసిన కచేరీల ద్వారా సేకరించిన మొత్తాన్ని యుద్ధ పీడితులై నష్టపోయిన వారి సంక్షేమార్థం విరాళంగా ఇచ్చారాయన. ఈ సేవలకు బ్రిటన్, ఫ్రాన్స్, పశ్చిమజర్మనీ, బెల్జియం, గ్రీసు ప్రభుత్వాలు ప్రతిష్టాత్మక పురస్కారాలతో సన్మానించారు.

1943, 44లలో ఇంగ్లాండ్ పర్యటించి బార్టోక్, బి.బి.సి.ల ఆర్కెస్ట్రాలతో కచేరీలు చేసిన మెనుహిన్ 1944లోనే పారిస్‌లోని ఒపేరాలో కచేరీ చేశారు. 1945 మాస్కోలో తొలిసారిగా పర్యటించి డేవిడ్ ఒయ్‌స్ట్రాక్‌ను కలుసుకున్నారు. 1962లో మరోసారి మాస్కోలో పర్యటించి అక్కడి వయోలిన్ మెస్ట్రో 'షోస్తకోవిచ్'తో సంగీతం గురించి చర్చలు జరిపారు. 1956లో గాస్టాడ్ ఫెస్టివల్‌ను



రవిశంకర్‌తో మెనుహిన్

స్విట్జర్లాండ్‌లో నెలకొల్పి 1957లో సంగీత ఉత్సవాలను నిర్వహించారు. బాత్ ఫెస్టివల్స్‌ను 1959 నుండి 1968 వరకు మెనుహిన్ నేతృత్వంలోనే నిర్వహించారు. ఈ ఉత్సవాల్లో భారతీయ సంగీతకారుడైన "జానీ డాంకోవర్త్"చే జాజ్ సంగీతాన్ని ప్రదర్శింప జేశారు. 1966లో మెనుహిన్ "కోసీఫాన్‌టుటీ" సిబాత్ రాయల్ థియేటర్‌లో ప్రదర్శించారు. ఆ తర్వాత 1967, 68లో మెజార్ట్ ఒపేరాలకు స్థానం కల్పించి సంగీత ఉత్సవాలను నిర్వహించి 1969 నాటికి విండ్‌సర్ ఫెస్టివల్స్‌కి జాయింట్ డైరెక్టర్‌గా ఎంపికైనారు.

1963లో ఎన్నేళ్లుగానో తాను అనుకుంటున్న ప్రాజెక్ట్‌ను ప్రారంభించారు. అది పిల్లలకోసం సంగీత శిక్షణనిచ్చే పాఠశాల. లండన్‌లో ప్రారంభమైన ఈ మ్యూజిక్ స్కూల్ 1964లో దక్షిణ లండన్‌కు మూర్చబడింది. ఈ స్కూల్‌లో విజిటింగ్ ఇన్‌స్ట్రక్టర్స్‌గా ఎందరినో పిలిపించే వాడాయన. వారిలో మన సితార విద్వాంసులు రవిశంకర్ కూడా ఉన్నారు.

యహుది మెనుహిన్ తన సమకాలికులైన, నవతరానికి చెందిన వారైన ఎందరినో ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రభావితం చేశారు. అలాంటి వారిలో బ్లాబ్, బార్టోక్, ఫ్రాంక్ మార్టిన్, లెన్నాక్స్ బర్కెలీ, మాల్కం విలియంసన్, పానుఫ్నిక్, హోవానెస్, రైనైరే, మిల్హాడ్, మాక్స్‌వెల్ డేల్స్, నికోలాస్ మావ్, ఆలివర్ నూసెన్ తదితరులున్నారు. మెనుహిన్ ఇచ్చిన రికార్డులు లెక్కలేనివి.

యహుది మెనుహిన్‌కు రవిశంకర్ ద్వారా భారతదేశంతో ప్రత్యేకానుబంధం ఏర్పడింది. 1952లో అప్పటి ప్రధాని నెహ్రూ ఆహ్వానంపై మొదటిసారిగా ఇండియా వచ్చారు. అప్పుడే రవిశంకర్ సితార వాదన విన్నారు. అప్పటినుండి మొదలైన రవిశంకర్ సహచర్యంతో భారతీయ సంస్కృతిని అధ్యయనం చేశారు. తొలి పర్యటనలోనే కచేరీలు చేసి 74,000 డాలర్లు సేకరించి క్షామ నివారణకు సమర్పించారు. ఆ తరువాత నాలుగైదు సార్లు మనదేశానికి వచ్చిన మెనుహిన్ 1964లో నెహ్రూ మరణం తరువాత ఢిల్లీ వచ్చి ఆయనకు శ్రద్ధాంజలిగా కచేరీ చేశారు. భారతదేశంలోనే వయొలిన్ విద్వాంసులైన ఎం.ఎస్.గోపాలకృష్ణన్, లాల్‌గుడి జయరామన్, ఎల్.సుబ్రహ్మణ్యం, ఎల్.శంకర్ వంటి వారు మెనుహిన్‌ను ఆదర్శంగా తీసుకున్న వారే. అయితే వీరందరినీ ఆయన పాశ్చాత్య సంగీతాభిమానులకు పరిచయం చేశారు.

గ్రేట్ బ్రిటన్ ఆర్ట్ కౌన్సిల్ ఆర్థిక సహకారంతో "లివ్ మ్యూజిక్ నౌ" అనే ప్రాజెక్టును ప్రారంభించిన మెనుహిన్ ఎందరో యువ సంగీత కారులను ప్రోత్సహించారు. "ఈస్ట్ మీట్ వెస్ట్" అనే తన ఆల్బంలో భారతీయ సంగీత సంప్రదాయాలను మిళితం చేయడంలో మెనుహిన్‌కు మన పట్ల ఉన్న అభిమానం వ్యక్తమవుతుంది. అయితే 70 దశకములోనే కచేరీలు చేయడం మానుకున్నారాయన.

మెమహిన్ సంగీత ప్రతిభను దేశ దేశాలు తమ అవార్డులతో గౌరవించాయి. నెహ్రూ ఇంటర్నేషన్ అండర్ స్టాండింగ్ అవార్డు, ఫ్రాన్సు నుండి గౌరవ డాక్టరేటు, జర్మన్ వారి ఆర్డర్ ఆఫ్ మెరిట్, బ్రిటన్ వారి రాయల్ ఫిలార్మోనిక్ సొసైటీ గోల్డ్ మెడల్, రామన్‌మెగసేసే అవార్డు, కేంద్ర సంగీత నాటక అకాడమి ఫెలోషిప్ వంటివి వాటిలో కొన్నే. 1965 తరువాత ఆయన సేవలకు గుర్తింపుగా బ్రిటిష్ ప్రభుత్వం "సర్" బిరుదు నిచ్చింది.

మెనుహిన్ 1977లో తన ఆత్మకథను 'అన్‌ఫినిష్డ్ జర్నీ'గా ప్రచురించుకున్నారు. ఇంకా 'సిక్స్ లెసన్స్ విత్ యహుది మెనుహిన్' (1970) "థీమ్ అండ్ వేరియేషన్స్" (1972) అనే రచనలు కూడా ఆయనవే. ఆ మహనీయుడు 1999 మార్చి 12న మృతి చెందారు. ఆ వార్త వింటూనే రవిశంకర్ నివాళులర్పిస్తూ "ప్రపంచమే ఒక మహోన్నత సంగీతజ్ఞుణ్ని, మానవతా వాదిని, సహృదయుడిని కోల్పోయింద"న్నారు.

ప్రపంచ సంగీత చరిత్రలో ఒక మొజార్ట్, ఒక హైడెన్, హైఫెట్జ్, ఒయ్‌స్ట్రాక్, క్రైస్లర్‌ల వరుసలో నిలువదగిన ఒకే ఒక వయొలిన్ మెస్ట్రో యహుది మెనుహిన్.

-హెచ్.రమేష్‌బాబు

# న్యూస్ వ్యూస్

## టీవీ సీరియల్‌గా కన్యాశుల్కం



నూరేళ్ల క్రితం రాసినా కన్యాశుల్కం ఇప్పటికి ప్రజాదరణ కోల్పోలేదు. రమణమూర్తి బృందం ధర్మమాని కన్యాశుల్కం నాటకం ఎప్పటికి ప్రజల్లో నానుతూనే ఉంది. ఇప్పుడు వైజాగ్ సిటీ కేబుల్ ద్వారా విశాఖపట్నం, విజయనగరం వాసులకై 26 ఎపిసోడ్ల టీవీ సీరియల్ "కన్యాశుల్కం" గత పక్షం నుండి ప్రారంభమయింది. ఆరుద్ర రాసిన స్క్రిప్టు ఆధారంగా రావి కొండలరావు దర్శకత్వం వహిస్తున్న ఈ సీరియల్‌లో గిరీశం పాత్ర పోషిస్తున్నది - గొల్లపూడి మారుతీరావు!

## షగుఫ్తగీ




ఒకరు సాహిత్యంలో ఉద్దండులైతే మరొకరు సంగీతంలో. వీరిద్దరూ కలిస్తే ఇక సంగీత, సాహిత్యాభిమానులు ఆనందమే. షగుఫ్తగీ ద్వారా రచయిత కైఫీ అజ్మీ, సంగీత దర్శకుడు ఖయ్యాంల అపూర్వ కలయిక జరిగింది. షబనా అజ్మీ వ్యాఖ్యానంతో ప్రారంభమయ్యే ఈ ఆల్బమ్ చక్కటి సాహిత్యం, అద్భుతమైన మెలోడీతో రసజ్ఞులైన శ్రోతల మనస్సులను ఆనంద డోలికలలో ఊయల లూగిస్తుంది. కైఫీ అజ్మీ ఓ ప్రైవేట్ ఆల్బమ్‌కు సాహిత్యాన్ని సమకూర్చడం ఇదే మొదలు కాగా మ్యూజిక్ టుడే సంస్థ ఈ ఆల్బమ్ విడుదల చేసింది.

## రచయితగా ఇళయరాజా



సినీ సంగీత ప్రపంచంలో ఆయనో సంచలనం. ఇప్పటి తరానికి ఆయనో పెదబాల శిక్ష. ఆయన కేవలం సంగీత దర్శకుడే కాదు. పాడుతాడు, కవిత్వం రాస్తాడు. లండన్ సింఫనీకి సంగీతాన్ని అందించటం కోసం ఎంపికైన తొలి భారతీయుడు ఆయనే. ఆయనే ఇళయరాజా! ఇటీవల ఆయన రాసిన రెండు పుస్తకాలు చెన్నైలోని మ్యూజిక్ అకాడమీ హాలులో సినీ రంగంలోని అతిరథుల సమక్షంలో విడుదల చేసారు. తన భావాల అలలుకు అక్షర రూపాన్నిచ్చిన తుళికడల్ (బొట్టు సముద్రం), సినీ సంగీత ప్రస్థానంపై రాసిన పాల్‌నిలాపాదై (పండు వెన్నెల బాట) అనే ఈ రెండు పుస్తకాలు ఇళయరాజాలోని మరో కోణాన్ని ఆవిష్కృతం చేస్తాయి.

## మళ్ళీ హాలివుడ్‌కు వస్తున్న మేరియా



"గ్లిటర్" ఫ్లాప్ అయిన తర్వాత పాప్‌స్టార్ మేరియాక్యారీ "స్వీట్ సైన్స్" అనే చిత్రంలో నటించటానికి సంసిద్ధత తెలిపింది. బాక్సింగ్ మేనేజర్‌గా ఆమె నటిస్తున్న ఈ చిత్రం మెగ్‌రిన్ నటిస్తుండగా నిర్మాణంలో ఉన్న మరో చిత్రంలాగానే ఉంటుందని హాలీవుడ్ పరిశీలకుల అంచనా. రెండు సినిమాలకు కథ ఒకటే కావడం దీనికి కారణం. క్యారీతో 'వైస్‌గార్ల్' చిత్రాన్ని నిర్మించిన ఆంథోని ఎస్‌పోసిటో ఈ 'స్వీట్ సైన్స్' చిత్రానికి కూడా నిర్మాత. గత నెలలో క్యారీ "అలీ మెక్‌బెల్"అనే టీ.వీ. షోలో సహనటిగా చేయడం విశేషం.

## మ్యూజికల్‌కు రెహమాన్ సంగీతం



ఎ.ఆర్.రెహమాన్‌కు తన ప్రతిభను కనబరిచే మరొక అవకాశం వచ్చింది. లండన్ నాటక రంగంపై జూన్ నుండి ప్రదర్శించబోతున్న 'బాంబేడ్రీమ్స్' అనే మ్యూజికల్‌కు సంగీతం సమకూరుస్తున్నది రెహమానే. భారీ ఎత్తున మ్యూజికల్స్ నిర్మించే లాయిడ్ వెబర్ బాలీవుడ్ సినిమాల వల్ల ఇన్‌స్పైయిరయి తయారు చేస్తున్న ఈ మ్యూజికల్‌లో ప్రియా కాళిదాస్, రజా జాఫ్రీ నటిస్తున్నారు.

## జగ్జీత్ సింగ్ సంగీత జగత్తు

అగ్రశ్రేణి గజల్ గాయకుడు జగ్జీత్ సింగ్ లయన్స్ క్లబ్‌కు నిధులు సమకూర్చడం కోసం గత పక్షం ఫిబ్రవరి 23న హైదరాబాద్‌లో కచేరీ చేసారు. హోష్ వాలోంకా ఖబర్ క్యా.... బేహుది క్యాచీజ్ హై వంటి రొమాంటిక్ గీతాలతో బాటు ప్రధాని అటల్ బిహారీ వాజ్‌పేయి స్వీయరచన సంవేదనాను ఆర్ద్రంగా ఆలపించి నగర వాసుల మనస్సులను రంజింప చేశారు. టాటా టెలీ సర్వీసెస్ వారి సౌజన్యంతో ఈ కార్యక్రమం సాగింది.

## ఉవాచ



నన్ను లెక్చరర్‌గా చూడటానికి ఆడియన్స్ ఎక్కువ ఇష్టపడుతున్నారు. అయినా శ్రీకృష్ణుడు పాత్ర ఎన్.టి.ఆర్.కు మొనాటిని ఎలా అవుతుంది?

-ధర్మవరపు సుబ్రమణ్యం



ప్రకృతిలోంచి వినవచ్చే శబ్దాలే.... అంటే పక్షుల కిలకిలలు, కార్లమోత, వాహనాల శబ్దాలు, పిల్లవాడి ఏడుపు... ఇవే నాకు కొత్తకొత్త బాణీలు ఇస్తాయి.

-చక్రి (సంగీత దర్శకుడు)



మూవర్స్ అండ్ షేకర్స్ ద్వారా చిన్ని తెరపై నెం.1గా వెలిగిపోతున్న శేఖర్ సుమన్ పాప్‌సింగర్ అవతారమెత్తు తున్నారు. వెండి తెరపై నటునిగా, బుల్లితెరపై యాంకర్, నటునిగా నెం.1 స్థానంలో వెలుగొందుతున్న ఆయన పాప్ సింగర్‌గా కూడా నెం.1గా వెలుగుతానని అంటున్నారు.



పలు జింగిల్స్, ఆశాభోంస్లే, కల్నల్ కజిన్స్‌తో కొన్ని రీ-మిక్స్‌లకు పనిచేసిన లెస్లీ ల్యూయిస్ ఇ-నివాస్ చిత్రం 'దమ్' ద్వారా ప్లేబాక్ సింగర్‌గా మారుతున్నారు.

# జంతు ప్రపంచం స్పెషల్



తన పెంపుడు చిలకకు కష్టపడి జోకులు చెప్పట మెలాగో నేర్పించి... కష్టాన్ని సొమ్ము చేసుకుందా మన్న ఉద్దేశ్యంతోను, తన అదృ ష్టాన్ని పరీక్ష చేసుకోవడం కోసం చిలకతో బయట పడ్డాడు చిన్నారావు. వీధిలో ఒక చోట కూర్చుని "ఇది మామూలు చిలక కాదండీ... జోకులు చెప్పే చిలకండీ" అంటూ అరవసాగేడు.

"అలాగా... మేం పందెం కాస్తాం... ఒకటికి పది యిస్తాం... ఏదీ నీ చిలక చేత జోకులు చెప్పించు చూద్దాం." అన్నారు కొంతమంది ఆ గుంపులోంచి.

"సర్లే... అదే మాట మీద నిలబడండి. పందెం మాట మర్చిపోకండి..." అన్నాడు చిన్నారావు. ఎంత ప్రయత్నించినా చిలక చేత జోకులు కాదు కదా.... కనీసం ఒక్కమాట కూడా పలికించలేక పోయాడు చిన్నారావు. పందెం ఓడిపోయి అక్కడి నుండి వెళ్ళిపోతూ దార్లో "నీ కసలు బుద్ధి ఉందా లేదా? అలా బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడకుండా ముంగిలా అలా వుండి పోయావేం? నీ వల్ల చూశావా పందెం ఓడిపోయాను..." చిలకతో అన్నాడు చిన్నారావు కోపంగా.

"ఇవ్వాళ్టికి పోనిస్తూ... రేపు మనం ఒకటికి ఏభై గెలుచుకుందాంలే" బదులు పలికింది చిలక.






జొన్నకంకి పొడుచుకుని తింటోంది కోడి. అంతలో మేక ఒకటి వచ్చింది. కంకి గురించి రెండూ పోట్లాడుకున్నాయి. కంకి పట్టుకుని పారిపోయింది కోడి.

"ఇంకెన్నాళ్ళులే నీ సంబరం.... సంక్రాంతి వస్తోందిగా..." అంటూ పళ్ళు కొరికింది మేక.



శీతాకాలంలో పక్షులన్నీ దక్షిణ దిశగా వలసపోతున్నాయి. "ఆ పెద్ద పక్షి వెనకాలే ఎగురుతూ ఎప్పుడూ దాన్నే అనుసరించాలా మనం?" అడిగింది ఓ చిన్న పక్షి ఒళ్ళు మండి.

"తప్పదు మరి.. రూట్‌మ్యాప్ దాని దగ్గరే వుంది...." చెప్పింది మరో పక్షి ప్రశాంతంగా.



ఓ పెద్ద మనిషి చిలకను కొని దానికి మాటలు నేర్పుదా మని ప్రయత్నిస్తున్నాడు.

"హల్లో... హల్లో ... అని మళ్ళీ మళ్ళీ చెబుతున్నాడు.

నిద్రపోతున్న ఆ చిలక ఒక కన్ను తెరచి.... "ఇందాకటి నుంచి చూస్తున్నాను. ఏంటి చెవిలో ఒకటే గోల? లైన్లు బిజీగా వుండి వుంటాయ్... తర్వాత ట్రై చెయ్" అని చెప్పేసి పడుకుంది.



ఓ సర్కస్ యజమాని బార్‌కెళ్ళాడు. అక్కడ తిరగేసిన గిన్నెమీద ఓ బాతు డాన్సు చేయడం చూసి ముగ్ధుడయి పోయాడు. అలాటి బాతు తన సర్కస్‌కి పెద్ద అట్రాక్షన్ అవుతుందని అంచనా వేసి, హోటల్ యజమాని దగ్గరికి వెళ్ళి "పదివేలు ఇస్తాను, మారు మాట్లాడకండి బాతు నమ్మేయ్" అన్నాడు.

పదివేల రూపాయల బాతును చంకన పెట్టుకుని సర్కస్‌లో తక్కిన వాళ్ళకి బాతు ఆట చూపించ బోయేడు. బాతు డాన్స్ కాదు, కదా కదలను కూడా కదలలేదు. ఒళ్ళు మండి హోటల్ యజమాని దగ్గరకు వచ్చి తిట్టిపోసాడు. "ఆ పాత్ర కింద కొవ్వొత్తి వెలిగించి పెట్టకపోతే ఎలాగండి బాబూ?" అంటూ నెత్తికొట్టుకున్నాడు హోటల్ వాడు.



హోరాహోరీగా జరిగిన వేలం పాటలో ఓ పెద్దావిడ మైనా పక్షిని కొనుక్కుంది. "ఈ పక్షి బాగా మాట్లాడు తుందని నమ్మొచ్చా...." అంది ఆవిడ. "ఇంకా నమ్మకపోతే ఎలా మేడమ్? ఇందాకట్నుంచి మీతో పోటీ పడి వేలం పాట పాడింది ఎవరనుకుంటున్నారు?" అన్నాడు వేలం వేసిన వ్యక్తి కూల్‌గా.

# జంతు ప్రపంచం స్పెషల్



"మా గుర్రం చాలా తెలివైందిరా... దానికి అన్నీ భలేగా తెలుసు...."

"మంచిదేగా...."

"ఏం మంచి... ఎప్పుడైనా ఎత్తునుంచి దూకాల్సి వస్తే అది ఆగిపోయి నన్ను ముందుకి తోస్తుంటే....!?"



టీవిలో "మా అమ్మాయితో ఫుల్ ఎపిసోడ్ వస్తుంటే చూడాలని ఉందోయ్. ఎంత ఖర్చయినా ఫరవాలేదు. ఏ ఛానల్‌లో ట్రై చేస్తే బెటరంటావ్?" అన్నాడో కోటీశ్వరుడు తన కూతురి ఫోటోను చూపిస్తూ.

"డిస్కవరీ ఛానల్ అయితే బెటరనుకుంటా సార్!?" అన్నాడా విలేఖరి ఆ అమ్మాయి ఫోటో చూశాక.



ఓ ఆకతాయి సిటీ బస్సుని ఆపి డ్రైవర్‌తో "ఏంటి... బస్సు రకరకాల జంతువులతో కిటకిటలాడి పోతున్నట్టుంది" అని వేళాకోళంగా అడిగేడు.

"కోతి ఒక్కటి తక్కువైనట్టు కనిపిస్తోంది... రా... తొందరగా ఎక్కేయ్..." అంటూ చురక తగిలించాడు బస్సు డ్రైవర్.





సెలవుల్లో విహారయాత్రకని వచ్చిన వాళ్ళు తన గుర్రానికి ఏమైనా పెడతారేమోనన్న భయంతో పాలానికున్న కంచెకి ఓ చిన్న సైన్‌బోర్డు తగిలించాడొకాయన.

"రొట్టెలు... కేకుల్లాంటివి గుర్రం చేత తినిపించ వద్దు" అని సైను బోర్డులో రాసి పెట్టాడు. కొద్ది సేపటికి చూస్తే ఆ సైను బోర్డు కింద యిలా రాసుంది. "ఈ పైనున్న నోటీసుని ఎవరూ పట్టించుకోనవసరం లేదు - ఇట్లు గుర్రము".



చలికాలం రోజుల్లో ఉదయాన్నే చెర్రీ పళ్ళకోసం చెట్టు ఎక్కుతోంది ఓ నత్త. అది చెట్టు ఎక్కడం చూసిన ఓ కుమ్మరి పురుగు "ఎందుకు అనవసరంగా ఎక్కుతావ్. నీ సమయం అంతా వృధా చేసుకుంటున్నావ్ తెల్సా.... పళ్ళు లేవు కదా..." అంది.

"నేను పైకి ఎక్కేటైమ్‌కి వస్తాయిలే".. అన్నది నత్త ఆశగా పై పైకి పాకుతూ.



అన్ని విషయాలు తెలుసు కోవాలని ఆత్రుతగా వున్న చిన్న ఒంటె అడుగుతున్న ప్రశ్నలన్నింటికి సమాధానాలు చెబుతోంది పెద్ద ఒంటె.

"మనకు రెండు మూపులెందుకు?" అడిగింది చిన్న ఒంటె

"మనం రోజుల తరబడి... వారాలతరబడి ఎడారుల్లో ప్రయాణిస్తుంటాం కదా... మనకు కావలసిన నీళ్ళని మూపుల్లో దాచుకోటానికి..." చెప్పింది పెద్ద ఒంటె.

"మనకు పొడవైన కనురెప్పలెందుకు?" మళ్ళీ ఆత్రంగా అడిగింది చిన్న ఒంటె.

"మనం ఎడారుల్లో వెళ్తున్నప్పుడు ఇసుక తుపానులు అవీ సంభవించవచ్చును కదా.... మన కంట్లో ఇసుక పడకుండా..." చెప్పింది పెద్ద ఒంటె.

"మన కాళ్ళేంటి అలా దుంపలు దుంపల్లా అంత అసహ్యంగా వున్నాయేంటి?" అడిగింది పిల్ల ఒంటె.

"మన కాళ్ళు అలా వుండబట్టే మనం ఎడారుల్లో అంత వేగంగా నడవ గలుగుతున్నాం" చెప్పింది పెద్దఒంటె.

"అలా అయితే మనం ఈ జూలో ఎందుకు ఉన్నాం.?" మళ్ళీ ప్రశ్నించింది చిన్న ఒంటె.



"నా దగ్గర లెక్కలు వచ్చిన చిలకుందిరా...."

"నిజమా?"

"అవును... రెండులోంచి రెండు తీసేస్తే ఎంత అనడిగితే ఏం మాట్లాడటం లేదు మరి...."

# రాజా ఆడియో రివ్యూ



**విడుదల : టిప్స్**

**వెల : రూ. 28/-**

బెంగుళూరులో 10 ఏళ్ళ పాటు ఉండి సుమారు 1000 చిత్రాలకు సౌండ్ ఎఫెక్ట్‌లు సమకూర్చి, ప్రస్తుతం హైదరాబాద్‌లో ప్రకాష్ డిజిటల్ స్టూడియోను నిర్వహిస్తున్న డి.యస్.ప్రకాశరావు లక్ష్మీసాయి క్రియేషన్స్ పతాకంపై రమ్యకృష్ణ, సుమన్ కాంబినేషన్‌లో నిర్మించిన 'నీలాంబరి' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. రాజేష్ రామ్‌నాధ్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. పాటలన్నిటినీ వెన్నెల కంటి రాశారు.

చిత్రపాడిన 'ఈ జగమే ఈ జగమే ఆగెను నను చూసి' పాటలకు హాంటింగ్ ట్యూన్ జత పడింది. ఈ పాటకు శివరంజని రాగం ఆధారం. ఈ రాగానికి ఉదాహరణగా ఆకాశదేశాన (మేఘ సందేశం) పాటను చెప్పుకోవచ్చు. ఉష పాడిన 'మల్లియల మనసింక పలికించవా' పాట హాయిగా ఉంది. పాటకు ఆధార రాగం మోహన కావటంతో ఆ హాయి ఓ జోలలా అమరిపోయింది. కౌసల్య బృందం పాడిన 'బ్యూటీ వుంది మనముందే డ్యూటీ నీదే పదమందే' పాట మంచి బీట్ సాంగ్. యూత్ కావలసిన విధంగా ట్యూన్‌లో ఫాస్ట్ బీట్, సాహిత్యంలో కిక్కు అన్నీ ఉన్నాయి. ఇక కౌసల్య గురించి ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. ఆమె గళంలోను, దాన్ని ఆమె ప్రొజెక్ట్ చేసుకుంటూ పాడే విధానంలోను పాటకు కావలసిన మసాలాను పూర్తిగా సమ'కూరింది'!

స్త్రీ గళాలతో బృందగానంగా సమర్పించిన 'అయిగిరినందిని నందిత వేదిని' అనే మహిషాసురమర్దిని స్తోత్రం - సినిమాలోని సందర్భానికి తగిన ఇంటర్‌లూడ్స్‌తో కూడి ఉన్నా భక్తిభావ స్పందనకు అడ్డురాని విధంగానే ఉంది. శంకరాచార్య విరచితమైన ఈ స్తోత్రాన్ని సినిమా కనుగుణంగా పల్లవిని రిపీట్ చేస్తూ మలచుకున్నా ఔచిత్య భంగం ఏ మాత్రం లేదు. శివకాకాని, నిత్యసంతోషిణి బృందం పాడిన 'థిందినక్కు దినా దుర్గమ్మ ఈ బుల్లెమ్మాకు బుల్లోడికి తగని సిగ్గమ్మా' పాటలో పల్లవి హడావుడిగా ఉన్నా చరణాలు మాత్రం ఇంపుగా వినసొంపుగా ఉన్నాయి. మంచి మెలోడి జతపడింది చరణాలకి. ఈ పాట తర్వాత 'ఏ' సైడున రెండవ పాటగా వచ్చిన 'మల్లియల మనసింత పలికించవా' పాటను తిరిగి పొందుపరిచారు. ఎలాగు వినడానికి హాయిగా ఉంది కనుక రిపీట్ అయిన ఫర్వాలేదనిపిస్తుంది.



విడుదల : సుప్రీమ్
వెల : రూ. 35/-

## రాజా ఆడియో రివ్యూ

ఆకాష్ హీరోగా కోటి సంగీత దర్శకత్వంలో జి.సత్యనాయుడు దర్శకుడిగా శ్రీ శ్రీనివాస సాయి ఫిలింస్ నిర్మించిన 'నీతో చెప్పాలని...' ఆడియో క్యాసెట్ విడుదలయింది.

శివగణేష్ రాయగా సునీత, శ్రీరాంప్రభు పాడిన 'ఏమో ఏమయిందో' పాట ఖచ్చితంగా హిట్ అయ్యే పాట. సంగీతం సాహిత్యం హాయిగా వినిపిస్తాయి ఈ పాటలో. 'ఆ చొరవే ప్రేమ అని నీకు ఈనాడే తెలిసిందిలే' అనే లైను దగ్గర జతపడిన ట్యూన్‌కి రిపీట్ వాల్యూ ఎంతో వుంది. దర్శకుడు సత్యానాయుడు రాయగా కోటి, కార్తిక్ పాడిన 'ప్రేమంటే అమ్మాయి లుక్స్ కాదు అమ్మాయి లిప్స్ కాదు' పాట యువతకు తగ్గట్టు క్యాచీగా ఉండటమే కాదు - మంచి టైములో మంచి నిర్ణయం వలపు జంటకే కొత్త విజయం / ప్రేమ యమ ట్విస్టు రూటురా నువ్వు బ్లైండుగా వెళ్ళమాకురా - లాంటి 'ఆల్ టైమ్ లైన్స్'లో అందరిచేతా బాగుందనిపించు కుంటుంది. భువనచంద్ర రాయగా టిప్పు, గోపికాపూర్ణిమా పాడిన 'అమ్మో అమ్మాయి కళ్ళు అల్లో నేరేడి పళ్ళు' పాటని కూడా ఆ అక్కౌంట్‌లోనే చేర్చాలి. యూత్‌కు కావలసిన కిక్కుని ట్యూన్స్ ద్వారా అందిస్తూ వారి జీవితాలకు నిజంగా కావలసిన మనో వికాసానికి తగిన విషయాలను సాహిత్యం ద్వారా సరఫరా చేయగలిగే వారి (ఎవరైతే వారు) సంస్కారానికి మనం అభినందనలు తెలుపక తప్పదు.

సాహితి రాయగా జయచంద్రన్, శ్రీవర్ధని పాడిన 'అమ్మాయి ఓరకంట చూసిందంటే' పాటలో లాహిరిలాహిరిలో (మాయాబజార్) పాట ట్యూన్‌ని, బృందావనమది అందరిది (మిస్సమ్మ) పాట ట్యూన్ తమాషాగా కలుపుకున్న తీరు 'పడుచోళ్ళ ఒంట్లో పాకే ఈ కరెంటువైరు, దానికి పెట్టేద్దాం ప్రేమన్న పేరు' అనే వాక్యాలు సరదాగా అనిపిస్తాయి. రఘు కుంచె, గంగ పాడిన 'అమ్మో రామా అయ్యో రామా ఇంతే ఈ ప్రేమ' పాట చరణాల ట్యూన్‌లోని విరుపులకు తగ్గ సాహిత్యాన్ని సమకూర్చడంలో రచయితగా పోతుల రవికిరణ్ సక్సెస్ అయ్యాడు. ట్యూన్ పరంగా చూసుకుంటే 'చమక్కురో చమక్కురో' దగ్గర చిరంజీవి హీరోగా నటించిన 'ఇద్దరు మిత్రులు'లోని 'దేఖ్‌బాబా దేఖ్‌బాబా, దేఖ్ ఆలీబాబా' (సంగీతం మణిశర్మ) పాటలోని 'గున్‌గునాగున్ గున్‌గునాగున్ చెంత చేరాలోయ్' అనే లైను గుర్తొస్తుంది. సందీప్, గంగ పాడిన 'మేఘాల ఆకాశమే ఒక వింతగా మెరిసే' పాటను వినగానే 'దీవానా' సినిమాలోని 'జీతాథా జిస్ కేలియే' పాట ట్యూన్‌ని తీసుకున్నారనిపిస్తుంది. తేలికైన మాటలతో సబ్జెక్ట్‌ని చెప్పాలనుకోవడంలోను, 'ఆరా తియ్యాలని' లాంటి పదాల్ని ప్రయోగించటంలోనూ రచయిత పోతుల రవికిరణ్ - సిరివెన్నెల సీతారామశాస్త్రి స్కూల్‌ని ఫాలో అవుతున్నట్టుగా ఉంది. నిజానికది ఇప్పటి పరిస్థితులకు అవసరం, మంచిది కూడా!

# నల్లగొండలో 'హాసం' సమావేశం



ఎమ్బీయస్ ప్రసాద్, కొలనుపాక రవికుమార్, రాజా, ఎన్.కె. రామారావు, పులిజాల రామ్మోహన్‌రావు

సాధారణంగా సినిమా నటులకు, రచయితలకు వివిధ రంగాల్లోని కళాకారులకు అభిమానులుండటం సహజం. అలాగే కొన్ని కొన్ని వాదాలకు, సిద్ధాంతాలకు కట్టుబడి నడుపుతున్న పత్రికలకు ఆ వాదాలను, సిద్ధాంతాలను సమర్థించే అభిమానులుండటం కూడా సహజం. "హాసం" అన్ని వర్గాలకు చెందిన పాఠకుల పత్రిక కాబట్టి దాని అభిమానులు అన్ని రంగాలకూ చెందిన వారు కావడం సహజం.

నల్లగొండలో యన్.కె. రామారావు అనే ఒక సంగీత సాహిత్యాభిమానికి కర్నాటక - హిందుస్తానీ సంగీతాలు వినడమన్నా, వి.ఎ.కె. రంగారావు సమీక్షలన్నా విపరీతమయిన అభిమానం. అలాగే పి.జి. ఉడ్‌హౌస్ సాహిత్యం అన్నా, బాపురమణలన్నా ప్రాణం. అదే ఆయన్ను "హాసం" మేనేజింగ్ ఎడిటర్ ఎమ్బీయస్ ప్రసాద్‌కు పరిచయం చేసింది. ఆ క్రమంలోనే రామారావుకు "హాసం" గురించి తెలియడం, ఆకర్షింపబడడం జరిగింది

నల్లగొండలో "హాసం"కు చాలామంది విద్యాధికులైన అభిమానులున్న విషయం గుర్తించిన యన్.కె. రామారావు "హాసం" సంపాదకవర్గంతో నల్లగొండలో ఒక సమావేశం జరిపితే బాగుంటుందని అభిప్రాయపడ్డారు. ఈ సూచనకు ఎమ్బీయస్ ప్రసాద్, రాజాలు ముందు కొంచెం సంశయించినా ఈ సూచన పాఠకులదేనని, "హాసం" వంటి విలక్షణ పత్రిక ప్రారంభించటానికి గల కారణాలు పాఠకులకు వివరించే అవకాశం వుందని, సంగీతపరమైన సందేహాలను పాఠకులు ముఖాముఖీ తెలుసుకునే అవకాశం ఉందనీ వాదించారు. రామారావు. పాఠకులు తమకు తాముగా ముందుకు వచ్చి ఈ సూచనను చేస్తున్నారన్న విషయం గుర్తించిన "హాసం" సంపాదక వర్గం ఈ కోర్కెను కాదనలేక పోయింది.

9-2-2002 సాయంత్రం నల్లగొండ టౌన్‌హాలు కళ కళ్ళాడుతూ కనిపించింది. ఎమ్బీయస్ ప్రసాద్, రాజా నల్లగొండ వచ్చారు. సభకు రావడానికి ముందు స్థానిక ప్రముఖ న్యాయవాది - హిందూస్థాని సంగీత ప్రియుడు డి. అమరేందర్ రావు ఆయన శ్రీమతి డా॥ సునీత లు రాజా - ప్రసాద్ దంపతులకు తేనీటి విందునిచ్చారు. అమరేందర్ రావు హిందుస్తానీ సంగీత క్యాసెట్ల కలెక్షన్, హిందూస్తానీ సంగీతజ్ఞుల మీద శ్రీ జోషి ఆంగ్లంలో రాసిన ఒక పుస్తకాన్ని, దానిలో పన్నాలాల్ ఘోష్ అరుదైన ఫోటోను చూసి రాజా ఎంతో సంతోషించారు. (ఆ పుస్తకం ప్రస్తుతం మార్కెట్‌లో అలభ్యమంటారు అమరేందర్ రావు).

వేదిక మీద "హాసం" బ్యానరు మెరిసిపోయింది. "హాసం" సమావేశానికి అనుసంధానిస్తూ స్థానిక ఘంటసాల కల్చరల్ అసోసియేషన్ వారు ఘంటసాల పాటల కచ్చేరి ఏర్పాటు చేశారు. దీనికి కావలసిన సరంజామా శ్రీ శృతి గురుకుల్ కరస్పాండెంట్ ఎ. సుబ్రమణ్య ప్రకాశ్ సమకూర్చారు. పాఠకులు తమకు తాముగా ముందుకువచ్చి ఏర్పాటు చేసిన ఈ సమావేశం పత్రికల చరిత్రలోనే అపూర్వం.

సమావేశం నిరాడంబరంగా, ఆత్మీయంగా ప్రారంభమైంది. ముందుగా పత్రిక పబ్లిషర్ శ్రీ కె. ఐ. వరప్రసాద్ రెడ్డిగారి గురించి స్థానిక శ్రీ కృష్ణదేవరాయ పాఠశాల కరస్పాండెంటు కొలనుపాక రవికుమార్ పరిచయం చేశారు. వరప్రసాద్ రెడ్డిగారు సమావేశంలో లేకున్నా వారి వృత్తి వ్యాపకాలతో పాటు వారి అభిరుచులు సభికులకు తెలియవచ్చాయి.

తర్వాత మేనేజింగ్ ఎడిటర్ ఎమ్బీయస్ ప్రసాద్‌ను పరిచయం చేస్తూ యన్.కె. రామారావు సుదీర్ఘంగా ప్రసంగించారు. ప్రసాద్ చేసిన ఇంగ్లీషు, తెలుగు హాస్య, హాస్యేతర రచనల గురించి, ఆయన ఇంగ్లీషు నుండి తెలుగుకు, తెలుగు నుంచి ఇంగ్లీషుకు చేసిన అనువాదాల గురించి, ముఖ్యంగా ముళ్ళపూడి వెంకటరమణ గారి కథలను ఇంగ్లీషులోకి అనువదించడం గురించి, బొమ్మ - బొరుసు లాంటి సంకలనాలకే కాకుండా ఆయన ప్రస్తుతం సంకలిస్తున్న రమణ గారి సమగ్ర సాహిత్యం ఏడు సంపుటాలకు విషయ విభజనలోనూ ముందు మాటలు రాయటంలోనూ తీసుకున్న శ్రద్ధ - కనబర్చిన నైపుణ్యం గురించి సోదాహరణంగా వివరించారు. ఎమ్బీయస్ రాసిన వైవిధ్యభరితమయిన వ్యాసాలను గురించి కూడా ప్రస్తావించారు.

ఆ తర్వాత సంగీతజ్ఞుడు మాత్రమే కాకుండా వివిధ విషయాల పట్ల ఆసక్తి, అభిరుచి ఆసాంతం నింపుకున్న యం. పురుషోత్తమాచార్య (ఘంటసాల కల్చరల్ అసోసియేషన్ అధ్యక్షులు) రాజాను పరిచయం చేశారు. 26 సంవత్సరాలుగా రాజా వివిధ పత్రికల్లో నిర్వహించిన అనేకానేక సినీసంగీత, హాస్య శీర్షికల గురించి, రచించిన టీవీ సీరియల్స్ గురించి, చెప్పారు. సినీ సంగీతంపై రాజాకు గల అభిరుచిని, నైపుణ్యాన్ని ప్రస్తావిస్తూ హాస్య రచనలు చేయడంలో ఆయన నేర్పును కూడా ప్రశంసించారు.

ఆ తర్వాత స్థానిక ప్రముఖ న్యాయవాది పులిజాల రామ్మోహన్‌రావు తన ప్రసంగంలో సినీ సాహిత్యంలోనూ - సంగీతంలోనూ విలువలు దిగజారి పోతున్నాయని బాధపడ్డారు. "హాసం" అన్ని వర్గాల పాఠకులను అలరించటం తనకు ఆనందదాయకంగా వుందన్నారు. పాత సినిమాల్లోని సాహిత్యాన్ని, సంగీతాన్ని ఈ తరం పాఠకులకు, ప్రేక్షకులకు అందించి వారి అభిరుచిని పెంపొందించాల్సిన బాధ్యతను "హాసం" స్వీకరించాల్సిందిగా అభ్యర్థించారు.

ఆ తర్వాత ఎమ్బీయస్ ప్రసాద్ మాట్లాడుతూ పత్రిక వుద్దేశ్యాలను, దానికి పాఠకుల నుంచి వస్తున్న అనుకూల స్పందనను విడమర్చి చెప్పారు. నల్లగొండ పాఠకుల అభిరుచిని అభినందిస్తూ, రామారావు చొరవ తీసుకుని అనేక మంది నల్లగొండవాసులను "హాసం" అభిమానులుగా మార్చడం మాత్రమే కాకుండా ఈ సమావేశానికి ఇంతమందిని ఆకర్షించినందుకు



ఆయన్ను శ్లాఘించకుండా వుండలేకపోతున్నానన్నారు.

రాజా తన ప్రసంగంలో పత్రిక నడపటంలో గల సాధకబాధకాలను వివరించారు. సినీ సంగీతం-హాస్యం గురించి విపులంగా మాట్లాడారు. పాత - కొత్త సినిమాలలోని సాహిత్యాన్ని, సంగీతాన్ని గురించి మాత్రమే కాకుండా ప్రస్తుతం వస్తున్న హాస్యం గురించి కూడా మాట్లాడారు.

ప్రసంగ ఘట్టం పూర్తయ్యాక పాఠకులతో రాజా - ప్రసాద్‌లతో ముఖాముఖి ప్రారంభమయ్యింది. సమావేశానికి వ్యాఖ్యాతగా వ్యవహరించిన అక్కినేపల్లి శ్రీనివాసరావు జిజ్ఞాసువులైన పాఠకశ్రోతల నుండి కొన్ని ప్రశ్నలు సేకరించి వారి తరపున అడగడం, రాజా తగు సమాధానాలు చెప్పడం జరిగింది. కొన్ని చోట్ల ప్రసాద్ తనకు తెలిసిన సమాచారాన్ని అందించారు. "హాసం" పాఠకులందరి సౌకర్యం కోసం ఆ వివరాలు :

**శ్రీమతి బి. పద్మ :** "జానేబహార్ హుస్న్ తెరా బేమిసాల్ హై" (రఫీ - చిత్రం ప్యార్ కియాతో డర్నాక్యా ) ఏ రాగంలో వుంది? "శ్రీకర కరుణాల వాల" (బొబ్బిలి యుద్ధం) కూడా ఆ రాగంలోనే ఉందా?

**రాజా :** ఆ రాగం "మాల్‌కోన్స్". కర్నాటక సంగీతంలో "హిందోళం" కొద్దిపాటి మార్పులతో అలాగే ఉంటుంది. "శ్రీకర కరుణాలవాల" పాటే కాదు, "శ్రీ కరమగు పరిపాలన" (మహా కవి కాళిదాసు) "మనసే అందాల బృందావనం" (మంచి కుటుంబం) కూడా ఈ రాగంలోవే. 'జాతకరత్న మిడతంభొట్లు'లో గాడిద పాట కూడా!

❋

**యం. యల్. నర్సింహారావు :** "పూవై విరిసిన పున్నమి వేళ" పాట గురించి "వార్త" వేరే పత్రికలో రాస్తూ ముఖ్యమైన నాలుగు పంక్తులు మరచిపోయారు. (అవి పాడి వినిపించారు)

**రాజా :** "పూవై విరిసిన వేళ" పాట తిరపతమ్మ కథలోనిది. మీరు ఉదహరించిన పంక్తులు 'సంతానం' సినిమాలోని 'చల్లని వెన్నెలలో చక్కని కన్నె సమీపంలో' అనే పాటలోవి. మీరు ఇలా పొరబడడానికి, కలిపి పాడెయ్యగలగటానికి కారణం అవి రెండూ ఒకే రాగం కి చెందినవి కావడం.

❋

**కుమారి కార్కీ :** "తూనీగ తూనీగ" పాట ఏ రాగంలో వుంది?

**రాజా :** ఆ పాటకి బేస్ మోహన రాగం కానీ మధ్యలో అన్యస్వరాలు పడ్డాయి.

**ప్రసాద్ :** ఈ పాట సాహిత్యం విన్నప్పుడు "కలిమిలేములు" సినిమాలో కీ॥శే॥ మల్లాది రామకృష్ణశాస్త్రి వ్రాసిన పాట 'కొమ్మలమీద కోతి కొమ్మచ్చులాడింది తెల్లా తెల్లని బుల్లి ఎండ' గుర్తుకు వచ్చింది. ఈ నాటికీ సినీసంగీతంలో సాహిత్యవిలువలను కాపాడేవాళ్లున్నారనడానికి ఇదొక ఉదాహరణ.

❋

**నారాయణరావు :** ఘంటసాల తొలి పాట - చివరి పాట ఏ సినిమాల్లో పాడారు?

**రాజా:** తొలిపాట స్వర్గసీమలోనూ - చివరి పాట వస్తాడే మా బావ లోనూ పాడారు.

**ప్రసాద్:** ఘంటసాల చివరి పాట తనపై చిత్రీకరింపబడుతోందన్న ఆనందంతోనే ఆ పాత్రధారణకు అంగీకరించానని నటుడు మురళీమోహన్ మాతో చెప్పారు.

❋

**యం. పురుషోత్తమాచార్య :** నల్లగొండకు చెందిన కీ॥శే॥ మందపాటి వెంకటరాజనే సంగీత దర్శకుడి గురించి వివరాలు పత్రికలో తెలపాల్సిందిగా కోరుతున్నాము.

**రాజా :** మీ కోరిక త్వరలో తీరుతుంది.

❋

**ఆనందం:** 'నవరంగ్'లోని ఏదైనా ఒక పాటను గురించి వివరంగా చెప్పండి.

**రాజా :** 'నవరంగ్' గురించి చెప్పాలంటే వ్యవధి సరిపోదు. 'హాసం'లో ఆధాహై చంద్రమా' గురించి రాశాం. గమనించండి.

❋

**బోధనం నర్సిరెడ్డి :** 'చిట్టి చెల్లెలు' లో 'ఈ రేయి తీయనిది' పాటకు మరే భాషలోనైనా మూలముందా?

**రాజా :** 'లవ్ ఈజ్ బ్లూ' అనే స్వర రచన ఆ పాటకు మాతృక. ఇది ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్‌గా దొరుకుతుంది, దీని వోకల్ వెర్షన్ 1970 ప్రాంతాలలో రేడియో కువైట్ నుంచి ప్రసారమయ్యేది. దాన్ని సాలూరు రాజేశ్వరరావు వాడుకున్నారు. అలాగే 'యే ముస్తఫా' అనే ఇంగ్లీషు పాటను 'ఇద్దరు మిత్రులు'లో "హలో హలో ఓ అమ్మాయి" గా వాడుకున్నారు. దీన్ని అనుకరణ అనడం కంటే అనుసృజనం అనడం కరక్టు.

❋

**జి. హనుమంతరావు:** రాజ్‌కపూర్ 'శ్రీ 420' లో "రామయ్యా వస్తావయ్యా" అనే పాటలో ఆ తెలుగు మాటలు ఎలా వచ్చాయంటారు?

**రాజా :** శంకర్ - జై కిషన్‌లలో శంకర్ హైద్రాబాదీ కాబట్టి ఆ తెలుగు మాట శైలేంద్రకు చెప్పి పాట పల్లవిలో వుపయోగించేలా చేసుండొచ్చు.

**ప్రసాద్ :** నేను ఎక్కడో చదివాను - తెలంగాణా ప్రాంతం నుండి బొంబాయికి లేబరుగా వెళ్లిన తె లుగువాళ్లు ఉండే ఓ బస్తీ శైలేంద్ర ఇంటికి దగ్గరలో ఉండేదట. ఆ స్లమ్‌లో వారి మధ్య పిలుచుకున్న పిలుపును విని శైలేంద్ర ఆ మాటలతో పాట రాశారట !

**యస్. కె. రామారావు :** నేను విన్నదాని ప్రకారం ఆ రోజుల్లో హైద్రాబాదులో మొజ్జంజాహి మార్కెట్ దగ్గర ఒక వేరుశనక్కాయల బండి కుర్రవాడు ఆ పాట జానపద రీతిలో తెలుగు ఉర్దూ కలిపి పాడుతుంటే విన్న శంకర్ ఆ పాట శైలేంద్రతో ఆ విధంగా రాయించారట.

పాఠకుల్లో ఇంకా ఉత్సాహం, ఉరకలేస్తున్నా అప్పటికే మూడు గంటలపాటు సభ జరగడంతో సమావేశం ముగించవలసి వచ్చింది. సమావేశానంతరం ఎమ్. నవీన్ కుమార్ మిమిక్రీ, ఎం. పురుషోత్తమాచారి ఆధ్వర్యంలో ఘంటసాల సంగీత విభావరి జరిగాయి.

హాసం **సాహితీ మిత్రులు**
**నల్లగొండ.**

అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

# అప్ ముఝె అచ్ఛే లగ్‌నే లగే...

| | | |
|---|---|---|
| చిత్రం | - | అప్ ముఝే అచ్ఛే లగ్‌నే లగే |
| బ్యానర్ | - | ఎమ్‌కే ఫిలింస్ |
| గీతం | - | ఇబ్రహీమ్ అశ్క్ దేవ్‌కోహ్లి |
| సంగీతం | - | రాజేష్ రోషన్, |
| గానం | - | అల్కా యాజ్ఞిక్, అభిజిత్ |
| అభినయం | - | హృతిక్ రోషన్, అమీషా పటేల్ |

హృతిక్ రోషన్ అభిమానులు ఆశతో ఎదురుచూస్తున్న చిత్రం. 'అప్ ముఝే అచ్ఛే లగ్‌నే లగే' ఆడియో రిలీజు అయి బాగా అమ్ముడుపోతోంది. 'కహో నా ప్యార్ హై' జంట తిరిగి నటిస్తున్నారు కాబట్టి, నాయికా నాయకులతో బాటు మ్యూజిక్ డైరెక్టరు కూడా రిపీట్ అవుతున్నాడు కాబట్టి సినిమా హిట్ అవుతుందేమోనన్న ఆశలు రేకెత్తిస్తోంది.

నిజానికి హృతిక్ వెండితెర మీదకు ఒక్కసారిగా దూసుకువచ్చి యావద్భారత దేశాన్ని మిరుమిట్లు గొలిపించాడు. మొట్టమొదటి చిత్రంతోనే ఒక ఫినామినన్‌గా అయిపోయాడు. ముఖ్యంగా మహిళలను విశేషంగా ఆకర్షించాడు. 'ఏక్ దూజే కే లియే' తర్వాత కమల్ హాసన్‌కి నార్త్‌లో ఇలాటి క్రేజ్ వచ్చింది. కానీ కమల్‌కి అది తొలిచిత్రం కాదు. దక్షిణాదిన బాగా ఎస్టాబ్లిష్ అయిన తర్వాతనే హిందీ చిత్ర రంగానికి వెళ్లేడు. కానీ ఆ ఊపు ఎక్కువ కాలం నిలవ లేదు. దక్షిణాది చిత్రాలను నమ్ముకునే నటుడిగా కొనసాగుతున్నాడు. హృతిక్ కథ కూడా ఇంతనేమో అనిపించింది. - 'కహో నా...' తర్వాత చిత్రాలు చూస్తే!



హృతిక్ తర్వాత చిత్రాలైన "ఫిజా", 'మిషన్ కశ్మీర్' విజయవంతం కాలేదు. కానీ వాటి వైఫల్యాలకు హృతిక్‌ను నిందించడం సబబు కాదు. చెప్పాలంటే హృతిక్ మొదటి చిత్రంలోనే అద్భుతమైన నటన, అదీ ద్విపాత్రాభినయంలో కనబరిచాడు. తర్వాత చిత్రాలలో పాత్రలు రెండూ కూడా కోపిష్టి పాత్రలే. నటనకు మార్కులు పడినా స్టార్ వాల్యూ పెరగడానికి ఏ విధంగానూ ఉపయోగ పడలేదు. ఆ తర్వాత వచ్చినక "కభీ ఖుషీ కభీ గమ్"లో బాగా నటించినా, క్రెడిట్ అంతా కాజల్‌కి, అమితాబ్‌కి. అట్టే మాట్టాడితే షారూఖ్‌కి పోయింది కానీ హృతిక్‌కి ఒరిగినదేమీ లేదు. ఈ నేపథ్యంలో హృతిక్‌ను మళ్లీ స్టార్‌గా నిలబెట్టే ఈ చిత్రం వస్తోంది.



హీరోయిన్ మాటకొస్తే 'కహోనా...' లో అమీషా ఎంతో బాగా, మొదటి హాఫ్‌లో హుషారుగా, రెండో హాఫ్‌లో విషాదమూర్తిగా హృతిక్‌కు దీటుగా నటించినా ఆమెను ప్రత్యేకంగా గుర్తించిన వారు లేకపోయారు. అవార్డుల వర్షం రోషన్ కుటుంబానికే పరిమితమయింది. అమీషాకు రావలసినంత ఖ్యాతి రాలేదు. కానీ "గదర్" వంటి హిట్ సినిమాలో ఆమె తన ప్రతిభను మళ్లీ కనబరిచి పేరు తెచ్చుకుంది. ఈ సినిమాకు హృతిక్ రెండున్నరేళ్ల నేపథ్యం ప్లాపులయితే, ఆమె నేపథ్యం హిట్. ఆ విధంగా చూస్తే ఆమె స్థానం హృతిక్ కంటె పై నున్నట్టే! పైగా ఇది రోషన్‌ల హోమ్ ప్రొడక్షన్ కాదాయె!

ఈ సినిమాలో ఆమె ఒక డబ్బున్న ఆసామీ కూతురు. (కహోనా లాగానే...) కొందరు క్రిమినల్స్ అతనిపైనా, అతని కుటుంబ సభ్యులపైనా దాడిచేసే భయం ఉండటం చేత అమీషాను ఇంటిపట్టున ఉంచేస్తారు. స్వంత ఇంట్లోనే బందీలా బతకడం వల్ల ఆమె మానసికంగా ఏకాంత జీవితం గడిపి అదొకరకంగా తయారవుతుంది. ఆమె జీవితంలో నవ్వులు

పూయించడానికి వస్తాడు హృతిక్. హృషీకేష్ ముఖర్జీ తీసిన "అనుపమ" (1966)లో తండ్రంటే భయపడే ఒక ముగ్ధ బాలిక (షర్మిలా టాగూర్ ఆ పాత్ర ధరించింది) ఉంటుంది. ఆమె పుట్టినప్పుడు ప్రసవంలో తల్లి చచ్చిపోతుంది. భార్యంటే అమిత ప్రేమగల ఆమె తండ్రి కూతురుని ఎప్పుడూ చీదరించుకుంటూ ఉంటాడు. ఆమెను గురించి పట్టించుకునే వారే ఉండరు. అనుకోకుండా పరిచయమైన ఓ యువకుడు ఆమెలో మనో వికాసం కలిగించేందుకు ప్రయత్నించి సఫలీకృతుడవుతాడు. ఆ యువకుడి పాత్ర వేసిన ధర్మేంద్ర లాగానే హృతిక్‌లో సౌకుమార్యంతో బాటు మాన్లీనెస్ కూడా పుష్కలంగా ఉంది కాబట్టి ఈ అమ్మాయిని కూడా మనుష్యులలో పడేస్తాడనే ఊహించుకోవచ్చు.




లిల్టింగ్ ట్యూన్స్‌కి మారుపేరుగా రాజేష్ రోషన్‌ను చెప్పుకోవచ్చు. తొలిచిత్రం "జూలీ" నుండి ఆయన ట్రెండ్ మారలేదు. "జూలీ" హిట్ అయినా ఆయనకు రావలసినంత మార్కెట్ రాలేదు. ఎన్నో చక్కని ఆహ్లాదకరమైన బాణీలు కట్టినా స్టార్ మ్యూజిక్ డైరెక్టర్ హోదా ఎప్పుడూ రాలేదు. "కహోనా..." ఆ కొరత తీర్చేసింది. వడ్డీతో సహా అన్ని అవార్డులు పట్టుకొచ్చేసింది. "కహోనా...." టైటిల్ సాంగ్ ట్యూన్ హృతిక్‌కు నచ్చలేదట. తనూ అసిస్టెంటు డైరెక్టరుగా పని చేసిన వాడు. ప్రఖ్యాత సంగీత దర్శకుడు రోషన్‌కు స్వయంగా మనుమడు. అందువల్ల ధైర్యం చేసి బాబాయికి చెప్పాడట, ట్యూన్ మార్చకూడదాని రాజేష్ రోషన్ "నీకు తెలియదు అది బాగా హిట్ అవుతుంది" అన్నాట్ట. అన్నట్టే సూపర్ హిట్ అయింది.

ఇక పాట:

అ : మొహబ్బతే ఏ హసీ శురూవాత్ హోగ ఈ
మేరీ దునియా మేరే సప్‌నే అబ్ సజ్‌నే లగే
కే ఆప్ ముఝే అచ్ఛే లగనే లగే॥కే॥
ఆ : మంజిల్ హై నఈ రాస్‌తే హై నఏ
హమ్ జమీ సే ఆస్‌మాన్ తక్ అబ్ ఉడనే లగే ॥కే॥
అ : రాజ్ క్యాహై జిందగీ కా ఖుల్ గయా
అ : దిల్‌కా ఆ ఈనా ఖుశీసే ధుల్ గయా
అ : హమ్ భీ అప్‌నే ఏక్ దునియా రఖ్‌నే లగే॥కే॥
అ : సోచీ సమ్‌ఝీ ఏ ములాకాతే నహీ... జీ నహీ...
అ : ఆద్‌మీ కే బసే కీ ఏ బాతే నహీ.... జీ... నహీ....
రబ్‌నే చాహా తో యే దిల్ యూ మిల్‌నే లగే॥మొహ॥

పాట చూడగానే గ్రహించవచ్చు ఇది ప్రేమలో పడబోతున్న జంట పాడుకున్నదని. తమ మధ్య ఉన్న అనుబంధం ఎటువంటిదో నిర్వచించడం ఏ యువతికైనా, ఏ యువకుడికైనా కష్టమే. ఇష్టంతో మొదలయి క్రమంగా ఆరాధనలోకి దిగి ఆ పైన ప్రేమగా వరిణమిస్తుంది. అచ్ఛా లగ్‌నా అంటే బాగుందనిపించడం. నువ్వు నాకు నచ్చుసాగావ్ అని ఈ పాట మకుటం. సినిమా పేరు కూడా అదే. శురూవాత్ అంటే ప్రారంభం. సజానా అంటే అలంకరించడం. ప్రేమ మొదలయిందని తెలిసింది కాబట్టి, నా స్వప్నాలు, నా ప్రపంచం ఇక శోభించ సాగాయని ఆమె అంటోంది. మంజిల్ అంటే గమ్యస్థానం. ప్రేమలో కొత్తగా పడ్డాడు కాబట్టి అతనికి దారి తెలియదు, వెళ్లాల్సిన చోటూ తెలియదు. జమీన్ అంటే భూమి, ఆస్మాన్ అంటే ఆకాశం. వీటిని జమీఁ, ఆస్‌మాఁగా కూడా పలుకుతారు. అందువల్ల ప్రాస కుదరడానికి వీలుగా అలాగా, ఇలాగా కూడా వాడతారు. అలాగే జహాన్ (ప్రపంచం) కూడా.

ఆమె : అందాల ఈ ప్రేమలు ఆరంభమయ్యాయి
నా లోకం, నా కలలు అలంకారాలు దిద్దుకున్నాయి
ఎందుకంటే నువ్వు నాకు నచ్చుతున్నావ్
అతడు : గమ్యం కొత్త, వెళ్లేదారులూ కొత్త
నేల నుండి ఆకసానికి ఎగరసాగాను
ఎందుకంటే నువ్వు నాకు నచ్చుతున్నావ్

చరణంలో ప్రేమవల్ల వారి జీవితంలో కలిగిన పరిణామాలు చెబుతున్నారు ఆ ప్రేమికులు. రాజ్ అంటే రహస్యం. రహస్యం తెలిసిపోయింది అనడానికి రాజ్ ఖుల్‌గయా (తెరుచుకు పోయింది) అంటారు హిందీలో. రహస్యం అనేది గుప్పిట్లో ఉన్నట్టు, అది తెరవగానే రహస్యం బయటపడిపోయినట్టూ భావిస్తారేమో! ఆనా అంటే అద్దం. తెలుగు పదాలలో మధ్య అక్షరాలు అచ్చులు రాకూడదు. కానీ హిందీలో ఆ నిబంధన లేదు. అందుకే ఆఈనా అని రాస్తారు. ధుల్‌నా అంటే కడగడం.

ఆమె : జీవితం రహస్యమేమిటో తెలిసింది
అతడు : మనసు అద్దం సంతోషంతో శుభ్రమయింది
ఆమె : మనకంటూ ఓ లోకం ఏర్పడింది

ఇక ప్రేమలో పడడం గురించి విశ్లేషణ మొదలు పెట్టారు. ఇది ముందే అనుకుని పడే వ్యవహారం కాదులే అనుకుని తేల్చుకున్నారు. సోచ్ సమఝ్‌కర్ అంటే ఒక విషయం గురించి ఆలోచించుకుని, అర్థం చేసుకుని అని అర్థం. బస్ అంటే వశం. బస్‌కీ బాత్ మన కంట్రోల్‌లో ఉండేది. మనకు సాధ్యపడేది అని అర్థం. రబ్ అనేది ఉర్దూ పదం. దేవుడు అని అర్థం. యూ అంటే ఇలా అని అర్థం.

ఆలోచించుకుని జరగవీ కలయికలు
మన చేతిలో ఉండవీ ఈ సంగతులు
దేవుడు తలచుకుంటేనే
ఈ మనసులు ఇలా కలుస్తాయి.

పాటపాడిన అల్కా యాజ్ఞిక్, అభిజిత్ మంచి హుషారుగా పాడారు. ఏ విధమైన కాంప్లికేషన్స్ లేకుండా, అతి సింపుల్‌గా పాతకాలం హిందీ ప్రేమగీతంలా హాయిగా నోటికి వచ్చేట్లా పాటకు బాణీ కట్టారు రాజేష్ రోషన్. 'నువ్వు నాకు నచ్చుతున్నావ్' అని ప్రేక్షకులు సినిమాతో అంటారో లేదో చూడడానికి మాత్రం టైము పడుతుంది.



## బహుముఖ ప్రజ్ఞగల నటగాయని

# టి.జి. కమలాదేవి



1951వ సంవత్సరంలో విడుదలై విశేష ఖ్యాతిని పొందిన చిత్రాలు "మల్లీశ్వరి", "పాతాళ భైరవి". తెలుగు సినిమా రంగానికి వన్నెలు తెచ్చిన ఈ రెండు కళాఖండాల్లోనూ నటించిన ఘనత టి.జి. కమలా దేవికి దక్కుతుంది.

రంగస్థలం, సినిమా, రేడియో - ఈ మూడు రంగాల్లోనూ మంచి పేరు తెచ్చుకున్న కళాకారిణిగా, మధుర గాయనిగా, ఉత్తమ సామాజిక సేవకురాలిగా, బిలియర్డ్స్ చాంపియన్‌గా, దశాబ్దాల చరిత్రగల చెన్నపురి ఆంధ్ర మహాసభ సెక్రటరీగా, ప్రెసిడెంటుగా మంచి పేరు ప్రఖ్యాతులు పొందిన టి.జి. కమలాదేవి అసలు పేరు తోట గోవిందమ్మ.

29-12-1929 న చిత్తూరు జిల్లా కార్వేటి నగరంలో జన్మించిన కమలాదేవి తండ్రి కృష్ణస్వామి నాయుడు, తల్లి లక్ష్మమ్మ. ఈమెకి నలుగురు అక్కా చెల్లెళ్లు, ఒక తమ్ముడు. ఏడవ ఏటనే తల్లి ప్రోత్సాహంతో శాస్త్రీయ సంగీతాన్ని నేర్చుకున్న కమలాదేవి పుత్తూరులోని అమెరికన్ స్కూలులో మెట్రిక్ పూర్తి చేసింది. స్కూల్లో చదువుకుంటూనే వార్షికోత్సవ నాటకాల్లో 'జ్ఞాన సుందరి', 'భూపుత్రి' మొదలైన పాత్రలు ధరించింది.

"వందే మాతరం"(1939)లో నటించిన నాగయ్య గారికి పుత్తూరులో ఘన సన్మానం జరిగింది. ఆ సభలో కమలాదేవి పాడిన ప్రార్థనా గీతాలు విని ముగ్ధుడైన చిత్తూరు వి. నాగయ్య ఈమె గురించి బి.ఎన్. రెడ్డి గారికి సిఫార్సు చేశారు. బి.ఎన్. రెడ్డి ఈమెను "సుమంగళి"లో ఓ ముఖ్య పాత్రకు మద్రాసు పిలిపించారు. కానీ కారణాంతరాల వల్ల టి.జి. కమల అందులో నటించలేకపోగా, ఆ పాత్ర మాలతి ధరించింది.



రాజాశాండో తీసిన "చూడామణి" (1941) కమలాదేవి మొదటి చిత్రం. సి.ఎస్.ఆర్. చెల్లెలుగా నటించింది ఈ చిత్రంలో. ఆ సమయంలోనే తమిళ చిత్రంలో కూడా నటించింది. ఆ తర్వాత "దక్షయజ్ఞం" (1941)లో రోహిణి, "సీతారామ జననం" (1944)లో అహల్యగా నటించిన కమలాదేవికి మంచిపేరు తెచ్చిపెట్టిన చిత్రం - "మాయాలోకం" (1945). ఆర్టిస్టుల సౌకర్యాలు గమనించటంలో కీ.శే. గూడవల్లి రామబ్రహ్మం గార్ని మించిన దర్శకుడు లేడంటుందామె. ఓపికతో ఆర్టిస్టులకి రషెస్ చూపడం, ఆర్టిస్టుల సలహాలు తీసుకోవడం, ఆర్టిస్టులను గౌరవించడంలో తన అనుభవాన్ని బట్టి రామబ్రహ్మం గారికి ఎవరూ సాటి రారంటుంది.

'ప్రతిభా' వారి "ముగ్గురు మరాఠీలు" (1946)లో అక్కినేని నాగేశ్వరరావు సరసన కథానాయికగా నటించి 'చల్ చలో వయ్యారీ షికారీ' పాట కూడా ఆయనతో కలసి పాడింది. "ముగ్గురు మరాఠీలు" చిత్ర నిర్మాణ సమయంలో జరిగిన ఓ సంఘటన తనకు మరపురాని జ్ఞాపకంగా నిలిచిపోయిందంటుంది కమలాదేవి.

"శోభనాచలలో (ఈ తరం వారికి వీనస్) యేదో పాట రికార్డింగ్ జరుగుతున్నది. నేనూ, అక్కినేని నాగేశ్వరరావు, కీ॥శే॥ కన్నాంబ పాడుతున్నాం. మధ్యాహ్నం మొదలు పెట్టిన పాట యెందుచేతనో అయిదు వరకూ కాలేదు. బ్రేక్ యిచ్చారు. ప్రసిద్ధ నటి కాబట్టి కన్నాంబ గారికి టీ, టిఫిను వగైరా సదుపాయాలన్నీ ప్రొడక్షన్ మేనేజరు చూసుకున్నాడు. పిల్లోళ్ళమని మా సంగతి పట్టించుకోలేదు.

నాగేశ్వరరావుకు కోపం తడామని తలకెక్కిపోయింది. వెంటనే సైకిలు తీసుకొని లజ్ రోడ్డుకి వెళ్ళి పావలా పెట్టి కేకులు కొని స్టూడియోకి తీసుకొచ్చి నాకు యిచ్చి, తానూ తిన్నాడు. అంత చిన్నతనం అప్పుడు. ఎంత స్వల్పమైన విషయమో యిప్పుడు ఆలోచిస్తే నవ్వొస్తుంది" అని వివరించిందామె.

'ముగ్గురు మరాఠీలు' తర్వాత 'గుణసుందరి కథ' (1949), 'మల్లీశ్వరి' (1951), 'పాతాళ భైరవి' (1951), 'పల్లెటూరు' (1952), 'చక్రపాణి' (1954), 'తోడు దొంగలు' (1954) వంటి చిత్రాల్లో నటించి పేరు తెచ్చుకుంది కమలాదేవి.

'వెలుగు నీడలు'లో రేలంగి భార్యగా, సావిత్రిని పెంచిన తల్లిగా - 'ఇల్లరికం'లో జమున మేనత్తగా ఆమె చూపించిన నటన ఆ రెండు సినిమాలకు ఎంతటి బలాన్నిచ్చాయో ఆ తరం ప్రేక్షకులకు బాగా తెలుసు.



కమలాదేవి ఏ పాత్ర ధరించినా, ఏ పాట పాడినా ముగ్ధ మోహనంగా, మనోహరంగా ఉండేది. ఆమె కంఠం కోకిల కంఠం. మృదు మధురమైనది. ఏ పాట పాడినా భావయుక్తమైన శ్రావ్యత కొట్టవచ్చినట్లు కన్పించేది. సినిమాల్లోకి రాకముందే తన పదకొండో ఏటే సిహెచ్.బి. వెంకటాచలంతో కలసి ప్రథమంగా కొలంబియా వారికి రికార్డునిచ్చింది. అలాగే తమిళంలో జీవరత్నమ్మ పాడిన పాటను తెలుగులో 'నిను కనలేని జీవితమా' అనే పాటను రికార్డుగా ఇచ్చింది. నటనలో ఉన్న వైవిధ్యమే గాత్రంలో కూడా ప్రదర్శించగల నేర్పు ఆమె సొత్తు. 'జై జై భైరవ త్రిశూల ధారి' అనే ప్రతిభా టైటిల్ సాంగ్ కీ॥శే॥ కన్నాంబతో పాటు, నాగేశ్వరరావుతో కలసి పాడిందామె. ఇంకా 'నా ఫిరోజీ చిన్ని బావా' (ముగ్గురు మరాఠీలు), 'ఈ వనిలో కోయిలనై' (గుణసుందరి), 'రాలిపోతివా మాలతి' (ముగ్గురు మరాఠీలు), 'పాతాళ భైరవి'లో కథకు కీలకమైన బుర్రకథలో పరివ్రాజికగా నటించి, నర్తిస్తూ, వీర రసాన్ని పండించిన, 'ఇతి హాసం విన్నారా ఆ అతి సాహసులే వున్నారా' వంటి పాటలన్నీ ఆమె సుమధుర గాత్రానికి నిదర్శనాలు.



స్థానం నరసింహారావుతో...



'మల్లీశ్వరి'లో భానుమతితో...

"మల్లీశ్వరి"లో జలజ పాత్రలో పువ్వులు కోస్తూ 'తుమ్మెదా తుమ్మెదా" పాట, పతాక సన్నివేశంలో ఉషాపరిణయం నృత్య నాటికలోని 'శ్రీ సతితో సరసిజ నయనువలె' అన్న పాట, 'ఎవరే పిలిచే రల్లన మెల్లన పిల్లన గ్రోవిని ప్రియా ప్రియా' వంటి పాటలను, భానుమతి చెలికత్తెగా ఆమె అభినయాన్ని ఎవరూ మరచిపోలేరు.

"సూర్య చంద్రుల్లాగా శాశ్వతమైపోయే విధంగా దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు రాసిన ఆ పాటలను నటిస్తూ పాడే అవకాశం నాకు లభించడం... నా అదృష్టం" అని అంటుంది కమలాదేవి. తన పాటలు తాను పాడుకోవడమే గాక "గొల్లభామ" (1947)లో అంజలీదేవికి, "భక్త రామదాసు" (1964)లో కన్నాంబకు ప్లేబాక్ కూడా పాడిందామె. "కంజన్" అనే తమిళ చిత్రంలో హీరోయిన్‌గా నటించిన కమలాదేవి ఏ సంభాషణ పలికినా నిర్దుష్టంగా, స్పష్టంగా ఉండేది. దీంతో పద్మిని, బి.ఎస్. సరోజ, బి. సరోజ మొదలైన నటీమణులకు తెలుగులో డబ్బింగ్ కూడా చెప్పిందీమె.

ఒక పక్క సినిమాల్లో నటిస్తూనే మరోపక్క నాటకాల్లో కూడా పాల్గొనేది. ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ వారు మద్రాసులో నిర్వహించే నాటకాల్లో నటించేది. ఆంధ్ర మహాసభలో గిడుగు సీతాపతి గారి దర్శకత్వంలో "విడాకులు" నాటకంలో చెల్లెలి పాత్రను ధరించింది. 1941 నుండి ఈనాటి వరకూ కూడా ఆంధ్ర మహాసభ నాటకాలలో వైవిధ్య భరిత పాత్రలను ధరిస్తూనే ఉందామె.

నాటక కళా ప్రపూర్ణ బళ్ళారి రాఘవాచార్యతో కలసి 'ఆ లోకము నుండి ఆహ్వానం' అనే నాటకంలోనూ, 'కీచక వధ'లో సైరంధ్రిగా నటించిన స్థానం నరసింహారావుతో కలసి 'ఉత్తర' పాత్రలోనూ, 'రాధాకృష్ణ' నాటకంలో రఘురామయ్య పక్కన రాధగాను నటించి మన్ననలందుకున్న కమలాదేవి - వెంకటగిరి అమెచ్యూర్స్ అసోసియేషన్ వారి 'గాలివాన' నాటకంలో కథానాయిక ఇందిర పాత్రను అద్భుతంగా పోషించి, ఉత్తమ నటిగా వెండిపళ్లెం కూడా బహుమానంగా పొందిందామె.

చెన్నపురి ఆంధ్ర మహాసభ కార్యవర్గ సభ్యురాలిగా, నాటకశాఖ కార్యదర్శిగా, దర్శకురాలుగా, నటిగా, గాయకురాలుగా, కొన్ని వందల నాటకాలకు దర్శకత్వ బాధ్యతలను నిర్వహించింది కమలాదేవి. ఆంధ్ర మహాసభలో ఆమె ప్రదర్శించిన సక్కుబాయి పాత్రాభినయానికి ముగ్ధుడైన పిఠాపురం మహారాజా బంగారు పతకాన్ని బహూకరించారు. ఇలాంటి స్వర్ణ, రజత పతకాలు ఓ 70 దాకా వుంటాయామెకు.

తెలుగు నాటకాలకే పరిమితం గాకుండా ఎగ్మూర్ డ్రమెటిక్ అసోసియేషన్‌లో చేరి మనోహర్, సంతానం వంటి వారితో కలసి అనేక తమిళ నాటకాల్లో నటించింది. అంతే కాదు ఆంధ్ర సెక్రటేరియట్ అసోసియేషన్ గుజరాత్, రాజస్థాన్‌లలో ప్రదర్శించిన 25 నాటకాలలో ఒకటైన 'అలెగ్జాండరు'లో రుక్సానా పాత్రను ధరించి ఆంధ్రేతరుల ప్రశంసలందుకుంది.

ఇటు సినిమాలలో, అటు నాటకాల్లోనేగాక ఆలిండియా రేడియోలో ప్రాముఖ్యత గల బాధ్యతను నిర్వహించింది. ప్రయాగ నరసింహ శాస్త్రి ప్రేరణతో ఆకాశవాణిలో ప్రవేశించి మద్రాసు, హైదరాబాదు, విజయవాడ, బెంగుళూరు రేడియో కేంద్రాలలో ఎన్నో నాటకాలు, నాటికలు, రూపకాలు... ఇలా వందల కార్యక్రమాల్లో పాల్గొన్నది కమలాదేవి.

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'విప్రనారాయణ' అనే రేడియో నాటికలో ప్రప్రథమంగా పాల్గొన్న కమలాదేవిలోని ప్రతిభ, సంభాషణలు పలకడంలో విలక్షణ శైలి ఆమెకు 'ఎ'గ్రేడ్ ఆర్టిస్టుగా అధిక సంఖ్యలో అవకాశాలు తెచ్చిపెట్టాయి. బాలాంత్రపు రజనీకాంతరావు, మల్లికార్జున రావు నేర్పిన ఎన్నో పాటలు మృదుమధురంగా పాడేదామె. నల దమయంతి, శ్రీకృష్ణ తులాభారం నాటకాలు ఆలిండియా రేడియో వారు మద్రాసు మ్యూజియమ్ థియేటర్స్‌లో



టంగుటూరి సూర్యకుమారితో...

నిర్వహిస్తే అందులోనూ ప్రధాన భూమికలు పోషించిందామె. ఒక విధంగా చెప్పాలంటే ఈమె రేడియో 'తార'.

**మ**ద్రాసు కార్పొరేషన్ వాటర్ వర్క్స్ డిపార్టుమెంటులో ఇంజనీరుగా వున్న ఆవుల చంద్రబాబు నాయుడు నటుడుగా, దర్శకుడుగా కూడా వివిధ బాధ్యతలను నిర్వహించేవారు. **(ఒకప్పటి తమిళ సినీ హాస్య నటుడు చంద్రబాబు, ఈయన ఒకరు కాదు).**

'అనార్కలి' నాటకంలో కమలాదేవి, చంద్రబాబు నాయికా నాయకులుగా నటించారు. ఆ పరిచయమే ప్రణయంగా మారి దాంపత్య జీవితానికి దారితీసింది. ఆయన ఇచ్చిన ప్రోత్సాహమే కమలాదేవి ఇంత ఉన్నత స్థాయికి ఎదిగేలా చేసింది. చంద్రబాబు మరణించిన తర్వాత చాలా కాలం నిర్వేదంగా ఉండి పోయిన కమలాదేవి మానసికంగా షాక్ నుంచి కోలుకున్న అనంతరం తిరిగి 'కంచుకోట' (1967), 'బంగారు సంకెళ్ళు', 'అసాధ్యుడు' (1968) 'కథానాయకుడు', 'బంగారు పంజరం' (1969), 'పెత్తందార్లు' (1970) వంటి చిత్రాలలో పలురకాల పాత్రలు ధరించింది. "జమీందారు గారి అమ్మాయి" (1975) తర్వాత ఆమె ఏ చిత్రంలోనూ ఇప్పటిదాకా నటించలేదు.

**మొ**దట ఎంపిక చేసుకుని చివరి క్షణంలో సినిమాలోంచి పూర్తిగా తప్పించడం, పాత్ర ప్రాధాన్యాన్ని తగ్గించడం వంటి అనుభవాలను ఆమె ఎదుర్కొంది. "నేను సినిమా నుంచి కావాలని విరమించుకోలేదు... పాలిటిక్స్ వల్లే విరమించుకున్నాను. నేను ఏమిటో, నా నటనా ప్రతిభ ఏమిటో నాకు స్పష్టంగా తెలుసు. అందువల్లనే సినిమా కంపెనీల ఆఫీసులకు వెళ్ళి పాత్రలు ఇవ్వమని అడిగేదాన్ని కాదు. పైగా వేషాల వల్లనే బ్రతుకు సాగించాల్సిన అవసరం కూడా లేదు. ఎవరైనా పిలిస్తే వెడతాను. నా అంతట నేనే వెళ్ళి అడగలేను. ఈ కారణంగా పరిశ్రమ నన్ను గుర్తించి వుండక పోవచ్చు. అసహజమైన వాతావరణంతో రాజీ పడలేక పోతున్నాం! అందువల్లనే సినిమా రంగానికి దూరంగా, నాటకరంగానికి దగ్గరగా ఉంటున్నాను" అంటుంది కమలాదేవి.

**60** సంవత్సరాలుగా సినీ రంగంలో ఉన్న కమలాదేవి చక్కని నటి, గాయని గానే చాలా మందికి తెలుసు. కానీ ఆమె చక్కటి క్రీడాకారిణి కూడా. 1956లో చెన్నపురి ఆంధ్ర మహాసభలో బిలియర్డ్స్ ప్రారంభించినప్పటి నుంచి కమల ఆడటం మొదలు పెట్టి అనతి కాలంలోనే ఆ ఆటలో పట్టు సాధించి, సౌత్ ఇండియన్ బిలియర్డ్స్ టోర్నమెంటులో ఛాంపియన్ షిప్‌ను అందుకుంది. ఆల్ ఇండియా ఛాంపియన్ సెల్వరాజ్‌తో క్వార్టర్ ఫైనల్స్ వరకూ వచ్చింది. బాబ్ మార్షల్ అనే వరల్డ్ అమెచ్యూర్ స్నూకర్ ఛాంపియన్‌తో మైసూరు, బెంగుళూరుల్లో ఎగ్జిబిషన్ ఆటల్లో పాల్గొన్నది. 1990లో జంషెడ్‌పూర్‌లో టాటా ఇన్‌స్టిట్యూట్ నిర్వహించిన మహిళల జాతీయ బిలియర్డ్స్ పోటీలో ఈమె తన 62 ఏళ్ల వయసులో కూడా ఛాంపియన్‌గా విజయం సాధించింది. మనదేశంలో బిలియర్డ్స్ ఆడిన మొదటి మహిళగా, జాతీయ ఛాంపియన్ అయిన మొట్టమొదటి క్రీడాకారిణిగా దేశ చరిత్రలో చోటు సంపాదించుకుంది.



అలనాటి అందాలనటి కాంచనమాలతో...

**స**న్మానాలు చేయడమే గాని, సన్మానాలు పొందడానికి ఇష్టపడని కమలాదేవిని 1983లో కర్నూలులో జరిగిన ఆంధ్రప్రదేశ్ అకాడమీ నాటకోత్సవాలలో 'నాటక కళా ప్రపూర్ణ' బిరుదుతో సత్కరించారు. ప్రభుత్వం నుండి ఎటువంటి సన్మానాలు, ప్రోత్సాహకర బహుమతులూ, బిరుదులు పొందలేదు కమలాదేవి. అలా ప్రభుత్వం గుర్తించనందుకు బాధ కూడా లేదంటారామె.

**చె**న్నపురి ఆంధ్ర మహాసభతో కమలాదేవికి ఎంతో కాలంగా సంబంధ బాంధవ్యాలున్నాయి. 1950లో ఆ సభలో సభ్యురాలై 1956 నుంచి ఇప్పటి వరకు (భర్త మరణం వల్ల మధ్యలో ఓ నాలుగు సంవత్సరాలు గ్యాప్ వచ్చినా) కార్యదర్శిగా, అధ్యక్షురాలిగా ఉంటూ సేవ చేస్తున్నారు. ఈ సభ సాధించిన ప్రగతిలో ఈమె పాత్ర చాలా వుందనేది నిర్వివాదాంశం. సభ తరపున ఎంతో మందికి నటులుగా శిక్షణ ఇచ్చింది. ఉత్తమ నటులుగా తీర్చిదిద్దింది. ఎంతో మంది కళాకారులను, కవులను, గాయకులను నటులను ఘనంగా సన్మానింపచేసింది. ఏటా నాటక పోటీలు నిర్వహిస్తూ తమ వంతు బాధ్యతను సమర్థవంతంగా పోషిస్తున్న కమలాదేవి ఆంధ్ర మహాసభకు అంకితమయ్యిందనే చెప్పుకోవచ్చు.



బిలియర్డ్స్ ఛాంపియన్‌గా...

**నా**ట్య సంఘం తరపున అఫీషియల్ డెలిగేట్‌గా కమలాదేవి బెర్లిన్‌లో జరిగిన ప్రథమ ప్రపంచ మ్యూజికల్ కాన్ఫరెన్స్‌లో భారతదేశ ప్రతినిధిగా పాల్గొన్నది.

**మ**ద్రాసులో తనవద్ద బిలియర్డ్స్ నేర్చుకోవాలని ఆసక్తి కనబరుస్తున్న ఔత్సాహిక క్రీడాకారులకు ప్రోత్సాహాన్ని ఇవ్వడమే ఆమె తన లక్ష్యంగా పెట్టుకుంది. ఇప్పుడూ ఆమె ముఖంపై అదే చిరునవ్వు... అదే చైతన్యం... ఆమె మాటలలో అదే అంకితభావం.

**-కంపల్లె రవిచంద్రన్**




శాశ్వతంగా నిలిచిపోయే పాటలను ప్రజలు అందించిన చిత్రాలు తెలుగు సినీ సంగీత చరిత్రలో ఎన్నో ఉన్నాయి. తారాగణం, కథనం, సన్నివేశాలు, సాంకేతిక నిపుణుల వివరాలు వంటివి స్మృతిపథం నుంచి చెరిగిపోయినా పాటలు మాత్రం ప్రేక్షక శ్రోతల హృదయాలల్లో సుస్థిరంగా ఉండి, ఆయా పాటల ద్వారానే సదరు చిత్రం పేరుని గుర్తుకు తెచ్చుకునే సంఘటనలు కొన్ని సినిమాలకు వర్తిస్తాయి. అటువంటి చిత్రాలలో చెప్పుకోదగ్గ చిత్రం

# కాళహస్తి మహాత్మ్యం

ఈ చిత్రం 1954లో విడుదలయింది. హెచ్.ఎల్.ఎన్. సింహా ఈ చిత్రానికి దర్శకుడు. కన్నడ చిత్రరంగాన్ని మకుటం లేని మహారాజులా ఏలిన రాజ్‌కుమార్ ఈ చిత్రానికి కథా నాయకుడు. ఇదే అతని సినీ జీవితంలో తొలిచిత్రం కూడా! తెలుగులో 'కాళహస్తి మహత్మ్యం' పేరుతోను కన్నడంలో 'బేడర కన్నప్ప' పేరుతోను ఈ చిత్రాన్ని నిర్మించారు. 'పాతాళభైరవి' హీరోయిన్ మాలతి ఈ చిత్రంలో కథానాయిక. ముదిగొండ లింగమూర్తి, పద్మనాభం, రాజసులోచన తదితర ముఖ్యపాత్రధారులు. ఈ చిత్రానికి మాటలు - పాటలు తోలేటి, సంగీతం సుదర్శనం. శివునికి సంబంధించిన పర్వదినాలలో దేవాలయాలలో సైతం తప్పనిసరిగా వేసే విధంగా ఈ చిత్రంలోని భక్తి గీతాలు, పద్యాలు రూపొందాయి. అంతేకాదు, గాయకునిగా ఘంటసాల సంగీత జీవనయానంలో ఒక మహత్తరమైన మజిలీగా నిలిచి పోయాయి. 'కాళహస్తి మహత్మ్యం' చిత్రంలో తక్కిన పాటలెన్ని ఉన్నా ఘంటసాల పాడిన భక్తిగీతాలు, పద్యాలు మాత్రం సంగీత సాహిత్య గాన పరంగా ఈ నాటికీ ప్రామాణికంగా నిలిచిపోయాయి. అవి:

ఓం నమశ్శివాయా నవనీత హృదయా
తమః ప్రకాశా తరుణేందుభూషా నమో... శంకరా దేవదేవా
మహేశా పాపవినాశా కైలాసవాసా ఈశా
నిన్ను నమ్మినాను రావా నీలకంధరా దేవా ॥మహేశా॥
భక్తియేదో పూజలేవో తెలియనైతినే ॥భక్తి॥
పాపమేదో పుణ్యమేదో కాననైతినే దేవా ॥మహేశా॥
చ: మంత్రయుక్త పూజ సేయ మనసుకరుగునా ॥మంత్ర॥
మంత్రమో తంత్రమో ఎరుగనే
నాదమేదో - వేదమేదో తెలియనైతినే ॥నాద॥
వాదమేల పేదబాధ తీర్చరావయాస్వామి (2) ॥మహేశా॥
చ: ఏకచిత్తమున నమ్మిన వారికి శోకము తీర్చుము రుద్రయ్య
ప్రాకటముగ చిరువేట చూపి నా ఆకలి తీర్చగరావయ్య
దీటుగనమ్మితి గనవయ్య వేట చూపుమా రుద్రయ్యా (2)



కాళహస్తి మహత్మ్యం చిత్రంలో మిగిలిన పాటలతో పోలిస్తే ఎక్కువ మంది నోటికి పట్టేసిన పాట యిది. ఈ పాటకు లభించిన ప్రజాదరణ ఎంతటిదంటే - నడుస్తున్న రైళ్ళలో అడుక్కునే బిచ్చగాళ్ళు ఈ పాటను పాడే తమ పొట్ట పోసుకునే వారు. ఇది కొన్ని సంవత్సరాల పాటు నిరంతరంగా సాగింది. పాట సాహిత్యం పూర్తిగా రాకపోయినా, మొదటి చరణం వరకు మాత్రమే వచ్చినా, 'కైలాసా వాసా ఈశా' బదులు 'కైలాస వాసా వీసా' అంటూ పాడినా ప్రయాణికులు పట్టించుకునే వారు కాదు. ఆ పాట ప్రారంభించగానే ట్యూన్ అయిపోయేవారు.

ఈ పాటకు పీలూరాగం ఆధారం. పరువు - ప్రతిష్ట (ఎన్.టి.ఆర్. హీరో) సినిమాలో పెండ్యాల స్వరపరిచిన 'ప్రభు గిరిధారి శౌరీ రావయ్యా' అనే పాట 'చీకటి వెలుగులు' సినిమాలో చక్రవర్తి స్వరపరిచిన 'చీకటి వెలుగుల కౌగిలిలో' అనే పాటలోని 'గలగలమన కూడదు' అనే చరణం ఈ రాగంలో చెప్పుకోదగ్గ ఉదాహరణలు.

చేకొనవయ్య మాంసమిదే చెల్వుగ దెచ్చితి బాసచొప్పునన్
ఆకొనియుంటివేయో కడుపార బిరాన భుజించవయ్య
ఈ లోకులు చూడరయ్య భువిలోని క్షుదార్తుల బాధలెన్నడున్
శ్రీకర కాళహస్తి శశి శేఖరా దివ్య కృపాకరా హరా... హరా...



తనకు ఆహారాన్ని చూపితే సగం సమర్పిస్తానని దేవాలయంలోని శివలింగంతో తిన్నయ్య పలికి 'మహేశా పాప వినాశా' పాటను పాడిన తర్వాత శివుని లీల వలన ఎదురుగా రెండు కుందేళ్ళు కనిపిస్తాయి. వాటిని తన బాణంతో కూల్చి, కాల్చి - సగం వాటాగా గుడిలోని శివలింగానికి సమర్పించే సన్నివేశంలో పై పద్యం వస్తుంది. సందర్భం తెలిసిపోతూ అతి సులువుగా అర్థమై పోయే ఈ పద్యంలోని మూడవ వాక్యం విశ్వజనీనమైనది. హంసానంది రాగంలో స్వరపచబడిన ఈ పద్యంలోని చివరి పాదం వద్ద తొలిసారి 'హరా' అని ఘంటసాల పలుకుతున్నప్పుడు మన గుండెల్లోంచి ఆ స్వరం వెలువడిందా అన్నంత రసానుభూతి కలుగుతుంది. రెండవ సారి 'హరా' అంటూ ఘంటసాల చేసిన ఆలాపనలు యథాతథంగా సాధన చేస్తే హంసానంది రాగాన్ని ఎక్కడున్నా సరే పోల్చేసుకోగల జ్ఞానం వచ్చేస్తుంది.

దేవా సేవకులన్న నీచమతులై దీనాళి వేధించు దుర్భాగ్యుల్లీ నరజాతి
ఈ నరజాతి పూజకును ఆ బ్రహ్మాది దేవేంద్రతత్సేవా వ్రాతనువీడి
భిక్షకుడవై సేవింప ఈ బంటుకే ఈవే బంటుగ వచ్చినావు భళిరా
శ్రీకాళ హస్తీశ్వరా శ్రీకాళ హస్తీశ్వరా శ్రీకాళ హస్తీశ్వరా



తిన్నయ్య భక్తికి సంతోషించిన శివుడు ముసలి బ్రాహ్మణుని వేషంలో నీల (తిన్నని భార్య) ఇంటికి వచ్చి 'నేను కన్నయ్య బంటుని, మా యజమాని మీకివ్వమన్నార'ని చెబుతూ ఆహార పదార్థాలు, వస్త్రాలు ఇచ్చి వెళతాడు. ఇంటికి వచ్చిన కన్నయ్య నిజం తెలుసుకుని పని వాళ్ళను హీనంగా చూసే ఈ నరజాతిలో జన్మించిన నన్ను సేవించడానికి ఆ బ్రహ్మ, దేవేంద్రుల సేవలను విడిచి నీ బంటువైన నాకు బంటుగా, వచ్చావా అంటూ పులకించిపోతూ పాడే సందర్భంలో పై పద్యం వస్తుంది. మోహన రాగంలో ఈ పద్యం స్వరపరచబడింది.



మధురము శివ మంత్రం మహిలో
మరువకె ఓ మనసా (2)
ఇహ పర సాధనమే (5) నరులకు
సురుచిర తారకమే
ఇహ పర సాధనమే నరులకు సురుచిర తారకమే
ఆగమ సంచార... ఆగమ సంచార
నా స్వాగత మిదెగొనుమా ॥ఆగమ॥
భావజసంహారా (3) నన్ను కావగ రావయ్య ॥భావజ॥
పాలను ముంచెదవో... ॥పాలను॥
మున్నీటను ముంచెదవో ॥పాలను॥
భారమునీదయ్యా (2) పాదమువిడనయ్యా
నీ పాదము విడనయ్యా
జయహే సర్వేశా (2) సతీ శాంభవి ప్రాణేశా ॥జయహే॥
కారుణ్యగుణ సాగరా (2) శ్రీకాళ హస్తీశ్వరా నన్ను
కాపాడవా శంకరా ॥కారుణ్య॥ ॥మధురం॥



మరొక గొప్ప పాట యిది. త్రాసులో ఉండే సూచికగా సాహిత్యాన్ని భావించి సంగీతాన్ని, గానాన్ని, చెరోవైపు ఉంచితే సమతూకంలో తూగే పాట యిది. 'ఇహ పరసాధనమే' అనే వాక్యాన్ని అయిదుసార్లు రకరకాలుగా స్వరపరచటంలోను, పాడడంలోను అటు సుదర్శనం ఇటు ఘంటసాల - ఆధ్యాత్మిక అనుభూతికి సంగీతం ఎంతగా దోహదం చేస్తుందో ఋజువు చేసి చూపించారు. అలాగే 'పాలను ముంచెదవో' దగ్గర 'ఓఓ అంటూ ఘంటసాల ఆలపించిన తీరుకి గగుర్పాటు చెందని గుండెని హృదయం అనటానికి వీల్లేదు. ఈ పాటను యధాతథ రసభావాలతో పాడ గలిగిన ఏ గాయకుడైనా ఏ సినీ సంగీత పోటీలోనైనా బహుమతిని గెలుచుకుంటాడు.

ఈ పాటలో - 'మధురము శివ మంత్రం' నుంచి 'సురుచిర తారకమే' వరకు సింధుభైరవి రాగాన్ని, 'ఆగమ సంచార' నుంచి 'నన్ను కావగరావయ్యా' దాకా శుభపంతువరాళి రాగాన్ని వరాళి రాగాన్ని , 'పాలను ముంచెదవో' దగ్గర్నుంచి 'నీ పాదము విడనయ్యా' వరకు సామరాగాన్ని, 'కారుణ్యగుణ సాగరా' దగ్గర్నుంచి 'కాపాడవా శంకరా' వరకు కామవర్ధిని రాగాన్ని ఉపయోగించారు. ఒక్కసారి ఈ పాటను స్వంతం చేసుకొని చూడండి. సంగీత సాగరంలో ఈదటం తెలిసిపోయినంత భావన కలిగి తీరుతుంది.

జయజయ మహాదేవ శంభోహర శంకరా
సత్య శివసుందరా నిత్యగంగాధరా
బ్రహ్మావిష్ణుల్ సురల్ తాపసుల్
నిను వర్ణింపలేరన్న, నేనెంతవాడన్
దయాసాగరా...
భీకరారణ్య మధ్యంబునన్ - బోయనై పుట్టి
పశుపక్షి సంతానముల్ కూల్చి బక్షించు పాపాత్ముడన్
దివ్య జపహోమ తపమంత్ర
కృషిలేని జ్ఞానాంధుడన్
దేవుడేలేడు, లేడంచు
దూషించు దుష్టాత్ముడన్... దుష్టాత్ముడన్
విశ్వరూపా, మహామేరుచాపా
జగత్ సృష్టి సంరక్ష సంహార కార్యత్మలాపా
మహిన్ పంచభూతాత్మ నీవేకదా దేవ దేవా శివా
పృథ్విజలవాయురాకాశ తేజోవిలాసా మహేశా... ప్రభో...
రంగు బంగారు గంగాతరంగాల
రాజిల్లు, కాశీపురాధీశ విశ్వేశ్వర ॥కాశీ॥
నీలిమేఘాల కేళీవినోదాలలో తేలు
శ్రీశైల మల్లేశ్వరా ॥శ్రీశైల॥
కోటి నదులందు సుస్నానముల్ చేయు
ఫలమిచ్చు క్షేత్రాన వశియించు
శ్రీరామలింగేశ్వరా ॥శ్రీరామ॥



నిత్యగోదావరి నృత్యసంగీత
నీరాజనాలందు
ద్రాక్షారామవాసా భీమేశ్వరా... భీమేశ్వరా...
దివ్యఫల పుష్పసందోహ బృందార్చితానంద
భూలోకకైలాస శైలానవశియించు
శ్రీకాళ హస్తీశ్వరా (2)
దేవ దేవా... ఆ... ఆ... ఆ...
నమస్తే, నమస్తే నమస్తే నమః

అత్యద్భుతమైన స్పందనని, రసానుభూతిని కలిగించే స్వరరచన యిది. 'జయజయమహాదేవ' దగ్గర్నుంచి 'పాపాత్ముడన్' వరకు ఆరాభి రాగాన్ని 'దివ్యజపహోమ తపమంత్ర' దగ్గర్నుంచి 'తేజోవిలాసా మహేశప్రభో' వరకు దర్బారీని కానడని కలుపుకున్న మిశ్రమాన్ని' 'రంగు బంగారు గంగా తరంగాల' దగ్గర్నుంచి 'శ్రీశైల మల్లేశ్వరా' వరకు మోహనరాగాన్ని 'కోటి నందులందు సుస్నాముల్ చేయు' దగ్గర్నుంచి చివర్న వచ్చే 'నమస్తే నమస్తే నమస్తే నమః' వరకు హిందోళ రాగాన్ని ఉపయోగించారు.

సినీ సంగీతం మీద ప్రేమాభిమానాలు ఉన్న ప్రతి వారు సంగీత సాహిత్యాలతో సహా మొత్తం కంఠోపాఠం చేసి మనసులో పదే పదే మననం చేసుకోదగ్గ గొప్ప స్వర రచన యిది. అటువంటి 'స్వర వ్యాయామం' వలన చేకూరే మనోబలం - తద్వారా లభించే మానసిక ప్రశాంతత - కేవలం అనుభవైక వేద్యాలే తప్ప ఉదహరించి చెప్పడానికి సరిగా తూగేవి లేవనే చెప్పాలి.

స్వామీ చంచలమైన చిత్తమిదే నీ జ్ఞానాంజనా రేఖచే
నీమంబున నే నిశ్చలత్వమొదవెన్
నిండారు నీభక్తిచే కామ క్రోధవిరోధ వర్గములను చీకాకై నశించెన్
భవద్ధామంబౌ రజితాద్రి జేర్చా దయందా కాళహస్తీశ్వరా కాళహస్తీశ్వరా కాళహస్తీశ్వరా

ఈ పద్యం సింహేంద్ర మధ్యమం రాగంలో స్వరపరచబడింది. ఈ రాగంలో సినిమా పాటలు ఉదహరించే స్థాయిలో దొరకవు.

చండా హృతాశుకీలికలు చయ్యన గ్రక్కుచు దండధారి
మార్కండునిపై మహోగ్రగతి గ్రక్కున వైచిన కాలపాశమే
గ్రక్కున వైచిన కాలపాశమే
తుండెము లై పతాలుమని తూలిపడెన్
నిన్ను నమ్మువారికి దండన లేమి లెక్క
రజితాచలవాసా మహేశా ఈశ్వరా



పూజారి మాటలు విని మోసపోయిన జనం తిన్నయ్యని చెట్టుకు కట్టేయగా - నిన్ను నమ్మిన మార్కేండేయునిపై యముడంతటివాడు వేసిన కాలపాశమే పతాలు మని తెగిపోగా లేనిది - ఈ త్రాళ్ళు, ఈ దండన ఒక లెక్కా అంటూ తిన్నయ్య పాడిన సందర్భంలోనిది ఈ పద్యం. ఈ పద్యం కేదారగౌళ రాగంలో స్వరపరచబడింది. ఈ రాగాన్ని పోల్చుకోవాలంటే 'మహాకవి కాళదాసు'లో 'శ్యామలా దండకం'లోని 'చతుర్భుజే చంద్ర కళావతంసే' అనే శ్లోకాన్ని గుర్తుకు తెచ్చుకుంటే చాలు.

ఈ పద్యంలోనే తిన్నయ్యని బంధించిన త్రాళ్ళు తెగిపోవగా అతడు శివాలయానికి వెళుతుండగా వచ్చే పాట, ఆ తరువాత వచ్చే పద్యం యిది!



ధన్యుడనైతిని దేవ దేవా (2)
ఎన్నడైన మరువనయ్యా పాదసేవ
ఎన్నడైన మరువనయ్యా నీ పాదసేవ
పాహి శంకరా
మాం పాహి శంకరా
దీనాళి రక్షించు దేవ దేవా (2)
నాగతి నీవయ్య దేవ దేవా (2)
పాహి శంకరా మాం పాహి శంకరా (3)

దేవా దివ్యకృపాకరా భవహరా దీనావనా శంకరా
నీ వాలభ్యదృగంచలామృతాఝురుల్ నీ పుత్రుపై జల్లగా
భవాతీత మనోజ్ఞ
నేత్రములు విస్ఫారించినావా
ప్రభో... సేవా భాగ్యము కల్గ జేయుమా దయన్ శ్రీకాళ హస్తీశ్వరా శ్రీకాళహస్తీశ్వరా

ఈ పాట షణ్ముఖ ప్రియరాగంలో స్వర పరచబడింది. తర్వాత వచ్చే పద్యానికి శంకరాభరణం రాగంలోని స్వరాలను తీసుకుని స్వతంత్ర సంచారం చేస్తూ స్వరపరచడం జరిగింది.



ఈ పాటలు, పద్యాలన్నిటికీ రాజ్‌కుమార్ ఇచ్చిన అభినయాన్ని ఇవాళ చూడగలిస్తే - తన మాతృభాష కాకపోయినా తెలుగులో ఇంతటి క్లిష్ట సాహిత్యానికి... సినీ కళాకారుడుగా ఇది ఆయనకు మొదటి చిత్రమైనా సరే... ఆయన ఇచ్చిన లిప్ మూమెంట్‌ని చూస్తే కర్ణాటక రాష్ట్రం ఎందుకు ఆయన్ని మహానటుడిగా గౌరవించి నెత్తిన పెట్టుకుందో - వీరప్పన్ ఆయన్ని అపహరిస్తే (రిటైరై పోయిన తర్వాత కూడా) కన్నడ సినీరంగం షూటింగ్‌లు ఆపేసి ఎందుకు స్తంభించిపోయిందో అర్థం అవుతుంది. ఇవాళ అతి తేలికైన మాటలక్కూడా లిప్‌మూమెంట్‌ని-కనీకనిపించని రీతిలో - లాంగ్ షాట్‌లలో - కళ్ళు చెదిరే లొకేషన్స్‌లో - స్టెప్పుల మధ్య-మేనేజ్ చేసేసుకుంటున్న వారంతా ఒక్కసారి ఈ చిత్రంలో రాజ్‌కుమార్ నటన చూస్తే చాలు. తర్వాత దాన్ని ఒక సిలబస్‌లా స్వీకరించాలని అనిపించితీరుతుంది.

సంగీత పరంగా చివరగా ఒక్కమాటలో చెప్పాలంటే - ఈ చిత్రంలోని పాటలను పద్యాలను పంతం పట్టినట్టుగా రాక్షస సాధన చేసైనాసరే సాధించితే కొన్ని రాగాలపై కొంచెం పట్టును సంపాదించగలిగినట్టే.

# భక్త కన్నప్ప

రచన:వేటూరిసుందరరామమూర్తి సంగీతం: సత్యం గానం:యస్.పి.బాలు,బృందం

ఓం నమఃశ్శివాయ నమో భవాయ
ఓంకార స్వరూపాయ విరూపాయ
నమో విష్ణు రూపాయ విరూపాయ
అవ్యయాయ అనంతాయ అభవాయ నమోనమః
తకిటతక తకతకిట చకిత పదయుగళా
నికట గందస్నవిత మకుట తట నిగళా
హరిహరాంచిత కళా కలిత నీలగళా!
సాంద్రచ్ఛటాపటల నిటల చంద్రకళా
జయజయ మహాదేవ శివశంకరా
హరహర మహాదేవ అభయంకరా
అని దేవతలు శివుని కొనియాడ, పరవశ
మ్మున శివుడు తాండవమ్మాడగా
కంపించెనంతలో కైలాసమావేళ
కనిపించెనంతలో అకాల ప్రళయజ్వాల
జగములేలినవాని సగము నివ్వెరబోయె
సగము మిగిలినవాని మొగము నగవై పోయె
ఓం నమఃశ్శివాయ - ఓం నమఃశ్శివాయ
అతడే అతడే అర్జునుడు
పాండవ వీర యశోధనుడు
అనితర సాధ్యము పాశుపతాస్త్రము
కోరి ఇంద్రగిరి జేరి శివునికై
అహోరాత్రములు చేసెను తపస్సు
ఇది సృష్టించెను దివ్య మహస్సు
నెలవంక తలపాగ నెమలి ఈకగ మారె
తలపైన గంగమ్మ తలపులోనికి జారె
నిప్పులుమిసే కన్ను నిదురోయి బొట్టాయె
బూది పూతకు మారు పులితోలు వలువాయె
ఎఱుక గల్గిన శివుడు ఎరుకగా మారగా
తల్లి పార్వతి మారె తానె ఎరుకతగా
ఓంకార ధనువుగా ఒదిగె త్రిశూలమ్ము
కైలాసమును వీడి కదలి వచ్చెను శివుడు
శివుని ఆనతిని శిరమున దాల్చి
మూకాసురుడను రాక్షసుడు
వరాహ రూపము ధరించి వచ్చెను
ధరాతలమ్మే అదిరిపోవగా
చిచ్చర పిడుగై వచ్చిన పందిని
రెచ్చిన కోపముతో అర్జునుడు
మట్టుపెట్టగా పట్టి బాణము
ధనువొక చేతను అందుకొని
చూసిన కంటను చూడకనే - గురి
చూసినంతనే- వేసినంతనే
తలలు రెండుగా విలవిలలాడుచు
తనువు కొండగా గిరగిర తిరుగుచు
అటు నిటు తగిలిన రెండు బాణముల
అసువులు వీడెను వరాహము
కొట్టితి నేనని అర్జునుడు - పడగొట్టితినేనని శివుడు -
పట్టిన పట్టు వదలకనే తొడ కొట్టిన బీరముతో అపుడు-
వేటనాది వేటునాది వేటాడే చోటునాది
ఏటి తగవు పొమ్మని విలుమీటి పలికె శివుడు
చేవనాది చేతనాది చేటెరుగని ఈటె నాది
చేవుంటే రమ్మని కనుసైగచేసె అర్జునుడు -
గాండీవ పాండిత్య కళలుగా బాణాలు
కురిపించె అర్జునుడు - కానీ అపుడతడు
వేయి చేతుల కార్తవీర్యార్జునుడు
ఓంకార ఘన ధనుష్టంకారములతోడ
శరపరంపర కురిసె హరుడు - అయినా
నరుని కాతడు మనోహరుడు-
చిత్రమేమో గురిపెట్టిన బాణమ్ములు మాయమాయె
విధి విలాసమేమో పెట్టిన గురి వట్టిదాయే
అస్త్రములే విఫలమాయె - శస్త్రములే వికలమాయె
సవ్యసాచి కుడి ఎడమై సంధించుట మరచిపోయె -
జగతికి సుగతిని సాధించిన తల
దిగంతాల కవతల వెలిగే తల
గంగకు నెలవై కళకాదరువై
హరిబ్రహ్మలకు తరగని పరువై
అతిపవిత్రమై - అఘలవిత్రమై
శ్రీకరమై - శుభమైన శివుని తల
అదరగా - సృష్టి చెదరగా
తాడి ఎత్తు గాండీవముతో - ము
త్తాడి ఎత్తుగా ఎదిగి అర్జునుడు
చండ కోపమున కొట్టినంతనే
తల్లి తండ్రుల చలువ తనువైన దేవుడు
కోరిన వరాలిచ్చు కొండంత దేవుడు
ఎదుట నిలిచెను శివుడు ఎదలోని దేవుడు
పదము లంటెను నరుడు భక్తితో అపుడు
కరచరణ కృతంవా - కర్మ వాక్కాయజంవా
శ్రవణ నయనజంవా - మానసం వాపరాధం
విహిత మవిహితంవా - సర్వమే తత్క్షమస్వా
శివశివ కరుణాబ్దే - శ్రీ మహాదేవ శంభో
నమస్తే - నమస్తే నమస్తే నమః

## సీతారామ కళ్యాణం

సంగీతం:గాలిపెంచల నరసింహారావు　　గానం: ఘంటసాల

కానరార కైలాస నివాస
బాలేందు ధరా జటాధరాహర　　॥కానరార॥
భక్తజాల పరిపాల దయాళా
హిమశైలసుతా ప్రేమలోలా　　॥కానరార॥
నిన్నుజూడ మది కోరితిరా
నీ సన్నిధానమున చేరితిరా　　॥నిన్ను॥
కన్నడ సేయక కన్నులు చల్లగ
మన్నన సేయర గిరిజా రమణా　　॥కానరార॥
సర్వ భూషితాంగ కందర్ప దర్ప భంగా
సర్వ భూషితాంగ కందర్ప దర్ప భంగా
భవ పాశ నాశ పార్వతీ మనోహర
హే మహేశ వ్యోమకేశ త్రిపురహర　　॥కానరార॥

---

జయత్వదభ్ర విభ్రమ భ్రమ ద్భుజంగ మస్ఫుర
ద్ధగ ద్ధగ ద్వినిర్గమ తర్కాళ ఫాలహవ్యవాట్
ద్ధిమి ద్ధిమి ద్ధిమిధ్వనన్ మృదంగ తుంగ మంగళా
ధ్వనిక్రమ ప్రవర్తిత ప్రచండ తాండవశ్శివహో
ఓం నమః శ్శివాయః
అగర్వ సర్వమంగళా కళా కదంబ మంజరీ
రస ప్రవాహమాధురీ విజృంభణా మధూవ్రతం
స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంతకాంధ కాంతకం తమంత కాంతకం భజే
ఓం నమఃశ్శివాయః
ప్రపుల్లనీల పంకజ ప్రపంచకా విమచ్ఛటా
విడంబి కంఠకంధరా రుచి ప్రబంధ కంధరం
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదాంద కచ్ఛిదం తమంత కచ్ఛిదం భజే
ఓం నమఃశ్శివాయః

---

పరమ శైవాచార పరులలో నత్యంత
　　ప్రియుడన్న యశము కల్పించినావు
తల్లికోరిక దీర్ప దలచి వేడగ ఆత్మ
　　లింగమ్ము ప్రేమ నొసంగి నావు
మునుకుబేరుడు దోచుకొనిన లంకాపురీ
　　విభవంబు మరల నిప్పించినావు
తలచుటే తడవుగా దర్శన భాగ్యమ్ము
　　కరుణించి నీడవై కాచినావు
స్వామీ భవదీయ దర్శనోత్సాహి నగుచు దరియ
యీవేళ యీ నిషేధమ్ము లేల
వైర మేలయ్య మరచి నా నేరములను
కరుణ గనవయ్య కైలాస గిరినివాస

---

హే పార్వతీనాథ కైలాస శైలాగ్రవాసా
శశాంకార్ధ మౌళీ ఉమా దేవతోల్లాసి సవ్యాంగ భాగా
శ్రితానందదాయి స్మితాపాంగా భస్మీకృతానంద గంగాధరా
సర్వసంతాప హరా హరా
శివా సదాశివా - నీయున్న చందంబు నేనెంత
యూహింపగా వచ్చు - వేదములన్నీవ వాదమ్ములన్నీవ
ధైర్యంబులున్నీవ మర్మంబులున్నీవ
సర్వంబులున్నీవ - నీ లెంకలైనట్టి దాసుండనైనట్టి
నన్నున్ దయాళుండవై ప్రీతి రక్షింపవే
తప్పు సైరింపవే దేవ మన్నింపవే - దేవదేవా మహాదేవా
నమస్తే నమస్తే నమః

## భూకైలాస్

రచన:సముద్రాల　సంగీతం:సుదర్శనం, గోవర్ధనం　గానం:ఘంటసాల

దేవదేవ ధవళాచల మందిర గంగా ధర హర నమో నమో
దైవతలోక సుధాంబుధి హిమకర లోక శుభంకర నమో నమో
పాలితకింకర భవనా శంకర శంకరపురహర నమో నమో
హాలాహలధర శూలాయుధకర శైలసుతావర నమో నమో
దురితవిమోచన ఫాలవిలోచన పరమదయాకర నమో నమో
కరిచర్మాంబర చంద్రకళాధర సాంబదిగంబర నమో నమో
నమో నమో నమో నమో
నమో నమో నమో నమో నమో నమో నమో నమో

## భూకైలాస్

రచన:సముద్రాల　సంగీతం:సుదర్శనం, గోవర్ధనం　గానం:ఘంటసాల

జయ జయ మహాదేవ శంభో సదాశివా
ఆశ్రితమందారా శృతిశిఖర సంచారా
ప: నీలకంధరా దేవ దీనబాంధవా రావా నన్ను గావరా (2)
సత్యసుందరా స్వామి నిత్యనిర్మలపాహి　　॥నీల॥
చ: అన్యదైవముగొలువా నీదుపాదము విడువా (2)
దర్శనమ్ము నీరా మంగళాంగ గంగాధరా హరా　॥నీల॥
చ: దేహియన వరములిడు దాన గుణశీలా
పాహియన్నను ముక్తినిడు పరంధామా
నీమమున నీ దివ్యనామ సంస్మరణ
ఏమరక చేయుదును భవతాప హరణా
నీ దయామయ దృష్టి దురితమ్ములార
వరసుధావృష్టి నా వాంఛలీడేరా
కరుణించు పరమేశ దరహాసభాసా
హరహర మహాదేవ కైలాసవాసా... కైలాసవాసా
ఫాలలోచన నాదు మొరవిని జాలిని పూనవయా
నాగభూషణ నన్ను కావగ జాగునుసేయకయా ॥పాల॥
కన్నుల నిండుగ భక్తవత్సల కానగరావయ్య
ప్రేమమీర నీదుభక్తుని మాటను నిల్పవయా
శంకరా శివశంకరా అభయంకరా విజయంకరా

## భక్త కన్నప్ప

రచన:వేటూరి సుందరరామమూర్తి

సంగీతం: సత్యం　　గానం: వి. రామకృష్ణ

శివ శివ శంకరా భక్తవశంకరా
శంభో హరహర నమో నమో
పుణ్యము పాపము ఎరుగని నేను
పూజలు సేవలు తెలియని నేను
ఏ పూలు తేవాలి నీ పూజకు
ఏ లీల సేయాలి నీ సేవలు　　॥శివ॥
మా రేడు నీవని ఏరేరి తేనా
మారేడు దళములు నీ పూజకు
గంగమ్మ మెచ్చిన జంగమయ్యవని
గంగను తేనా నీ సేవకు　　॥శివ॥

## భక్త కన్నప్ప

రచన: ఆరుద్ర | సంగీతం: సత్యం | గానం: రామకృష్ణ

ఓం నమశ్శివాయ
శ్రీకంఠ లోకేశ శ్రీ కాళహస్తీశ
చిద్రూప కారుణ్య కల్పద్రుమా
భక్త చింతామణి ఆర్తరక్షామణి-
శర్వ సర్వజ్ఞ సర్వాత్మకా
నీ పదాబ్జములన్ నెమ్మదిన్ నిల్పి
పల్మాగ జీవమ్ము లేకాగ్రతన్
ఉగ్రతన్ నిన్ను భావించి సేవించ సాయుజ్యమిచ్చావు తండ్రీ
మదాంధుడనై - మొండినై -
నిన్ను దుర్భాషలన్ ఎన్ని దూషించినా
దివ్యలింగమ్ము - భంగమ్ము కావింపగా జూచినా
సర్వలోకోత్తరంబైన నీ విశ్వరూపమ్ము జూపించినావే -
నన్ను దీవించినావే
కర్మ పరిపక్వమున్‌జేసి కైవల్య మియ్యంగా లేవా
ప్రభో - పాహిమాం - పాహిమాం - పాహిమాం
శ్రీ కాళహస్తీశ్వరా హరహర

కరుణించి నను బ్రోవరా - దేవర
కైవల్య పదమీయరా
ఆలయమన్నది లేదని నీకైవ అల్లెను గుడులను సాలీడు
ఆ భక్తుడు నీవవు సంశోధించ అగ్నిపరీక్షను పొందాడు
నీ గుడిరూపము చెరిచిన దీపము మ్రింగదలచెను పురుగు
ఆ భక్తికి ఎంతో రక్తిని చెంది ముక్తి నొసంగిన దేవా॥శ్రీ కాళ॥
పన్నగ మొక్కటి ప్రతి ఉదయమ్మున
ఎన్నో మణులను తెచ్చేదీ, నిన్నే పూజించేది
పాము యొనర్చిన పూజను మెచ్చక,
ఏనుగు దానిని తుడిచేదీ, వేరే పూజలు చేసేదీ
ఒకరు యొనర్చిన పూజల నొల్లని
కరికాళమ్ములు పగబూనీ, తరుణముకై వేచినవీ
తుండమునండి దూరిన పాము - మెండుగ గజమును బాధించే
కొండను మోదగ -కుంభము పగులగ రెండొక తరి మరణించే
నీకై పోరిన ఆ ప్రాణులకు నీ సాయుజ్యము లభియించే
జంతుసంతతికి యిచ్చిన మోక్షము సదాశివా - దయచేయవా

## పూజాఫలము

రచన: ఘనం శీనయ్య. సంగీతం: యస్. రాజేశ్వరరావు. గానం: యస్. జానకి

శివదీక్షాపరురాలనురా - నే
శీల మింతైన విడువజాలనురా నే
శివదీక్షాపరురాలనురా
శివ శివ గురు నాజ్ఞ మీరనురా నే
శ్రీ వైష్ణవుడంటే చేరనురా - నే ॥శివదీక్షా॥
వడిగ వచ్చి మఠము చొరవకురా
శివార్చన వేళ తలుపు తెరవకురా
నా మడుగుకావిచెరగు తీయకురా
మాటిమాటికి నోరు మూయకురా ॥శివదీక్షా॥

## మల్లమ్మ కథ

రచన: దాశరథి | సంగీతం: సత్యం | గానం: పి. సుశీల

ప: భవహరణా శుభచరణా నాగాభరణా గౌరీరమణా
దిక్కేలేని దీనులపాలిట దిక్కైవెలసిన దేవుడవయ్యా...
చ: నీ భక్తులకు పెన్నిధినీవే మా కన్నులలో వున్నది నీవే
నిండు మనసుతో నీ వారొసగే
గరిక పూలకే మురిసేవయ్యా ॥భవహరణా॥
చ: నందివాహనం వుందంటారు కందిపోయెనీ కాళ్లెందుకయా
మంచుకొండ నీ యిల్లంటారే ఒళ్లంతా ఈ వేడెందుకయా
అన్నపూర్ణనీ అండనుండగా
ఆకలిబాధ నీకెందుకయా ॥భవహరణా॥

## సువర్ణసుందరి

రచన: సముద్రాల | సంగీతం: పి. ఆదినారాయణరావు | గానం: పి. సుశీల

ఓ... ఓ... ఓ... ఓం నమశ్శివాయః సిద్ధంనమః ఓం... ... ...
జగదీశ్వరా - పాహి పరమేశ్వరా
జగదీశ్వరా - పాహి పరమేశ్వరా
దేవా పురసంహరా - ధీరా నటశేఖరా
త్రాహికరుణాకరా - వాహిసుర శేఖరా
ఆ ఆ ఆ ... ॥జగదీశ్వరా॥
శంభోహరా - వినుత లంబోదరా - అంబావరా కావరా
ఆ ఆ ఆ ... ॥శంభో హరా॥
వరమీయరా గౌరివరసుందరా - గౌరీ వరసుందరా
నిన్నే కని మేము కొలిచేము గంగాధరా
దేవ గంగాధరా ఆ ఆ ... ॥జగదీశ్వరా॥
ప్రమధులు పాడా ఫణిగణ మాడా - పార్వతి సయ్యాడా

మౌనివరుల్ నిను మనసారా - గని పారవశ్యంబున కొనియాడ
ఆ ఆ ఆ ఆ ... ॥ప్రమధులు పాడా॥
నడిపెడు సుందర నటనకు జతులిడ
నందియ మర్దళనాదమే
మధురాతి మధుర శృతిగీతమే
తధిమి ధిమిత ధిమితైతై తయ్యని
తాండవ మాడెడు పాదమే
మది సేవించిన సమ్మోదమే
జగంబులా ఏలికా - శివకామసుందరి నాయకా
ఆ ఆ ఆ ఆ ... ॥ప్రమధులు పాడా॥

## సిరివెన్నెల

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి సంగీతం: కె.వి.మహదేవన్ గానం: బాలు

ఆదిభిక్షువు వాడి నేది కోరేది
బూడిదిచ్చేవాడినేది అడిగేది
తీపి రాగాల ఆ కోకిలమ్మకు - నల్ల
రంగునలమిన వాడి నేది కోరేది
కరకు గర్జనల మేఘముల మేనికి మెరుపు
హంగు కూర్చిన వాడినేది అడిగేది ॥ఆదిభిక్షువు॥

తేనెలొలికే పూల బాలలకు మూన్నాళ్ల
ఆయువిచ్చిన వాడినేది కోరేది
బండరాలను చిరాయువుగ జీవించమని
ఆనతిచ్చిన వాడినేది అడిగేది ॥ఆదిభిక్షువు॥

గిరిబాలతో తనకు కళ్యాణమొనరింప
దరిజేరు మన్మథుని మసిజేసినాడు
వరగర్వమున మూడులోకాలు పీడింప
తలపోయు దనుజులను కరుణించినాడు
ముఖప్రీతి కోరేటి ఉబ్బు శంకరుడు
ముక్కంటి ముక్కోపి తిక్క శంకరుడు ॥ఆదిభిక్షువు॥

## వినాయక విజయం
(విశ్వసందర్శనం)

రచన: వీటూరి సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: శైలజ, రమేష్

శ్రీమన్మహా దేవదేవా అమేయ ప్రభావా భవా
భవ్య కారుణ్య భావా శివా
భవానీ ప్రియా చిన్మయానంద హృదయా అద్వయా
దివ్య పంచాక్షరీ వేద మంత్రాలయా అవ్యయా
ప్రకృతీ పురుషులై శక్తియున్ నీవు ఆధార చక్రాన
విహరించి - సంరక్తితో సృష్టి గావించి పాలించవే
సూర్య చంద్రాగ్నులే - నీదు నేత్రాలుగా
నాల్గు వేదాలు నీ శంఖు నాదాలుగా
భూమి నీ పాదపీఠమ్ముగా గంగయే నీ శిరో రత్నముగా
తేజమే నీకు నీరాజనమ్ముగా
వాయువే వింజామరమ్ముగా - నభము ఛత్రమ్ముగా
పంచ భూతాలు సతతమ్ము సేవించగా
సప్తపాదోనిధుల్ - సుప్త శైలేంద్రముల్
సర్వలోకాలు - తీర్థాలు నీ కుక్షిలో సదా
ప్రక్షిప్తమై యుండవే
విశ్వరూపా నమో వేద భువన ప్రదీపా
సంతతానంద కేళీకలాపా
జగద్గీత కీర్తీ లసత్ భూతవర్తీ
సదానందమూర్తీ నమో దేవతా చక్రవర్తీ
నమస్తే... నమస్తే... నమః...

## కృష్ణవేణి

సంగీతం: విజయ భాస్కర్ గానం: పి. సుశీల

ప: శ్రీశైల మల్లయ్య దైవమే నీవయ్యా
శ్రీ భ్రమరాంబాతో వెలసిన జంగమయ్యా
చ: ఇదియే దక్షిణ కైలాసము
ఇది నాగార్జున నివాసము
ఈ శిఖర దర్శనమే
ఈ శిఖర దర్శనమే - పాప హరము
భక్త కోటికి జన్మ పావనము ॥శ్రీశైల॥
చ: పర్వతుడు నినుకొలిచి మెప్పించగా
చంద్రమతి మల్లెపూల పూజించగా
మల్లికార్జున రూపమై
మల్లికార్జున రూపమై వెలిశావులే
తెలుగు గడ్డకు ముక్తినిచ్చావులే ॥శ్రీశైల॥

## పాండురంగ మహాత్మ్యం
రచన: సముద్రాల జూనియర్

సంగీతం: టి.వి. రాజు గానం: ఘంటసాల

హర హర హర శంభో - శంభో
హిమగిరి శృంగ విహారీ
ఉమానాథ శివగంగాధారీ
చంద్రచూడ చర్మాంబరధారీ
ఈశగిరీశ పురారీ ॥శంభో॥
శివశివ అక్షయలింగా
మహాలింగ స్మరగర్వవిభంగా
భక్త శుభంకర కరుణాపాంగ
వృషభతురంగ శుభాంగ ॥శంభో॥

## ఉషా పరిణయం

సంగీతం: యస్. హనుమంతరావు గానం: మాధవపెద్ది, లీల, జమునారాణి

బాణాసురుడు :
దేవా హరహర మహాదేవ శంభో - పార్వతీనాథా
జయమహాదేవ శంభో
గిరిజారమణా శివపరాత్పరా ॥జయ॥
హరహర శంకర భక్తవశంకర
కరుణాభరణా పావన చరణా
నిరతము నిన్నే స్మరింతుమయ్యా
పరమపురుష మముబ్రోవుమా ॥జయ॥
రత్నవల్లి:
శరణు శరణు శ్రితమందార - దురితవిదూరా చంద్రశేఖర
మొరలాలించి పాలించరాదేవ - కైలాస నివాసా ఈశ్వర
నిరతము నిన్నే స్మరింతుమయ్యా
పరమ పురుష మము - బ్రోవుమా ॥జయ॥
ఉష: దయచేసినావదేవా మము - ఆదరించిబ్రోవ పతితపావన
భక్త జనావన సృష్టి స్థితి లయకారణా
నిరతము - నిన్నే స్మరింతుమయ్యా
పరమపురుష మము బ్రోవుమా ॥జయ॥

## వినాయక విజయం

రచన: వేటూరి సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: ఎస్.పి. బాలు, కోరస్

ఓంకారనాద ప్రణవాంకిత జీవనాయ
సాకారరూప నిఖిలాంతర చిన్మయాయ
కామేశ్వరీ ప్రణయ రంజిత మానసాయ
హరాయ శుభకరాయ నమశ్శివాయ
నమో నమో తాండవకేళీలోలా నమో నమో ఆశ్రితజనపాలా
దయాకిరణముల ప్రసరించే - మీ
చూపుల సుమధుర భావనలు
ఈ జగతికి చల్లని దీవెనలు ॥నమో॥
అలనాడు - అమృతమును ఆశించి
పాలకడలి మథియించగా
హాలాహలమే ప్రభవించి - విష జ్వాలలే వెదజల్లగా
అభయమొసంగీ - గరళము మింగీ
జగములగాచిన జగదీశా - పరమేశా ॥నమో॥
పృథివి రథముగా - రవి చంద్రులే చక్రాలుగా
నాల్గు వేదములె హయములుగా
బ్రహ్మ దేవుడే సారథిగా - మేరు పర్వతమే విల్లుగా
శ్రీహరి అస్త్రముకాగా
ప్రళయకాల పర్జన్య గర్జనగ - భీషణ శంఖము పూరించి
పాశుపతమ్మును సంధించి - త్రిపురాసురులను వధియించి
లోకాలను గాచిన దేవా - మా
శోకము బాపిన - మహానుభావా ॥నమో॥

## భక్త జయదేవ

రచన: సముద్రాల రాఘవాచార్య
సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: రామానుజా చార్యులు

హర హరా జయకరా శంభో
కోరికదీరా నీ పదయుగమే
కొలుచువాడ దయరానీర త్రినయన హరహరా
భగ భగ భగ భగ కన్నుగవా ప్రళయకాలవహ్ని జ్వాలలెగయా
రిపుబలమూ బలిగొలినా త్రిపుహరా విజయధరా విజయధరా

## వినాయక విజయం

### అర్ధనారీశ్వర స్తుతి

రచన: వేటూరి సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: శైలజ, రమేష్

ఒక వంక వరనీల కబరీ భరమ్ము
ఒక వంక ఘనజటా జూట భరితమ్ము
ఒక వంక మణి మయోజ్వల కుండలాలు
ఒక వంక భయద పన్నగ భూషణాలు
ఒక వంక కారుణ్య అవలోకనాలు
ఒక కంట విస్ఫులింగ గచ్ఛటాలు
ఒక వంక రమణీయ కాంచనాంబరము
ఒక వంక నిర్వికారము దిగంబరము
ఒక పదమ్మున ప్రణయ నాట్య విన్యాసమ్ము
ఒక పదమ్మున ప్రళయ తాండవ విజృంభణము
విశ్వశ్రేయార్థకము సృష్టి పరమార్థమ్ము
శక్తి శివ శక్తుల సంగమ స్వరూపమ్ము
సర్వ రక్షాకరము దుష్ట పీడా హరము - అనశ్వరము
శుభకరము - అర్ధనారీశ్వరము

## సత్యహరిశ్చంద్ర

రచన: పింగళి సంగీతం: పెండ్యాల గానం: ఘంటసాల, యస్. వరలక్ష్మి

హే చంద్రచూడ మదనాంతక శూలపాణే
స్థాణో గిరీశ గిరిజేశ మహేశ శంభో
హే పార్వతీ హృదయవల్లభ చంద్రమౌళే
భూతాధిప ప్రమథనాథ గిరీశ చాప
నమో భూతనాథ - నమో దేవదేవ
నమో భక్తపాల - నమో దివ్యతేజా
భవా వేదసారా - సదా నిర్వికారా
జగాలెల్లబ్రోవ - ప్రభూ నీవె కావా
నమో పార్వతీ వల్లభా నీలకంఠా ॥నమోభూత॥
సదా సుప్రకాశా - మహాపాపనాశ
కాశీ విశ్వనాథా - దయా సింధు నీవే
నమో పార్వతీ వల్లభా నీలకంఠా ॥నమోభూత॥

## సాగర సంగమం

రచన: వేటూరి సంగీతం: ఇళయరాజా గానం: యస్. జానకి

ఓం... ఓం... ఓం...
ఓం నమశ్శివాయ ॥ఓం॥
చంద్రకళాధర సహృదయా ॥చంద్ర॥
సాంద్రకళా పూర్ణోదయ లయ నిలయా
ఓం... ॥ఓం నమశ్శివాయ॥

పంచ భూతములు ముఖ పంచకమై
ఆరు ఋతువులు ఆహార్యములై ॥పంచ॥
ప్రకృతి పార్వతి నీతో నడచిన
ఏడు అడుగులే స్వర సప్తకమై
సా గ మా దా ని సా గ
గా మ దా ని సా గా మ
గ గ గ... స స స...
నీ గా... మ ద స ని ద మ గ స
నీ ద్రుక్కులే అటు అష్టదిక్కులై
నీ వాక్కులే నవరసమ్ములై
తాపస మందారా... ఆ...
నీ మౌనమే... దశోపనిషత్తులై ఇలవెలయా
ఓం... ఓం... ॥ఓం నమశ్శివాయ॥

త్రికాలములు నీ నేత్ర త్రయమై
చతుర్వేదములు ప్రాకారములై ॥త్రికాలములు॥
గజముఖ షణ్ముఖ ప్రమదాధులు
నీ సంకల్పానికి ఋత్విజవరులై
అద్వైతమే నీ ఆది యోగమై
నీ లయలే ఈ కాల గమనమై
కైలాస గిరివాస నీ గానమే
జంత్ర గాత్రములు శృతి కలయా
ఓం... ఓం... ॥ఓం నమశ్శివాయ॥

## శ్రీ మంజునాథ

రచన: వేదవ్యాస      సంగీతం: హంసలేఖ      గానం: శంకర్‌మహదేవన్

ఓమ్ మహాప్రాణ దీపమ్ శివమ్ శివమ్
మహోంకార రూపమ్ శివమ్ శివమ్
మహా సూర్య చంద్రాగ్ని నేత్రమ్ పవిత్రమ్
మహా గాఢ తిమిరాంతకమ్ సౌరగాత్రమ్
మహాకాంతి బీజమ్ - మహా దివ్యతేజమ్
భవానీ సమేతమ్ - భజేమంజునాధమ్

ఓమ్ నమశ్శంకరాయచ -మయస్కరాయచ
నమశ్శివాయచ - శివతరాయచ - భవహరాయచ
మహా ప్రాణదీపమ్ - శివమ్ శివమ్
భజే మంజునాధమ్ - శివమ్ శివమ్
అద్వైత భాస్కరమ్ -అర్ధనారీశ్వరమ్
త్రిదశ హృదయంగమమ్ -చతురుదధి సంగమమ్
పంచ భూతాత్మకమ్ - షట్శత్రునాశకమ్
సప్తస్వరేశ్వరమ్ -అష్టసిద్ధీశ్వరమ్
నవరస మనోహరమ్ -దశదిశా సువిమలమ్
ఏకాదశోజ్జ్వలమ్ -ఏకనాథేశ్వరమ్
ప్రస్తుతివశంకరమ్ -ప్రణత జనకింకరమ్
దుర్జన భయంకరమ్ -సజ్జన శుభంకరమ్
ప్రాణిభవతారకమ్ -ప్రకృతి హిత కారకమ్
భువన భవ్యభవనాయకమ్ -భాగ్యాత్మకమ్ రక్షకమ్
ఈశమ్ సురేశమ్ -వృషేశమ్ పరేశమ్
నటేశమ్ గౌరీశమ్ -గణేశమ్ భూతేశమ్
మహామధుర పంచాక్షరీ మీమంత్ర మార్షమ్
మహాహర్ష వర్ష ప్రవర్షమ్ సుశీర్షమ్

ఓమ్ నమోహరాయచ స్వరహరాయచ పురహరాయచ
రుద్రాయచ భద్రాయచ ఇంద్రాయచ
నిత్యాయచ నిర్నిద్రాయచ
మహాప్రాణదీపం-శివమ్ శివమ్
భజే మంజునాధమ్-శివమ్ శివమ్
ఢంఢంఢ ఢంఢంఢ ఢంఢంఢ ఢంఢంఢ
ఢక్కా నినాద నవతాండవాడంబరమ్
తద్ధిమ్మి తకధిమ్మి ధిద్ధిమ్మి ధిమిధిమ్మి
సంగీత సాహిత్య సుమకమల బంభరమ్
ఓంకార హ్రీంకార శ్రీంకార హైంకార
మంత్రబీజాక్షరమ్ మంజునాథేశ్వరమ్

ఋగ్వేద మాధ్యమ్ -యజుర్వేదవేద్యమ్
సామప్రగీతమ్ -అధర్మ ప్రభాతమ్
పురాణేతిహాస ప్రసిద్ధమ్ విశుద్ధమ్
ప్రపంచైక సూత్రమ్ -విబుద్ధమ్ సుసిద్ధమ్
నకారమ్ మకారమ్ - శికారమ్ వకారమ్
యకారమ్ నిరాకార సాకార సారమ్
మహాకాల కాలమ్ మహానీల కంఠమ్-మహానంద
నందమ్ మహాట్టాట్ట హాసమ్
జటాజూట రంగైక గంగా సుచిత్రమ్
జ్వాల ద్యుగ్ర నేత్రమ్ సుమిత్రమ్ సుగోత్రమ్
మహాకాశ భాస్వన్మహాభానులింగమ్
మహాబభ్రు వర్ణమ్ సువర్ణమ్ ప్రవర్ణమ్
సౌరాష్ట్ర సుందరమ్ -సోమనాథేశ్వరమ్
శ్రీశైల మందిరమ్ -శ్రీమల్లికార్జునమ్
ఉజ్జయిని పుర-మహా కాళేశ్వరమ్
వైద్యనాథేశ్వరమ్ -మహా భీమేశ్వరమ్
అమరలింగేశ్వరమ్ రామలింగేశ్వరమ్-కాశీవిశ్వేశ్వరమ్
పరం ఘృశ్మేశ్వరమ్
త్ర్యంబకాధీశ్వరమ్ - నాగలింగేశ్వరమ్
శ్రీ... కేదారలింగేశ్వరమ్

అప్లింగాత్మకమ్ -జ్యోతి లింగాత్మకమ్
వాయులింగాత్మకమ్ -ఆత్మలింగాత్మకమ్
అఖిల లింగాత్మకమ్ -అగ్ని సోమాత్మకమ్

అనాదిమ్ అమేయమ్ అజేయమ్ అచింత్యమ్
అమోఘమ్ అపూర్వమ్ అనంతమ్ అఖండమ్॥అనాదిమ్॥
ధర్మస్థల క్షేత్ర వరపరంజ్యోతిమ్

ఓం నమస్సోమాయచ -సౌమ్యాయచ
భవ్యాయచ -భాగ్యాయచ
శాంతాయచ -శౌర్యాయచ
యోగాయచ -భోగాయచ
కాలాయచ -కాంతాయచ
రమ్యాయచ -గమ్యాయచ
ఈశాయచ -శ్రీశాయచ
శర్వాయచ -సర్వాయచ

## శుభోదయం

రచన: వేటూరి      సంగీతం: కె.వి. మహదేవన్      గానం: పి. సుశీల

ప: నటనం ఆడెనే... భవ తిమిర హంసుడా
పరమశివుడు నటకావతంసుడై తకధిమి తకయని
నటనం ఆడెనే
చ: ఎనిమిది దిక్కులు ఒక్కటైనటుల
ఎండవెన్నెలై వెల్లువైనటుల
నిటాలాక్షుడే తుషారాద్రి విడి
విశాలాక్షితో తాళలయగతుల

చ: వసుధ వసంతా లాలపించగా
సురలు సుధలు ధరలో కురిపించగా
రతీ మన్మథులు కుమార సంభవ
శుభోదయానికి నాంది పలుకగా ॥నటనం ఆడెనే॥
చ: శివగంగ శివమెత్తి పొంగగా
నెలవంక సిగపువ్వు నవ్వగా
హరిహరాత్మక మగుచు అఖిల ప్రపంచమ్ము
గరుడనాగానంద కావ్యమై వరలగా నటనం ఆడెనే...

## అమెరికా అమ్మాయి

రచన: సి. నారాయణ రెడ్డి | సంగీతం: జి.కె. వెంకటేష్ | గానం: పి. సుశీల

ఆనంద తాండవమాడే
శివుడు అనంతలయుడు
చిదంబర నిలయుడు ॥ఆనంద॥
నగరాజసుత
చిరునగవులు చిలుకంగ
సిగలోన వగలొలికి
ఎగిరి ఎగిరి దూకంగ సురగంగ ॥ఆనంద॥
ప్రణవనాదం ప్రాణంకాగా
ప్రకృతి మూలం తానంకాగా
భువనమ్ములే రంగ భూమికలుకాగా
భుజంగ భూషణుడు అనంగ భీషణుడు
పరమ విభుడు గళధరుడు
భావరాగ తాళమయుడు సదయుడు ॥ఆనంద॥
ఏమి శాంభవ లీల
ఏమా తాండవ హేల
అణువణువులోన దివ్యానందరసడోల
సురగరుడులు ఖేచరులు
విద్యాధరులు
నిటలతట ఘటిత
నిజకర కమలులై
నిలువగా
పురహరాయని పిలువగా కొలువగా ॥ఆనంద॥
కిణ కిణ కిణ కిణ
మణినూపురముల
ఝణత్కారములు మ్రోయగా
ధిమిధిమి ధిమిధిమి
ఢమరు ధ్వానము
దిక్తటముల మార్మ్రోయగా
విరించి తాళము వేయగా
హరి మురజము మ్రోయింపగా
ప్రమధులాడగా
అప్సరసలు పాడగా
ఆడగా
పాడగా ॥ఆనంద॥

## 'రహస్యం'లో గిరిజా కళ్యాణం యక్షగానం

రచన: మల్లాది రామకృష్ణశాస్త్రి | సంగీతం: ఘంటసాల | గానం: ఘంటసాల, సుశీల, మల్లిక్, ఎ.పి. కోమల, వైదేహి

అంబా పరాకు దేవీ పరాకు మమ్మేలు మా శారదాంబా పరాకు
॥అంబా॥
ఉమామహేశ్వర ప్రసాద లబ్ధపూర్ణ జీవనా గజననా
బహుపరాక్! బహుపరాక్!
చండభుజామండల దోధూయమాన వైరిగణా షడాననా
బహుపరాక్! బహుపరాక్!
మంగళాద్రి నారసింహ, బహుపరాక్! బహుపరాక్!
బంగరుతల్లి, కనకదుర్గ, బహుపరాక్! బహుపరాక్!
కృష్ణా తీర కూచనపూడి నిలయా గోపాలదేవ బహుపరాక్!
అవధరించరయ్యా, విద్వల నాదరించరయ్యా!
లలితకళల విలువ దెలియు సరసులు
పదింపదిగ పరవశులై అవధరించరయ్యా!
ఈశుని మ్రోల, హిమగిరిబాల
కన్నెతనము ధన్యమైన గాథ అవధరించరయ్యా!
కణకణలాడే తామసాన కాముని రూపము బాపి, ఆ కోపి
కాకలుదీరి, కనుదెరచి; తనుదెలసి
తన లలనను పరిణయమైన ప్రబంధము అవధరించరయ్యా!
రావో, రావో లోల లోల లోలంబాలక రావో!
లోకోన్నత మహోన్నతుని తనయా, మేనాకుమారీ,
రాజసులోచన, రాజాననా రావో!
చెలువారు మోమున లేలేత నగవుల, కలహంస గమనాన,
కలికీ ఎక్కడికే?
మానస సరసిని మణి పద్మదళముల రాణించు
అల రాజహంస సన్నిధికే
వావిలి పూవుల మాలలు గైసేసి ॥వావిలి॥
వయ్యారి నడల బాలా, ఎక్కడికే?
కన్నార నన్నేల కైలాస నిలయాన
కొలువైన ఆలదేవదేవు సన్నిధికే!
తగదిది తగదిది తగదిది
ధరణీ ధర వరసుకుమారీ, తగదిదీ!
అండగా మదనుడుండగా మన విరిశరముల పదనుండగా
నిను బోలిన కులపావని తానై వరునరయగ పోవలెనా?
కోరిక వాడెవడైనా, ఎంతటి ఘనుడైనా
కోలనేయనా సరసను కూలనేయనా?
కనుగొనల ననమొనల గాసి జేసి నీదాసుజేయునా ॥తగదిది॥
ఈసుని దాసుని చేతువా? అపసద! అపచారము కాదా?
కోలల కూలెడి అలసుడు కాదు అది దేవుడే, అతడు!
సేవలు జేసి ప్రసన్నుని జేయ, నా స్వామి నన్నేలు నోయీ.
నీ సాయమే వలదోయీ!
కాని పని, మదనా! అది నీ చేత కాని పని మదనా!
అహంకరింతువా హరుని జయింతువా? ॥అహంకరింతువా॥
అది నీ చేతగాని పని, మదనా!
కాని పని మదనా!
సామగ సాగమ సాధారా, శారదా నీరద సాకారా!
ధీనాథీనా, ధీసారా! సామగ సాగమ సాధారా!
విరులన్ నిను పూజసేయగా, విధిగా నిన్నొక గేస్తు జేయగా,
దొరకొన్న రసావతారు, చిచ్చర కంటన్ పరిమార్తువా, ప్రభూ!?
కరుణన్ గిరి రాజకన్యకన్ సతిగా తాము పరిగ్రహింపగా
మరుదేపునరూపున వర్ధిల్లగా రతి మాంగల్యము రక్షసేయవా, ప్రభూ ప్రభూ
పతిభిక్ష ప్రభూ!
అంబా అని అసమశరుడు నను పిలిచెను వినవో
జనకుడవై ఆదరణగ తనయునిగా జేకొనవో
మనమే నీ మననమై తనువే నీ ధ్యానమై
నీ భావన లీనమైన గిరిబాలనేలవో
శరణం భవ శరణం భవ శరణం భవ స్వామిన్
పరిపాలయ పరిపాలయ పరిపాలయ మాం పాహి
బిడియపడి భిక్షించి పెండ్లికొడుకైనట్టి జగమేలు తండ్రికి
జయమంగళమ్ ॥జగమేలు॥
విరులచే వరునిచే కరము చేకొన జేయు జగమేలు తల్లికి
జయమంగళమ్ ॥జగమేలు॥
కూచనపూడి భాగవతుల సేవలందు దేవదేవా,
శ్రీ వేణుగోపాల జయమంగళం: త్రైలోక్యమందారా, శుభమంగళమ్!

